THE LARGEST CIRCULATED TELUGU MONTHLY

# చతుర

ఏప్రిల్ 1999 ✤ రూ.7/-



# ప్రేమార్తి

-కోలపల్లి ఈశ్వర్

# చతుర ప్రపంచం

## ఫ్రోజెన్ ఫుడ్

రెండు రోజులు వరసగా కర్ఫ్యూవస్తే మనకి ఇంట్లో కూరగాయలుండవు. రోజూ తోపుడు బళ్లలో కూరలు ఇంటివద్దకే అమ్మకానికి వస్తుంటాయి.

అమెరికాలో అలా కాదు. ఫ్రోజెన్ (గడ్డకట్టిన) ఫుడ్ కేన్స్‌ని తెరచి వండుకుంటారు. ఫ్రోజెన్ ఫుడ్స్ పద్ధతిని కనుగొంది క్లారెన్స్ బర్ట్ ఐ. ఈ అమెరికన్ కెనడాలోని అత్యంత శీతల ప్రదేశంలో ఉండగా 1912లో ఈ విధానం కనుగొన్నాడు. అక్కడ మంచుగడ్డలమధ్య చేపలని భద్రపరచి వాడుకోవడం చూసాక ఈ ఆలోచన కలిగిందాయనకి.

అనేక పరిశోధనలు చేసి 1930లో అమెరికాలో ఫ్రోజెన్‌ఫుడ్‌కి పేటెంట్ తీసుకున్నాడు. 'బర్ట్స్ ఐ ఫ్రోజెన్ ఫుడ్ కంపెనీ'ని స్థాపించి 1930లో ఫ్రోజెన్ ఫుడ్ ప్రొడక్షన్‌ని ఆరంభించాడు. మొదటి ఏడే 22 లక్షల డాలర్ల విలువ గల సరుకు అమ్ముడైంది.

రెండో ప్రపంచ యుద్ధంలో పాల్గొన్న అమెరికన్ సైనికులకి భోజన రేషన్‌ని ఇతని కంపెనీయే సప్లై చేయడంతో కోటీశ్వరుడయ్యాడు. దాంతో రీసెర్చ్ డిపార్ట్‌మెంట్‌ని ప్రారంభించి మరికొన్ని పరిశోధనలు చేశాడు. ఫ్రోజెన్ ఫుడ్ కేన్స్‌ని భద్రపరచడానికి తప్పనిసరిగా ఫ్రిజ్ అవసరం వుంటుంది. ఫ్రిజ్ లేకుండా మామూలు వాతావరణంలో భద్రపరిచే భోజనపదార్థాన్ని ఇతని కంపెని రీసెర్చ్ విభాగం కనుగొంది. అదే డిహైడ్రేటెడ్ ఫుడ్. సహజంగా లభించే ఆహారపదార్థాల్లోని నీటిని పూర్తిగా తీసేసి, గాలి లేని (వాక్యూం) వాతావరణంలో (కేన్స్‌లో) దా



న్ని భద్రపరిస్తే బాక్టీరియా చేరి పాడవకుండా ఉండటం ఈ పద్ధతిలోని విశిష్టత.

ఇప్పుడు ఇండియాలోకూడా సూప్స్‌పాకెట్స్ లభ్యమయ్యేది ఈ డీహైడ్రేటెడ్ పద్ధతిలో తయారుచేసినవే.

ఫ్రోజన్ ఫుడ్స్‌కన్నా వీటికి గిరాకీ అధికం అవడానికి కారణం పిక్నిక్‌లకి తీసుకెళ్ళి అక్కడికక్కడే వాటిని వండుకునే సౌకర్యం ఉండటమే. అమెరికన్ ఆర్మీలో ఇన్‌స్టాంట్ భోజనాలమీద ఓ రీసెర్చ్ విభాగాన్ని రెండో ప్రపంచ యుద్ధం అయ్యాక నెలకొల్పారు. పొయ్యి లేకుండా, ఆహారం ఉడికే విధానాన్ని వాళ్ళు రూపొందించారు.

డీహైడ్రేటెడ్ పాకెట్‌ని చింపి అందులో చన్నీళ్ళు పోసి, పాకెట్‌ని మూసి వుంచితే, డీహైడ్రేటెడ్ ఫుడ్‌కి కలిపిన కొన్ని రసాయన పదార్థంవల్ల నీళ్ళు వేడెక్కి అందులోని ఆహారం వుడికి తినడానికి పన్నెండు నిముషాల్లో సిద్ధం అవుతుంది.

ఈ రకం బియ్యం పాకెట్లు అమెరికాలో మార్కెట్లో ఇప్పటికీ లభ్యం అవుతున్నాయి. పొయ్యి లేకుండా అలా అన్నం వండుకోవచ్చక్కడ. అమెరికన్ రాకెట్లలో రోదసిలో ప్రయాణించే వారి భోజన అవసరాలు అమెరికన్ ఆర్మీ భోజనాలయం వారు రీసెర్చ్‌లో కనుగొన్న ఈ రకం పద్ధతులవల్లే తీరుతున్నాయి.

---

# హెయిర్ టానిక్

'వృద్ధాప్యంలో కూడా శక్తినిచ్చి, శరీరంపై ముసలితనపు ఛాయలను కూడా లేకుండా చేస్తుంది ఉసిరికాయ' అంటున్నారు పురాతన భారతీయ ఆయుర్వేద వైద్యులు. 100 గ్రా. ఉసిరిలో 81.8 శాతం తేమ, 0.5 శాతం ప్రొటీన్, 1 శాతం కొవ్వు, 0.5 శాతం మినరల్స్, పీచుపదార్థం 4 శాతం, 13.7 శాతం కార్బోహైడ్రేట్లు వున్నాయి. కాల్షియం, ఫాస్ఫరస్, ఐరన్, కెరోటిన్, థయామిన్, రిబోఫ్లావిన్, నియాసిన్, విటమిన్ 'సి' ఇవన్నీ పుష్కలంగా వున్నాయి.

ముఖ్యంగా ఇందులో 'సి' విటమిన్ మరింత ఎక్కువ. ప్రయోగ ఫలితాలు చెప్పేదేమంటే 100 గ్రా. ఉసిరికాయల్లో 470 నుంచి 680 మిల్లీగ్రాముల వరకు 'సి' విటమిన్ వుంది. ఉసిరికాయల్ని ముక్కలుచేసి నీడన ఎండబెట్టి పొడిచేసుకుని నిలవచేసుకోవచ్చు. అలా చేసినా అందులో విటమిన్‌లేవీ నష్టపోవు. ఇది మానవుని ఆరోగ్యానికి ప్రకృతి ప్రసాదించిన వరం. ఆయుర్వృద్ధికి కూడా ఇది మంచి ఔషధంలా పనిచేస్తుంది. ఆయుర్వేద, యునాని వైద్యులు ఉసిరికాయలను ఎన్నో మందుల్లో ఉపయోగిస్తారు. మూత్రం సాఫీగా పోవడానికి కూడా ఇది ఔషధమే. ఈ చెట్టు వ్రేళ్ళు, బెరడు... ఋతు సమయంలో స్త్రీలలో అధిక రక్తస్రావాన్ని అరికడుతుంది. దీని రసాన్నిగానీ లేదా ఎండబెట్టిన పొడినిగానీ తేనెతో కలిపి కొన్నాళ్ళు తీసుకుంటే ఎన్నో రోగాలను ఉపశమింపచేయడమే కాక, శరీరానికి బలాన్ని కూడా ఇస్తుంది.

శ్వాసకోశ సంబంధిత రుగ్మతలకు ఇది మంచి మందు. ఊపిరితిత్తులకు సంబంధించిన క్షయకు, ఉబ్బసానికి, బ్రాంకైటీస్ మొదలైన వ్యాధులకి ఇది మంచి మందు.

ఇందులో అత్యధిక మోతాదులో వుండే విటమిన్ 'సి' డయాబిటిస్‌ని కంట్రోల్ చెయ్యడంలో కూడా ప్రముఖ పాత్ర వహిస్తుంది. ఒక చెంచాడు ఉసిరిరసం, ఒక కప్పుడు కాకరరసం కలిపి రెండు నెలలపాటు తాగగలిగితే పాంక్రియాస్ తిరిగి పనిచేసేలా చేస్తుంది. ఇన్సులిన్ విడుదలయ్యేలా చే

స్తుంది. అంటే రక్తంలో, మూత్రంలో వుండే గ్లూకోజ్ లెవెల్స్‌ని క్రమబద్ధం చేస్తుంది. కానీ ఈ వైద్యం చేస్తున్నంతకాలం ఆహారపు నియమాలను కూడా ఖచ్చితంగా పాటించాలి. డయాబిటిస్‌లో వచ్చే నేత్రవ్యాధులను కూడా ఇది అరికడుతుంది.

హృద్రోగాలకి కూడా ఉసిరికాయ చాలా బాగా పనిచేస్తుంది. శరీరంలో వుండే అన్ని అంగాలను చక్కగా పనిచేసేలా చూడ్డమే గాక, వ్యాధికారక క్రిములను నాశనం చేస్తుంది. నేత్ర సంబంధిత రోగాలకి కూడా దీన్ని ఔషధంగా ఉపయోగించవచ్చంటున్నారు వైద్యులు. నేత్రదృష్టిని వృద్ధిచేస్తుంది. కంటికలక, గ్లకోమా మొదలైన కంటిరోగాలను ఉసిరితో తగ్గించవచ్చు అంటున్నారు వైద్యులు. రెండు చెంచాల ఉసిరిపొడిని రెండు చెంచాల బెల్లంపొడితో కలిపి రోజుకు రెండుసార్లు ఓ నెలపాటు తీసుకుంటే కీళ్ళనొప్పులు తగ్గుతాయంటున్నారు. స్కర్వీ రోగానికి కూడా ఉసిరి ఔషధంగా పనిచేస్తుందని తెలుస్తోంది. దీని వేళ్ళని శుభ్రంగా కడిగి ఎండబెట్టి పొడిచేసి ఒక టీ స్పూన్‌లో సగానికి ఈ పొడిని తీసుకుని మిగిలిన సగం పంచదారను కలిపి మూడుపూట్లా పాలతో రోజూ తీసుకోవాలి.




డయేరియాకి, డిసెంట్రీకి కూడా ఎండబెట్టిన ఉసిరిపొడి చాలా మంచిది. ఉసిరిరసం, నిమ్మరసం, పటికబెల్లం పొడిని సమానపాళ్లలో కలిపి తీసుకుంటే ఈ పై రోగాలకు మంచి మందులా పనిచేస్తుంది.

ఇంకా దీన్ని గురించి చెప్పాలంటే ఇందులో మరో గొప్ప గుణముంది. ఇది హెయిర్ టానిక్‌లా పనిచేస్తుంది. జుట్టు రంగును నిలిపి, పెరిగేలా చేస్తుంది. ఉసిరికాయల్ని ముక్కలుగా తరిగి నీడలో ఎండబెట్టి వాటిని కొబ్బరినూనెలో వేసి మరగబెట్టి, వడగట్టి చల్లారబెట్టి తలకి రాసుకుంటే పెరుగుదలకి, నెరవకుండా వుండడానికి దోహదం చేస్తుంది. రాత్రి ఉసిరికాయ ముక్కలను నీటిలో నానవేసి ఆ నీటితో మర్నాడు తల మీద స్నానం చేస్తే (అంటే నీళ్ళుపోసుకోవడం పూర్తయ్యాక, ఆఖరున ఈ నీళ్ళు నెత్తిమీద పోసుకోవాలి) జుట్టు ఆరోగ్యవంతంగా వుంటుంది. జుట్టుకి మెరుపు, కాంతి వస్తుంది. దీన్ని పచ్చడిగాను, లేహ్యంగానూ కూడా చేసుకుని తింటారు చాలా మంది. ★

# చతురత కతలు

## హాట్‌డ్రింక్

"ఊహూ... నాకొద్దు..." తల అటుఇటు తిప్పాడు సుభాష్.

"ప్లీజ్..." రిక్వెస్టింగ్‌గా అన్నాడు సరోజ్.

"ఇంకేదైనా సరేగానీ దయచేసి అది మాత్రంవద్దు''

"దానికి మించి ఇంట్లో ఇంకేముంటుంది అనటం చూశాను."

"అవున్లే ఇప్పుడు హాస్యంగానే ఉంటుంది గానీ ముందుముందు ఆరోగ్యం పాడయితే అప్పుడు బాధపడతావు''

"ఇంతకీ నువ్వు నాకు కంపెనీ ఇస్తున్నావా లేదా...?"

"సారీ... ఇక్కడ్నుంచి వెళ్లిపొమ్మంటే వెళ్లిపోతాను..." కుర్చీలోంచి లేవబోయాడు సుభాష్.

ఇంతలో పక్కింటి వెంకట్రావు ప్రవేశించా



సుభాష్! అయినా ఈకాలంలో ప్రతిఒక్కరూ తాగేది అదయితేను''

"సరోజ్! నన్ను బలవంతపెట్టకు... లేనివి అలవాటు చెయ్యొద్దు''

"అదేం తప్పుకాదోయ్ నేనేం సిగరెట్లు కాల్చమనటంలేదుగా... గంజాయి పీల్చమనడంలేదుగా''

"కానీ, హాట్‌డ్రింక్ వాటికంటే డేంజర్.. తెలుసా..."

"హి...హ్హి...హ్హి... ఆమాట నువ్వొక్కడివే

డు ఆ యింట్లోకి.

"ఏంటోయ్ సరోజ్! ఏదో వాదులాడుకుంటున్నారు'' అంటూ.

"ఆ ఏంలేదు వెంకట్రావ్! ఇతను సుభాష్ అని నా బాల్యస్నేహితుడు. అనుకోకుండా బజార్లో కలిశాం. ఇల్లు చూపిద్దామని తీసుకొచ్చాను. తీరా ఇంటికొచ్చాక ఓ కప్ హాట్ డ్రింక్ తీస్కోవయ్యా అంటే యమసతాయిస్తున్నాడు'' కంప్లయింట్‌లా చెప్పాడు సరోజ్.

"చూడండి వెంకట్రావుగారూ! నేను మామూలుగా కూల్‌డ్రింకులే తాగటం తక్కువ. ఇక హాట్‌డ్రింక్ ఎలా తీసుకోను చెప్పండి.

అసలది నోటిదగ్గర పెట్టుకుంటేనే నాకు వాంతొస్తుంది'' చెప్పాడు సుభాష్!

కొత్తవ్యక్తి అలా పరిచయమైన క్షణాన్నే పేరు పెట్టి మాట్లాడితే అతడిపైన ఎవరికైనా ఇంట్రస్ట్ కలుగుతుంది. సుభాష్ విషయంలో అదే జరిగింది.

"అతను అంతగా అలవాటులేదని చెప్తుంటే నువ్వేమిటోయ్ బలవంతపెడతావు'' వెంకట్రావు అన్నాడు.

"ఆహా... పరిచయం చేసి క్షణం కాకుండానే ఇద్దరూ ఒకటైపోయారు'' మనసులో మెదిలింది పైకే గొణిగేశాడు సరోజ్.

సుభాష్ గెలిచినవాడిలా పోజుపెట్టాడు.

ఏదేమైనా నాకనవసరం... మీ యిద్దరూ ఇప్పుడు నేను తెచ్చే డ్రింక్స్ తాగుతున్నారు అంతే'' అంటూ లోపలికెళ్ళబోతున్న సరోజ్‌ని చెయ్యిపట్టుకుని ఆపాడు సుభాష్.

"ఒరే! చెప్పేది నీక్కాదూ... ఇలా అయితే ఇంకెప్పుడూ మీయింటికి రాను''

"అదేదో అంత ఘోరం, మహానేరం అయినట్టు మాట్లాడతావేమిట్రా... ఆరోగ్యం పాడవుతుందనేగా నీ బెంగ... అసలీమధ్య నువ్వు పేపర్ చూస్తున్నావో... లేదో... వైద్యశాస్త్రజ్ఞులు అనేక పరిశోధనలు జరిపి కాఫీ మంచిది కాదుగానీ టీ వల్ల అంత ప్రమాదం ఏమీలేదని చెప్తున్నారు... పైగా ఒకటి రెండు కప్పులైతే గుండెకు మేలుకూడా చేస్తుందట..."

"అంటే... అంటే... నువ్వునేది హాట్ డ్రింక్ మీన్స్... టీ, కాఫీలనా...!!"

"అవును! ఏం..."

"కొంపముంచావ్‌పో... నేనింకే బ్రాందీనో, విస్కీనో అనుకున్నాను''

**-పావులూరి శివాజీ**

---

# నమ్మకం

ఎట్టకేలకు వీరానందానికి రామచంద్రయ్యగారి ఆఫీస్‌లో గుమస్తా ఉద్యోగం లభించింది. ఆఫీస్‌లో జాయినయిన అతికొద్ది రోజుల్లోనే ఆఫీస్ స్టాఫందరిలోను గుమస్తా వీరానందంకు ఓ ప్రత్యేకత ఏర్పడిపోయింది. అందరితోను కలిసి, మెలసి ఉంటూ, సమయానుకూలంగా, జోక్స్ కట్ చేస్తూండడంతో ఆఫీసులో వీరానందం ఉంటే అందరికీ పెద్ద ఎంటర్‌టైన్‌మెంట్‌గా ఉండేది. వర్కంతా హేపీగా చేసేవారు స్టాఫంతా.

మేనేజర్ చెప్పిన ప్రతీపని టైం ప్రకారం చేసేస్తూ, "మనల్ని చూసి 'పని' భయపడాలి గానీ, 'పని'ని చూసి మనం భయపడకూడదు'' అనేవాడు హుషారుగా ఎంత హార్డ్‌వర్క్



చేసినా సరే. ఇలా పలువిధాల వీరానందం మేనేజర్ని బాగా ఆకర్షించగలిగాడు. అంతేకాకుండా క్యాష్ ఎవరికైనా పంపాలన్నా, తీసుకుని రావాలన్నా, లావాదేవీలన్నీ వీరానందం ద్వారానే ఎక్కువగా జరిగేవి.

ఓరోజు మేనేజర్ వీరానందాన్ని పిలిచి ఈ లక్షరూపాయలు నా పేరున బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్ వేసి రమ్మని చెప్పాడు.

"సార్! నా చేతికి లక్ష రూపాయలు ఇచ్చి పంపుతున్నారు. ఈ డబ్బులు తీసుకుని నేను ఎక్కడికైనా పారిపోతేనో?" అని ప్రశ్నించాడు నవ్వుతూ వీరానందం మేనేజర్ని. వీరానందం మాటలకు మేనేజర్ షాక్ తిన్నాడు. ఒక నిముషం మౌనం దాల్చి, "అంత సీను లేదు. నువ్వు అలా చేయవు. చాలా నిజాయితీ పరుడివి. నాకు నీమీద చాలా 'దృఢమైన నమ్మకం' ఉంది'' అని వీరానందంపై తన మనసులో నమ్మకాన్ని వ్యక్తపరిచాడు మేనేజర్.

"ఇంతకీ ఈ డబ్బు ఎన్ని సంవత్సరాలకు వేయమంటారు?"

"ఐదున్నర సంవత్సరాలకు వేయి. రెట్టింపు ఇస్తార్ట' చెప్పాడు మేనేజర్.

"మీరు ఏమీ అనుకోకపోతే నేను మళ్ళీ అడుగుతున్నాను. నామీద మీకు అంత 'నమ్మకం' ఎందుకు?"

మళ్ళీ షాక్ తిన్నాడు మేనేజర్, ఎందుకు వీడు ఇలా మాటమాటకి రెట్టించి అడుగుతున్నాడని అనుకుంటూ "నీ వర్కుని చూసి, నీ ప్రవర్తనను బట్టి నీమీద 'నమ్మకం' ఏర్పడింది'' అన్నాడు కొంచెం కోపంగా.

"నామీద మీకున్న దృఢమైన నమ్మకానికి చాలా... చాలా థాంక్స్. అయితే ఈ ఎమౌంట్ మాత్రం మీరు చెప్పినట్లు నేను బ్యాంక్‌లో డిపాజిట్ చేయను. నే తీసుకుంటాను. ఈ క్యాష్‌ను రొటేషన్ చేస్తూ ఏదైనా సైడ్ బిజినెస్ ఓపెన్ చేస్తా. మీ డబ్బు మీకు ఐదున్నర సంవత్సరాలకే గ్యారెంటీగా నేను రెట్టింపు ఇచ్చేస్తాను. కావాలంటే ఈ విషయాలు బాండ్ వ్రాసి సైన్ చేస్తా'' అన్నాడు నవ్వుతూ.

మేనేజర్‌కు కళ్ళు తిరిగి, కింద పడేంత పనైంది.

-గుండాబత్తుల శ్రీనివాస్

---

# పిసినారి

విశాఖపట్నం వెళ్ళే బండి గోదావరి స్టేషన్‌లో ఆగింది. ఆ రైలుకోసం వేచివున్న ఓ ముసలాయన దగ్గరకి వచ్చి అడిగాడు రైల్వే పోర్టర్ మళ్ళీ.

"జనరల్ కంపార్ట్‌మెంట్ ఆ చివర వుంది. మీకు సీట్ చూపించి పెట్టె ఎక్కిస్తాను. ఆఖరిమాట రెండు రూపాయలిస్తే చాలు'' అందుకు ముసలాయన నిరాకరించాడు.

"రెండుకి నేను తప్ప ఎవరూ రారు''

ముసలాయన ఆ పెద్ద పెట్టెని తన భుజాలమీదకి ఎక్కించుకుని, ఆపసోపాలు పడుతూ, ఆరైలు బండికి ఆఖరులో వున్న జనరల్ కంపార్ట్‌మెంట్ దగ్గరకి నడిచి వెళ్ళాడు. అర్ధరాత్రి కాబట్టి, అన్‌సీజన్ కాబట్టి రద్దీగా లేదు.

ఆయన ఆ పెట్టెని ఎక్కించి ఖాళీగా వున్న ఓ సీట్‌లో కూర్చుని జేబులోంచి ఉండగా వున్న పాత న్యూస్‌పేపర్‌ని తీసి మొహానికి పట్టిన చెమటని తుడుచుకున్నాడు. మాసిపోయిన ఆ వుండని పారేయకుండా మళ్ళీ జేబులో దాచుకున్నాడు.

రైల్లో అంతా నిద్రకి కునుకుతున్నారు కాబట్టి ఆ ముసలాయన్ని పట్టించుకోలేదు. రైలు రాజమండ్రి స్టేషన్‌లో ఆగింది. అది బయలుదేరబోయేముందు నల్లటి కోటు, తెల్లటి దుస్తుల్లో వున్న టిక్కెట్ కలెక్టర్ ఎక్కాడు. నిద్రలో జోగుతున్న ఒకొక్కర్ని లేపి

వాళ్ళ టిక్కెట్లని తనిఖీ చేయసాగాడు. టిక్కెట్ లేని ఒకరిదగ్గర ఫైన్‌తోసహా టిక్కెట్ డబ్బుని కలెక్ట్ చేసి రసీదు రాసిచ్చాడు.

టి.సి. రావడం గ్రహించిన ముసలాయన బాత్‌రూమ్‌లోకి జారుకోబోయాడు కాని ఆయన కేకేసి పిలిచి చెప్పాడు.

"టిక్కెట్ ప్లీజ్"

ముసలాయన ఓ సారి జేబులు తడుముకుని చెప్పాడు.

"పోయినట్లుంది''

దిగు''

"దిగను. రేపటికల్లా విశాఖపట్నంలో ఓ పెళ్ళికి వెళ్ళాలి''

"అయితే డబ్బు కట్టు''

"నా వయసు అరవై అయిదు పైనే. సీనియర్ సిటిజన్‌కి కన్సెషన్స్ వుండాలిగా?"

"నేను చెప్పింది ఆ కన్సెషన్ రేటే''

"నన్ను ఉరితీసినా సరే. నా దగ్గర ఇరవై రూపాయలు మించి లేవు''

అప్పటికే పధ్నాలుగు గంటలు రిసీవర్ రాక, డ్యూటీ చేసిన ఆ టి.సి. కోపాన్ని



"ఎక్కడ ఎక్కారు?"

"గోదావరి''

"ఎక్కడికెళ్ళాలి?"

"విశాఖపట్నం"

అతను ఓ ప్రింటెడ్ రైల్వే బుక్‌ని రిఫర్ చేసి చెప్పాడు.

"ఫైన్‌తో కలిపి నూటతొంభైనాలుగు రూపాయలు కట్టాలి''

"నాదగ్గర అంత లేదు''

"ఈ పెట్టె ఎవరిది?"

"నాదే''

"దీనికి లగేజ్ కూడా పడుతుంది''

"నా దగ్గర మొత్తం ఇరవైరూపాయలున్నాయంతే" చెప్పాడా ముసలాయన.

"కడితే డబ్బు కట్టు. లేదా వచ్చే స్టేషన్‌లో

ఆపుకోలేక అరిచాడు.

కంపార్ట్‌మెంట్ తలుపు తెరిచి "డబ్బు కట్టు. లేదా ఈ పెట్టెని బయటకి తోసేస్తాను''

"ఒద్దొద్దు... నాన్నగారూ ఆ డబ్బుకట్టండి'' పెట్టెలోంచి ఆ ముసలాయన కూతురు కంఠం సన్నగా వినిపించింది.

"కట్టను''

"కట్టండి. మీ ఒక్కరికే డబ్బుకట్టినా మనకింకా లాభమే''

ఆ ముసలాయన భార్య కంఠం ఈసారి పెట్లోంచి వినిపించింది.

-యం. శ్రావ్య



**"నా హృదయం ఖాళీగా వుంది. అవివాహిత యువతులెవరైనా దాన్ని ఫిలప్ చేసుకోండి..." అంటూ వివరాలతో సహా అచ్చేసి వెదజల్లబడిన ఆ కరపత్రాలు ఆడపిల్లలను ఆకర్షించాయి**

కొద్దిమందే అయినా ఒక్కొక్కరే ఇంటర్వ్యూకి రావడం ప్రారంభించారు. అప్సరస అనదగిన ఓ కోటీశ్వరుడి కూతురు పడవలాంటి కారులోంచి దిగి వయ్యారంగా అతనివద్దకు వచ్చి అతని హృదయంలోని ఖాళీని తానే భార్యగా ప్రవేశించి భర్తీ చేస్తానంది.

మరి అతను "నో" అనడానికి కారణం ఏమిటి? అందుకు ఆగ్రహోదగ్రురాలైన ఆమె అతనిపై పగబూని చేసిన, చేయించిన ఘాతుకాలేమిటి? అంత ఐశ్వర్యవంతురాలు ఓ మధ్యతరగతి యువకుణ్ణి పెళ్ళాడతాననడం వెనకగల కారణాలేమిటి? అతడామెను తిరస్కరించి ఎవరిని వివాహమాడాడు?

**కడుపుబ్బ నవ్వించే కోలపల్లి ఈశ్వర్ హాస్యరచన 'ప్రేమూర్తి' ఈ నెల 'చతుర' సమగ్ర నవల**

# ప్రేమూర్తి

## కోలపల్లి ఈశ్వర్



"నా హృదయం ఖాళీగా ఉంది. ఏ అవివాహిత యువతి అయినా ఫిలప్ చేసుకో వచ్చు.

వయోపరిమితి: కనిష్ఠం-18 సంవత్సరాలు. గరిష్టం-22 సంవత్సరాలు.

విద్యార్హతలు: కనిష్ఠం- టెన్త్‌క్లాస్‌లో ఉత్తీర్ణత. గరిష్ఠం- గుర్తింపు పొందిన ఏ యూనివర్శిటీనుండైనా బ్యాచులర్స్ డిగ్రీ ఫెయిలైన వారు కూడా అర్హులే.

ముఖ్య నిబంధన: అభ్యర్థినులు విధిగా అందగత్తెలై ఉండవలెను.

ఆసక్తి అర్హతలున్న అభ్యర్థినులు సంప్రదించవలసిన చిరునామా:

టి. సూరిబాబు,

హౌస్‌నెంబర్: 6/3/1380.

వీధి: సినిమాహాల్ దాటాక మూడో వీధిలో నాలుగో సందు.

పేట: సీతాఫల్‌మండి.

ఊరు: సికింద్రాబాద్-500 061.

'విచిత్రమైన కరపత్రం' అనుకుంది, అమల అందులోని విషయం చదివాక.

పద్మారావునగర్‌నుండి బేగంపేటలో ఉన్న తన స్నేహితురాలు బబితను కలవడానికెళ్తున్నప్పుడు ఆటో ఒలిఫెంటా బ్రిడ్జ్ అనబడే చీకటిగుహలోంచి బైటకొస్తుండగా ఎక్కణ్ణుంచో గాలికెగిరొచ్చి ఆమె ఒళ్లోపడిందా కరపత్రం.

సాధారణంగా ఆ ఏరియాలో...

"నరముల బలహీనతా? జీవితంలో అతి ముఖ్యమైన సౌఖ్యాన్ని పొందలేకపోవుచున్నారా? విచారం వలదు. వెంటనే ఈ దిగువ చిరునామాకు స్వయంగా వచ్చి సంప్రదించండి'' లాంటి కరపత్రాలు పంచుతూ ఉంటారు. లేదా అవి ఏ మూలనుండో విసరబడుతూ ఉంటాయ్. లేదా ఇప్పుడీ కరపత్రమొచ్చినట్టే గాలికెగిరొచ్చి మీద పడుతూనూ ఉంటాయ్. ఆ మార్గంగుండా తరచు వెళ్ళేవారికి అదేం కొత్త విషయం కాదు.

అమల కూడా ఆ మార్గంగుండా తరచుగానే వెళ్తుంటుంది. గనుక అకస్మాత్తుగా ఒళ్లోపడిన కాగితాన్ని చూసి బెదిరిపోలేదు. ఇదీ ఆ బాపతే అనుకుని దాన్ని చదవకుండానే నలిపేయబోయిందామె.

కానీ సదరు కరపత్రం! 'కునేగా' సువాసనల్ని వెదజల్లుతూ ఉండటంతో అదోరకమైన ఆసక్తిలాంటిది ఏర్పడి అందులోకి దృష్టి సారించిందామె.

తీరా చూస్తే విషయం ఇది!

ఎవడీ తిక్క సూరిబాబు?

ఇంటిపేరు టి. అంటే తిక్కావారు కావచ్చు. అయినా ఇదేం తిక్కపని?

హృదయమనేది అద్దెకిచ్చే ఇల్లులాంటిదా? ఆసక్తి గల అమ్మాయిలొచ్చి ఆక్రమించుకోవచ్చని కరపత్రాలు పంచడానికి?

చూడబోతే వీడెవడో నిజంగానే తిక్కవెధవలా ఉన్నాడు.

మనసులో అలా అనిపించినా...

సదరు సూరిబాబునోసారి చూసేతీరాలని కూడా అనిపించడంవల్ల దాన్ని జాగ్రత్తగా మడిచి తన హ్యాండ్‌బ్యాగ్‌లో నిక్షిప్తం చేసేసింది అమల.

★ ★ ★

'ఏమిటీ వైపరీత్యం?' అనుకుంది రాగిణి ఆ కరపత్రాన్ని చూడగానే.

వీడెవడు? వీడికసలు మతుందా?!

'నా హృదయం ఖాళీగా ఉంది. ఏ ఆడపిల్లయినా ఫిలప్ చేసుకోవచ్చు' అని పాంప్లెట్స్ పంచినంత మాత్రాన పొలోమంటూ ఆడపిల్లలందరూ ఎగబడిపోతారనుకుంటున్నాడన్నమాట!

ఎంత పిచ్చి ఆలోచన!

ఎంత అర్థరహితమైన పని!

అసలు తలకాయలో మెదడున్న వాళ్లెవరయినా చేస్తారా ఇలాంటి పనులు?




నిస్సందేహంగా వీడొక మెదడులేని ఖాళీ బుర్ర మానవుడు అయ్యుంటాడు.

వీడి సంగతేంటో ఒక్కసారి చూడాల్సిందే.

అలా అనిపించడంతో చించిపారేద్దామనుకున్న ఆ కరపత్రాన్ని నాలుగు మడతలుగా మడిచి తన పర్సులో భద్రపరిచింది రాగిణి.

ఆ కరపత్రం బస్‌లో వెళ్తుండగా ఎగిరొచ్చి తన కాళ్ల దగ్గర పడింది.

★ ★ ★

వీధిగుమ్మంగుండా రాకెట్‌లా దూసుకొచ్చి తన కాళ్ల దగ్గర మెట్లమీద పడిన న్యూస్‌పేపర్ని ఆత్రంగా చేతిలోకి తీసుకుంది సుజాత.

ఓపెన్ యూనివర్శిటీలో బియ్యే చదవాలని ఎంట్రన్స్ పరీక్ష రాసిఉందామె.

ఆరోజు రిజల్ట్స్ రావల్సి వుంది.

అందుకే అంత ఆత్రంగా ఆమె పేపర్ని చేతిలోకి తీసుకుంది.

అలా తీసుకోగానే పేజీలు తిరగెయ్యక ముందే గుప్పుమంటూ కునేగా సెంటువాసన ఆమె నాసికాపుటాల్ని సోకింది.

ఆ తర్వాత ఆమె దృష్టి ఆ పేపర్లోంచి జారిపడిన ఓ కరపత్రంమీద పడింది.

రోజ్‌కలర్ మేనిఫోల్డ్ పేపర్‌మీద నీట్‌గా ప్రింట్ చేయబడిన కరపత్రం అది.

రిజల్ట్ సంగతి తాత్కాలికంగా మర్చిపోయి చటుక్కున కిందకొంగి ఆ కరపత్రాన్ని చేతిలోకి తీసుకుందామె.

"నా హృదయం ఖాళీగా..." టి. సూరిబాబు వెలువరించిన కరపత్రమే అది.

ఏమిటీ పిచ్చిపని?

ఎవ్వడీ మహాద్భుత పిచ్చిసన్నాసి?

సహజంగానే కుతూహలం కలిగింది ఆమెక్కూడా.

ఈ వింత మానవుడెలా ఉంటాడో ఓసారి చూసి తీరాల్సిందే అనుకుంటూ ఆ కరపత్రాన్ని మడిచి టీపాయ్ మీదున్న ఫ్లవర్‌వాజ్ కింద పదిలపరిచి, దరిమిలా రిజల్ట్‌కోసం న్యూస్ పేపర్ని తిరగేసిందామె.

★ ★ ★

"చాలా ఫన్నీగా ఉంది కదూ?!" అన్నాడు శ్యామ్రావ్ ఆ కరపత్రాన్ని భార్యకు చూపుతూ.

వి.యస్.టి. దగ్గర సిక్స్ నంబర్ బస్ కోసం ఎదురు చూస్తుండగా బస్టాప్‌లో ఒకాయన చదువుతున్న మాగజైన్‌లోంచి సువాసనలు వెదజల్లుతూ నేలమీద పడి దొరికింది అతనికా కరపత్రం.

"నిజమేనండీ'' అంది నిర్మల అందులోని విషయాన్ని చదివి.

"దీన్ని చూస్తుంటే నా కొకటి తోస్తోంది."

"ఏమిటది?"

"వీడెవడో ప్రేమకోసం అల్లాడిపోతున్న అమాయకపు వెధవల్లే ఉన్నాడు''

"ఆ సంగతి ఆ కరపత్రాన్ని బట్టి అర్థమవుతూ ఉందిగా?"

"సో... ఈ అవకాశాన్ని మనం సద్వినియోగం చేసుకోవాలి''

"అంటే?"

"ఏముందీ మన శ్రావణి చేత ఓ అప్లికేషన్ పడేయిద్దాం. వాడెలాగూ ప్రేమకోసం వెంపర్లాడుతున్న మనిషే కాబట్టి- ఠక్కున ఒప్పేసుకుంటాడు'' చూశావా నాకెలాంటి సూపర్లైడియా వొచ్చిందో అన్నట్టుగా కళ్లెగరేస్తూ చెప్పాడు శామలరావు.

"...కోడు'' అంది నిర్మల ఏమాత్రం గ్యాప్ తీసుకోకుండా.

"ఏం, ఎందుకని?"

"ముఖ్య నిబంధన అన్నచోట ఏముందో చూడండి''

"అభ్యర్థినులు విధిగా అందగత్తెలై ఉండవలెను'' భార్య చేతిలోంచి కరపత్రాన్ని చేతిలోకి తీసుకుని పైకి చదివి-

"అంటే నీ ఉద్దేశం ఏంటి? మా శ్రావణి

అందగత్తె కాదనా?" అన్నాడు శ్యామలరావు ఒకింత కోపంగా.

శ్రావణి శ్యామలరావు చెల్లెలు.

"ఫేసూ, నోసూ బాగానే ఉంటాయ్‌లెండి. కానీ వాటెబవుట్ ఆకారం?" అంది నిర్మల ఇంగ్లీష్‌నీ తెలుగునీ మిక్సప్ చేస్తూ.

"ఆకారం కొంచెం పెద్దదే అనుకో..."

"కొంచెమేం ఖర్మ, బాగా పెద్దది'' ఆడపడచు స్థూలకాయాన్ని మనసులోకి తెచ్చుకుని విచిత్రంగా చేతులు తిప్పుతూ అంది నిర్మల.

"అవును బాగా పెద్దది. చెల్లాయి ముందు టున్ టున్, కల్పనారాయ్‌లు ఏపాటి?" అని మనసులో అనుకుని...

"కానీ ఈ కరపత్రంలో ఆకారం సంగతి ప్రస్తావించబడలేదుగదా? 'స్థూలకాయురాళ్లు అనర్హులు' అని ఎక్కడాలేదుగదా?" అన్నాడు శ్యామలరావు పైకి.

"సరే ప్రయత్నించి చూడండైతే' అనేసింది నిర్మల లోలోన నవ్వుకుంటూ.

★ ★ ★

"రమా రమా! చూడవే ఇది?"

"ఏమిటి ఉషా అది?"

"ఒక విచిత్రమైన పాంప్లెట్'

"ధమాకా సేల్సా? ఒక చీరకొంటే ఆరు చీరలు ఉచితం అంటున్నారా ఏం?"

"కాదు. వీడెవడిదో హృదయం ఖాళీగా ఉందట. కావాలంటే ఏ ఆడపిల్లయినా అందులోకి దూరిపోవచ్చట. ఒకసారి చూడు. నీకే అర్థమవుతుంది'' అంటూ తన చేతిలోని కరపత్రాన్ని రమ కందించింది ఉష.

"వీడెవడో మెంటల్‌గాడల్లే ఉన్నాడుకదూ?" చదివాక అంది రమ.

"సెంట్ పర్సెంట్ మెంటల్‌గాడే. అందులో సందేహంలేదు'' స్నేహితురాలి మాటల్ని సమర్థించింది ఉష.

"మరైతే వీణ్ణొక ఆట ఆడిద్దామా?"

"ఎలా?"

"ఎలా ఏముందీ? చెరో అప్లికేషనూ పడేద్దాం. ఇంటర్వ్యూకి పిలుస్తాడుగా. అప్పుడు పడదాం ఓ పట్టు'' అంటూ నవ్వింది రమ.

"అలాగే అలాగే' అంది ఉష ఉత్సాహంగా.

★ ★ ★

తమ్ముడి దగ్గర 'కునేగా' సువాసనలు రావడంతో,

"సెంట్ పూసుకున్నావా? ఎక్కడిదిరా?" అనడిగింది సుజీవన.

"సెంటు కాదక్కా! ఈ కాగితమే ఇలా మంచి కంపుకొడుతోంది'' అన్నాడు బుజ్జి అనబడే ఏడేళ్ల వినీత్ తన చేతిలోని కాగితం పడవని అక్కకందిస్తూ.

సుజీవన ఆ పడవనోసారి వాసన చూసి, "అవున్రా'' అంది కొంచెం ఆశ్చర్యంగా.

ఆ పడవమీద 'ఖాళీగా ఉం' అనే అక్షరాలు కనిపించడంతో "ఏంటబ్బా ఖాళీగా ఉంది?" అనుకుని.

"దీన్ని నాకిస్తావా?" అనడిగింది తమ్ముణ్ణి.

"తీస్కో అక్కా!" అనేశాడు వాడెంతో ఉదారంగా. కాగితం పడవేగదా! కావాలంటే మళ్ళీ మరోటి చేస్కోవచ్చునన్న ధీమా వాడిది.

అందుకే తన ఔదార్యాన్ని అలా వ్యక్తం చేశాక, "కూ చుక్ చుక్' అంటూ రైలుబండి అవతారం దాల్చి వాడక్కణ్ణుంచి స్పీడుగా వెళ్ళిపోయాడు.

సుజీవన ఆసక్తిగా ఆ పడవని విప్పి నలుచదరంగా ఉన్న ఆ కాగితాన్ని సాపు చేసింది.

'నా హృదయం ఖాళీగా ఉంది. సంప్రదించవలసిన చిరునామా: టి. సూరిబాబు' అంతవరకే ఉందా కాగితంలో.

పూర్తి చిరునామా మిస్సైపోయింది.

"ఇదేదో చాలా గమ్మత్తుగా ఉందే?" అను




కున్న సుజీవన "రేయ్ బుజ్జీ! దీని తాలూకు ఇంకో ముక్కేదిరా?" అంటూ తమ్ముణ్ణి వెతుక్కుంటూ వెళ్ళింది.

మెట్లమీద కూర్చుని ఓ చెక్కముక్కకి సుత్తితో మేకు కొడుతూ కనిపించాడు వాడు.

"దీని తాలూకు ఇంకో ముక్కేదిరా?" సుజీవన మళ్ళీ అడిగింది వాణ్ణి.

"ఏ ముక్క?" అంటూ అక్క చేతిలోని కాగితంకేసి చూసి "ఆ ముక్కా?" అన్నాడు వాడు.

"అవునాముక్కే ఏదది?"

"చేతిని రుద్దుకుని ఎక్కడో పారేశానక్కా'' అన్నాడు వాడు సిన్సియర్‌గా నిజాన్నొప్పేసుకుంటూ.

"పారేస్తే ఆ ఉండైనా ఎక్కడో పడుండాలిగా?" అంది సుజీవన.

"ఏమోనక్కా గుర్తులేదు'' అనేశాడు వాడు పెదవి విరుస్తూ.

"అసలీ కాగితం నీకెక్కడ దొరికింది?" అడిగింది సుజీవన.

"రోడ్డుమీద దొరికింది. ఇంకా చాలా పడున్నాయి! ఒకటి తెమ్మంటావా?"

తమ్ముడలా అడగ్గానే 'హమ్మయ్యా' అనుకుని "ఊఁ అర్జంటుగా తీసుకురా'' అంది సుజీవన.

వాడు వెంటనే "పువ్వాఁయ్...పువ్వాఁయ్'' అంటూ బస్సురూపం ధరించి వీధిలోకి పరుగుతీశాడు.

★ ★ ★

"నా బొంద! ఏంట్రా ఈ పిచ్చిపని?" అన్నాడు కనకలింగం మిత్రుడికేసి జాలిగా చూస్తూ.

మాటకు ముందు 'నా బొంద' అంటూ ఉంటాడు కాబట్టి అతన్నందరూ బొందగాడు అనే అంటూ ఉంటారు.

"మరేం చెయ్యమంటావురా? ఎవర్నో ఒకర్ని గాఢంగా ప్రేమించాక మాత్రమే పెళ్లి చేస్కోవాలన్న నా కోరిక నెరవేరడానికి నాకింతకన్న మంచి మార్గం కనిపించలేదు మరి'' అన్నాడు సూరిబాబు తన చేష్టని సమర్థించుకుంటూ.

"నా బొంద! ఇది మంచి మార్గమా? ఎవర్రా నీకు చెప్పిందీ? బోడి సలహా'' కనకలింగం వెర్రిచూపు చూస్తూ అడిగాడు.

"కాదంటావా?" ఎదురుప్రశ్న వేశాడు సూరిబాబు.

"నా బొంద! దీన్ని చూసి నీకు మెంటలేమో అనుకుంటారు ఎవరైనా సరే' నవ్వాలో ఏడ్వాలో అర్థంగాక, నెత్తి బాదుకుంటూ అన్నాడు కనకలింగం.

"ఏం అనుకోరు'' అంటూ మిత్రుడి మాటల్ని ఖండించాడు సూరిబాబు.

అప్పటికే కొన్ని వందలమంది అలా అనుకున్నారని పాపం అతనికేం తెలుసు?

"నా బొంద! మరేమనుకుంటారు?" ఒకింత వ్యంగ్యంగా అడిగాడు కనకలింగం.

"అనేకమంది ఆడపిల్లలు దీన్నొక గోల్డెన్ ఆపర్చ్యూనిటీగా భావిస్తారు'' కాన్ఫిడెంట్‌గా అన్నాడు సూరిబాబు.

"ఎందుకటా?" వ్యంగ్యాన్ని రెట్టింపు చేస్తూ అడిగాడు కనకలింగం.

"ఎందుకేమిటీ? మన రాష్ట్రంలో వరకట్న సమస్య ఎంత తీవ్రంగా వుందో నీకు తెలీదా? ఎందరో ఆడపిల్లలు పెళ్లి చేసుకోవడానికి తగిన అర్హతలన్నీ వుండి కూడా కేవలం కట్నం ఇచ్చుకోలేని కారణంగా అవివాహితలుగా మిగిలిపోతున్నారు. నన్నీ బాధల్నుంచి విడిపించే నాథుడే లేడా అని కుమిలిపోతున్నారు. కొంతమందైతే జీవితంమీద విరక్తి పుట్టి ఆత్మహత్యలు కూడా చేసుకుందామనుకుంటున్నారు. అలాంటి వాళ్లంతా దీన్ని తప్పకుండా ఓ సువర్ణావకాశంగానే భావిస్తారు. మన కరపత్రంలో 'హృదయం ఖాళీగా ఉంది. ఆసక్తిగల అభ్యర్థినులు ఫిలప్ చేస్కోవచ్చు' అన్నామే తప్ప కట్నం విషయం మెన్షన్ చెయ్యలేదుగదా సో..." అంటూ

సూరిబాబు ఇంకా ఏదో చెప్పబోతుండగా.

"నా బొంద" అంటూ అతనికి మధ్యలోనే అడ్డుపడ్డాడు కనకలింగం.

"ఏమైంది నీ బొందకి?"

"ఏమీ కాలేదు. కానీ 'మన' కరపత్రం అంటూ మధ్యలో నన్ను కూడా కలపబాకు. మన కాదు నీది. కేవలం నీ ఒక్కడి తిక్కచేష్టే!"

"అంటే నాది తిక్కచేష్టంటావ్?" కాస్త ఉక్రోషంగా అన్నాడు సూరిబాబు.

"అందులో సందేహం లేదు. నీ బోడి కరపత్రాన్ని అందరూ చించిపారేస్తారే తప్ప ఒక్కరు కూడా నిన్నప్రోచ్ అవ్వరు'' కుండ లుబద్దలు గొట్టినట్టే అన్నాడు కనకలింగం.

"అది కేవలం నీ అపోహ మాత్రమే! కరపత్రాలు పంపిణీ చేసింది ఇవ్వాళేగదా! ఒకరెండ్రోజులాగు. దాని ఫలితం ఎలా ఉంటుందో నీకే తెలుస్తుంది'' ధీమాగా అన్నాడు సూరిబాబు.

"ఎలా ఉంటుంది? తండోపతండాలుగా మనింటిముందు ఆడపిల్లలు క్యూ కట్టేస్తారా?"

"ఖచ్చితంగా అంతే జరుగుతుంది. బహుశా రద్దీని కంట్రోల్ చెయ్యడం కోసం మనం పోలీసుల సహాయాన్ని తీస్కోవాల్సి కూడా రావచ్చు''

"నీ బొంద! ఒకవేళ అదే నిజమనుకున్నా అలా వచ్చే వాళ్లందరూ ఇందాక నువ్ చెప్పిన ప్రకారం కట్నం ఇచ్చుకోలేక కన్యలుగా మిగిలిపోయిన అభాగ్యురాళ్లే అయ్యుంటారుగదా! అంటే అందరూ వృద్ధకన్యలే వస్తారుగదా? దానివల్ల నీక్కలిగే ప్రయోజనం?" అంటూ ఓ అనుమానాన్ని వ్యక్తం చేశాడు కనకలింగం.

"నా కరపత్రాన్ని సరిగ్గా చూడకుండానే నోటికొచ్చినట్టల్లా మాట్లాడతావేం? అందులో వయోపరిమితి విధించాంగా. ఎయిటీన్ టు ట్వంటీటూ అంటూ. సో నువ్వన్నట్టు వృద్ధకన్యలూ, ముదురుకేసులూ వచ్చే అవకాశమే లేదు'' అంటూ అతని మాటల్ని కొట్టిపారేశాడు సూరిబాబు.

'నిజమేగదా!' అనుకున్నాడు కనకలింగం.

అయినప్పటికీ మిత్రుడు చేసింది 'మంచి పనే' అని మాత్రం అనిపించలేదతనికి.

"సరే చూద్దాంగదా?" అనేశాడు ఇంక వాదన పెంచుకోకుండా.

★ ★ ★

ఓ మంచంమీద కనకలింగం గుర్రుపెట్టి నిద్రపోతుంటే, మరో మంచంమీద వెల్లకిలా పడుకుని రూఫ్‌కేసి చూస్తూ ఆలోచనలో పడ్డాడు సూరిబాబు.

పుట్టిపాతికేళ్లయింది.

వయసొచ్చి ఏడేళ్లయింది.

ఈ ఏడేళ్లలో డెబ్భైకి పైగా ప్రయత్నాలు చేశాడు తను, ఎవర్నో ఒకర్ని ప్రేమిద్దామని.

కానీ అదేం విచిత్రమో ఒక్కరంటే ఒక్కరు కూడా 'ఊఁ' అనలేదు తన ప్రేమకి.

అందుక్కారణం- తను అందంగా ఉండకపోవడం కాదు. తనకి చదువులేకపోవడం కాదు. ఆస్థి లేకపోవడం అంతకన్నా కాదు.

చదువు, అందం, ఆస్థి అన్నీ వున్న నవయువకుడే తను. అయినప్పటికీ ఏ ఒక్క ఆడపిల్లనీ తానాకర్షించలేకపోయాడూ అంటే తనకి ప్రేమించే టెక్నిక్ తెలియకపోవడం ఒక్కటే కారణం.

ప్రేమించడం కూడా ఒక కళే. కొంతమంది తమలో ఏమీ లేకపోయినా అమ్మాయిల్ని ఇట్టే పడేయగలుగుతారు.

కానీ ఎందుచేతనో మరి తనకా కళ అబ్బిచావలేదు.

పేరుకి డెబ్భై ప్రయత్నాలన్నమాటేగానీ అందులో ఏ ఒక్కరితో కూడా మనసు విప్పి 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను'' అని చెప్పలేకపోయాడు తను.

భయం... సంకోచం... మొహమాటం.





ఇలా ఏమిటేమిటో అడ్డొచ్చి ఎవరితోనన్నా 'ఐ లవ్ యూ' అనబోయినప్పుడల్లా తన నోటిని నొక్కేస్తూ ఉంటాయ్!

అలాంటప్పుడు ఏ ఆడపిల్ల మాత్రం తన నెలా ప్రేమిస్తుంది?

అడిగితేనేగదా అమ్మయినా పెట్టేది?

అందుకే... నోరు తెరిచి అడగటం తనకె లాగూ చేతకాదు కాబట్టే... ఇప్పుడిలా కరప త్రాన్ని వేయించాడు తను.

ఫలితమెలా ఉంటుందో ఒకట్రెండ్రోజులా గితేగానీ తెలియదు.

కనకలింగం అన్నట్టు తనది వృధా ప్రయ త్నమైతే కాబోదు.

ఒకటా? రెండా? ఇరవైవేల పాంప్లెట్లు వెయ్యించాడాయె. జంటనగరాల్లోని అన్ని ప్రాంతాల్లోనూ వెదజల్లించాడాయె. తెలుగు దినపత్రికలన్నింట్లో 'ఇన్సర్ట్' చేయించి సిటీ అంతా సర్క్యులేట్ అయ్యేలా చూశాడాయె.

ఓ ట్వంటీఫైవ్ పర్సెంట్ గాలికి గట్రా ఎగిరిపోయి మురుక్కాలవల్లో పడిపోయి వేస్ట్ అయిపోతాయనుకున్నా ఇంకా ఓ పది హేనువేలు సర్క్యులేషన్లో ఉంటాయిగదా!

వాటిలో ఫిఫ్టీ పర్సెంట్ మాత్రమే ఆడవాళ్ల చేతుల్లోకి వెళ్తాయనుకున్నా ఒక్కో పాంప్లె ట్నీ ఒక్కరే చదువుతారనుకున్నా ఏడువేల అయిదువందల మంది స్త్రీలకి తన గురించి తెలుస్తుంది.

వాళ్లలో ఓ ఫిఫ్టీ పర్సెంట్ పెళ్లయినవాళ్లు ఉంటారనుకున్నా మూడువేల ఏడువందల యాభైమంది పెళ్లికాని అమ్మాయిలకి తన గురించి తెలుస్తుంది.

వాళ్లలో ఓ ఫిఫ్టీ పర్సెంట్ పెళ్లీడుకు రానివాళ్లుంటారనుకున్నా పద్దెనిమిది వందల డెబ్బయ్యయిదు మంది పెళ్లీడమ్మా యిలకు తన గురించి తెలుస్తుంది.

వాళ్లలో కనీసం టెన్పర్సెంట్ తన కరప త్రాన్ని చూసి రెస్పాండైతే చాలదా?

టెన్దాకా ఎందుకు? వన్ పర్సెంట్ రె స్పాండయినా చాలు పద్దెనిమిది మందవుతా రు.

ఆ పద్దెనిమిదిమందీ అష్టదరిద్రంగానే ఉండరుగదా?

వారిలో తన మనసుకు నచ్చే అమ్మాయి ఒక్కర్తైనా ఉండకపోదుగదా?

కాలిక్యులేటర్ చేతిలో లేకుండానే అలా లెక్కేసి చూసుకున్నాక అతనికి చాలా తృప్తి గా అనిపించింది.

సరే లెమ్మని ఇంక ధీమాగా నిద్రపోయా డు.

★ ★ ★

మర్నాడు పొద్దున్నే సూరిబాబు వాళ్ల రూమ్ని క్లీన్గా అద్దంలా సర్దేస్తుంటే 'వీ డేంటిలా విరగబడిపోతున్నాడు. సాధార ణంగా ఇక్కడి పుల్లతీసి అక్కడ పెట్టడుగదా' అనుకున్న కనకలింగం ఆ మాటే అడిగాడు.

"ఇవ్వాళ ఎవరైనా వస్తారేమోనని సర్దుతు న్నా" అన్నాడు సూరిబాబు.

"ఎవరైనా అంటే?" అనడిగాడు కనక లింగం పాంప్లెట్ సంగతి మర్చిపోయి.

"అదేరా! నా పాంప్లెంట్ చూసి ఎవరైనా వస్తారేమోనని" అంటూ బిడియంగా నవ్వా డు సూరిబాబు.

"నా బొంద! దాన్ని చూసి ఎవరొస్తార్రా?" అన్నాడు కనకలింగం నాలుక చప్పరించే స్తూ.

"అలా అనొద్దు. నేను పంపిణీ చేసిన మొత్తం కరపత్రాలు ఇరవైవేలు. అందులో ఓ ట్వంటీఫైవ్ పర్సంట్ వేస్టయిపోతాయనుకు న్నా ఇంకా పదిహేను వేలు మిగుల్తాయ్. అందులో ఓ ఫిఫ్టీపర్సెంట్ మగాళ్ల చేతుల్లోకి పోతాయనుకున్నా" అంటూ ప్రారంభించి, రాత్రి తాను మనసులో వేసుకున్న ఆ లెక్కల న్నీ మళ్లీ వేసి చెప్పి... "కనీసం ఓ పద్దెని మిది మందైనా రావటానికి ఆస్కారముంది" అంటూ తేల్చి చెప్పాడు సూరిబాబు.



# ఏరిన ముత్యాలు

★ ఏదో బలహీనతవల్ల ఏర్పడిన కామంకన్నా స్వచ్ఛమైన ప్రేమ మనస్సు మీద ఎక్కువ ప్రభావం కలిగి ఉంటుంది.

–సోక్రటీసు

★ పరిశ్రమాభివృద్ధితోపాటు పెట్టుబడిదారీ వర్గం అదనపు విలువలతో పాటు శ్రామికవర్గాన్ని కూడా ఉత్పత్తి చేస్తుంది. వారితోపాటు అవకాశవాదుల్ని కూడా దారిలో సృష్టిస్తుంది.

–ఏంగిల్స్

★ రేపటి పని నేడే చేయి. సాయంత్రం పని ఉదయమే చేయి. ఎందుకంటే మనిషి తన పని పూర్తిచేశాడా లేదా? అని మృత్యువు ఆగదు.

–మహావన్

★ న్యాయంకోసం కోర్టుకు వెళ్లడం అంటే పిల్లికోసం ఆవును వదులుకోవడంవంటిది.

–చైనా సామెత

★ పొగడ్త పన్నీరువంటిది. దానిని వాసనచూసి వదిలివేయాలేగాని తాగకూడదు.

–జాన్‌బిల్లింగ్స్

★ దృఢమైన, సాహసోపేతమైన విప్లవకర చర్యలకు అండగా నిలవాలనే భావం శ్రామిక ప్రజాబాహుళ్యాన్నంతా ఆవరించి వుండాలి. అప్పుడే విప్లవ పరిస్థితులు పరిపక్వమయినట్లు.

–లెనిన్

★ కష్టాలకు జంకనివాడు, కష్టాలనుండి పారిపోయి దాక్కునేవాడు కాకుండా- కష్టాలను ఎదుర్కొని వాటిని తుదముట్టించేందుకు పోరాడేవాడే కార్యకర్త

–స్టాలిన్

★ రాజకీయాలలో ఒక్కొక్కసారి రాక్షసితో కూడా ఒప్పందానికి రావలసి వస్తుంది. అయితే నువ్వు రాక్షసికి ఉపయోగపడుతున్నావా? రాక్షసిని నువ్వు వాడుకుంటున్నావా? అన్నది అసలు ప్రశ్న.

–మార్క్స్

★ సక్రమమైన నిర్మాణం లేకుండా ఏ రాజకీయపార్టీ కూడా మనజాలదు.

–ఏంగిల్స్

★ తప్పుచేశామనే ఇంగితజ్ఞానం లేకపోవడం అన్ని తప్పులలోకి గొప్పది.

–కార్‌లైల్

★ నీ తప్పులను, నీ తెలివితక్కువ పనులను నీ ముందు నిదానంగా నివేదించే వాడే నిజమైన స్నేహితుడు.

–స్మిత్

– సేకరణ: కొట్టగడ్డ వెంకట్రావు

"ఐ డోంట్ థింక్ సో. పద్దెనిమిది మంది కాదు గదా, కనీసం ఒన్ పాయింట్ ఎయిట్ మంది కూడా వస్తారని నేననుకోను'' అంటూ మిత్రుడి ఉత్సాహంపై నీళ్ళు చిలకరించాడు కనకలింగం.

మనసులో బాధపడినా "సరే చూద్దాంగా'' అనేశాడు సూరిబాబు పైకేమీ కోపగించుకోకుండా.

ఓ అరగంటలో సర్దుడు కార్యక్రమం పూర్తయింది.

దరిమిలా సూరిబాబు నీట్‌గా డ్రెస్ చేసుకుని ఓ కుర్చీలో ఠీవీగా కూర్చున్నాడు.

"అదేంటి? ఇవ్వాళ ఆఫీస్‌కి పోవా?" ఆశ్చర్యంగా అడిగాడు కనకలింగం.

"ఎవరన్నా వస్తే నిరాశగా వెనుదిరిగి వెళ్ళిపోతారు గదా! అందుకనే కొన్నాళ్ళు ఆఫీస్‌కి శలవు పెట్టేస్తున్నా'' అన్నాడు సూరిబాబు.

"అదేం పిచ్చిపనిరా? కొన్నాళ్ళంటే ఎన్నాళ్ళు?"

"ఓ వారం పదిరోజులు''

"ఆ తర్వాత నీ దగ్గరకొచ్చే నారీమణుల ప్రవాహం ఆగిపోతుందంటావా?"

"అనే అనుకుంటున్నాను''

"నీ బొంద" అన్నాడు కనకలింగం అంతకన్నా ఇంకేమనాలో తోచక.

"ఎవరిపిచ్చి వారికానందం" అని కూడా అనుకున్నాడు మనసులోనే.

సూరిబాబు ఆ రోజంతా రూమ్‌లోనే ఉండి రాగల అభ్యర్థినుల కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

కానీ ఒక్కరుకూడా రాలేదు.

సూరిబాబుకి చాలా నిరాశగా అనిపించింది.

అయినా ధైర్యాన్ని మాత్రం కోల్పోలేదు.

ప్రకటనలో తాను లాస్ట్ డేట్ అంటూ ఏమీ ఇవ్వలేదు గదా!

కాబట్టి నెమ్మదిగా రేపోమాపో వస్తార్లే అని సరిపెట్టుకున్నాడు.

కనకలింగం మాత్రం మిత్రుడికోసం తన డ్యూటీ మానుకోలేదు.

ఎప్పటిలాగే ఆరోజు కూడా అతను డ్యూటీకి వెళ్ళిపోయాడు. అతను పనిచేసేది ఓ కొరియర్ ఆఫీసులో.

సూరిబాబు పనిచేసేది ఓ 'చిట్ ఫండ్స్' ఆఫీస్‌లో. ఇద్దరివీ చెప్పుకోదగ్గ ఉద్యోగాలేం కావు. ఇంకా పెద్ద ఉద్యోగాలకోసం ఒకపక్క ప్రయత్నాలు చేస్తూనే, ఫర్ టైం బీయింగ్ ఈ ఉద్యోగాలు చేస్తున్నారంతే!

మూడేళ్ళక్రితం ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజ్ దగ్గర ఏర్పడిన పరిచయం వాళ్ళిద్దర్నీ స్నేహితులుగా మార్చింది. దరిమిలా ఇలా చిరుద్యోగాలు సంపాదించి ప్రస్తుతమిలా రూమ్మేట్స్ కూడా అయ్యారు.

కనకలింగానికైతే ఉద్యోగం ఒక అవసరం.

కానీ సూరిబాబు మాత్రం కేవలం పురుష లక్షణం కదాని చేస్తున్నాడంతే. నిజానికతనికి ఉద్యోగం లేకపోయినా దర్జాగా బతికేయగలడు.

ఎందుకంటే అతని ముత్తాత అంత మంచివాడు.

తండ్రికొంతా, తాతకొంతా తగలేసినా ఇంకా ఓ రెండు తరాలపాటు కూర్చుని తిన్నా తరగనంత ఆస్తి ఉంది సూరిబాబుకి. అంటే అతని ముత్తాత అంత సంపాదించాడన్న మాట!

అందుకే తండ్రినీ, తాతనీ ఎప్పుడూ తల్చుకోకపోయినా ముత్తాతని మాత్రం మదిలో వీలైనప్పుడల్లా స్మరించుకుంటూనే ఉంటాడు సూరిబాబు. ముత్తాత ఫోటోకి తరచుగా పూలమాల కూడా మారుస్తుంటాడు.

★ ★ ★

ముత్తాత ఫోటోకి పూలమాల మార్చి "ముత్తాతా నన్నాశీర్వదించు'' అని మన

సులో అనుకుని, ఆరోజు కూడా తన కరపత్ర అభ్యర్థినులకోసం... అంటే తన కరపత్రాన్ని చూసి రాగల రమణీమణులకోసం రూమ్‌లో ఠీవిగా ఎదురుచూస్తూ కూర్చున్నాడు సూరిబాబు.

అది రెండో రోజన్నమాట.

కాలం నత్తలా నడుస్తుంటే చిరాకెత్తిపోయింది సూరిబాబుకి.

పోదా మరి?

ఉదయం పదింటినుంచి ఎదురుచూస్తుంటే మిట్టమధ్యాహ్నం పన్నెండయినా కూడా ఒక్కరూ రాలేదాయె!

'సిటీలో ఉన్న ఆడపిల్లలెవరికీ బుద్ధీ, జ్ఞానం ఉన్నట్టుగా లేవు' అనుకున్నాడు కసిగా.

లేకపోతే ఏంటి?

పోన్లే కదాని అవకాశమిస్తే ఒక్కర్తికూడా దాన్ని వినియోగించుకోకపోవడం ఏంటి?

అలా అనుకుంటుంటే అతనిలోని కసి రెట్టింపైంది.

హృదయం ఖాళీగా ఉందని ఎలుగెత్తి చాటినా ఒక్కర్తికూడా దాన్నాక్రమించడానికి రాలేదూ అంటే ఔరా! ఈ అతివలెంత మూర్ఖులు?!!

ద్విగుణీకృతమైన కసితో అతనలా అనుకుంటూ ఉండగా

"ఎక్స్‌క్యూజ్‌మీ! మే ఐ కమిన్ ప్లీజ్?" అంటూ వాకిట్లో ప్రత్యక్షమైంది ఓ అందాల అతివ.

అంటే మరీ అప్సరసని కాదు గానీ, ఓ మోస్తరు అందంగానే ఉందామె.

ఆమెని చూడగానే సూరిబాబు మనసులో కసీ, కోపం, చిరాకుల్లాంటివన్నీ ఎటో ఎగిరిపోయాయి.

సహజంగానే అతని ముఖం ప్రకాశవంతమయ్యింది.

"ఎస్ గెటిన్' అన్నాడామెకేసి ఆనందంగా చూస్తూ.

ఆమె వయ్యారంగా నడుచుకుంటూ లోపలికొస్తుంటే 'హంసగమన' అని అనుకోకుండా ఉండలేకపోయాడు సూరిబాబు. నిజానికతనికి హంస ఎలా ఉంటుందో తెలీదు. దాని నడకెలా ఉంటుందో అంతకన్నా తెలియదు. అయినా అతనలా అనుకోకుండా ఉండలేకపోయాడు.

"మే ఐ టేక్ ది సీట్?" ఆమె సూరిబాబుకెదురుగా ఖాళీగా ఉన్న కుర్చీదగ్గరికొచ్చి అడిగింది.

"ఎస్'' అన్నాడు సూరిబాబు గంభీరంగా.

ఆమె కూర్చున్నాక అడిగింది "టి. సూరిబాబు అంటే మీరేనా?"

"అవునండీ నేనే. మీరు నా కరపత్రాన్ని చూసొచ్చారా?" అడిగాడు సూరిబాబు ఆత్రంగా.

"అవునండీ'' అందామె సూరిబాబుకేసి ఎగాదిగా చూస్తూ.

"మీపేరు?" స్టార్ట్ చేశాడు సూరిబాబు ఇంటర్వ్యూ.

"అమల" చెప్పిందామె.

"వెరీ నైస్ నేమ్'' అనుకున్నాడు సూరిబాబు.

"ఎంత వరకూ చదువుకున్నారు?"

"బి.కాం."

"వయసెంత?"

"ఇరవై రెండు''

"వెరీగుడ్! సర్టిఫికెట్సూ అవీ తెచ్చారా?"

"దేనికి?" ఆమె ఎదురుప్రశ్న వెయ్యడంతో ఖంగుతిన్నాడు సూరిబాబు.

"అదేంటండీ అలా అంటారు? మీరు చెబుతున్న వివరాలన్నీ నిజమో కాదో కన్‌ఫర్మ్ చేసుకోవాలి గదా?" అన్నాడు బుర్ర గీరుకుంటూ.

"దేనికి?" ఆమె చిరునవ్వు నవ్వుతూ మళ్ళీ అదే ప్రశ్న వేసింది.

'మెంటలా ఏంటి?' అనుకోకుండా ఉండ లేకపోయాడు సూరిబాబు.

"అదేంటండీ అలా అంటారు? నా కరప త్రాన్ని చూసి ఓ అభ్యర్ధినిగా వచ్చారు మీరు. అలాంటప్పుడు నేను సర్టిఫికెట్స్ అవీ అడగడంలో తప్పేముందీ?" అన్నాడు కించిత్ అయోమయంగా.

"నేను మీ కరపత్రాన్ని చూసొచ్చిన మాట నిజమే కానీ మీరనుకుంటున్నట్టు ఓ అభ్యర్ధి నిగా మాత్రం రాలేదు''

ఆమె అలా అంటుంటే సూరిబాబులోని అయోమయం రెట్టింపయ్యింది.

"మరి?" అన్నాడు ముక్కుమీద గీరు కుంటూ.

"మీ కరపత్రం చూశాక మీరు చాలా విచిత్రమైన మనిషనిపించింది నాకు. మీరె లా ఉంటారో ఓసారి చూసి పోదామని వచ్చానంతే''

ఆమె అలా అంటుంటే మతిపోయినట్టే అనిపించింది సూరిబాబుకి.

అంటే ఈవిడగారు 'జూ'లోని మృగాన్ని చూసినట్టు తనని చూడ్డానికొచ్చిందన్న మాట!!!

ఆ నిజం అర్ధమయ్యాక అతని మనసులో భయంకరమైన ఆవేదన ఏర్పడిపోయింది.

"నిజంగా అందుకే వచ్చారా మీరు?"

"అవునండీ! విచిత్రమైన మనుషుల్ని చూ డాలనిపించడం సహజమే గదా?"

"చూశారుగా. ఇంక దయచేయండి'' అన్నాడుక్రోషంగా.

"మీరు చాలా అఫెండయినట్టున్నారే?" అందామె కాస్త జాలిగా.

"అవనా మరి? నేనేదో వింత మృగాన్న యినట్టు పనిగట్టుకుని నన్ను చూడ్డానికి రావడం నాకుబాధ కలిగించదా?"

సూరిబాబు ముఖాన్న గంటుపెట్టుకుని అలా అంటుంటే "సారీ అండీ'' అందామె.

'ఇట్సాల్ రైట్' అన్నట్టుగా తల పంకించా డు సూరిబాబు.

"నా రాకవల్ల మీరిలా బాధపడతారని నేనూహించలేదు. ఎక్కడన్నా అయిదుకాళ్ళ ఆవుందంటే గభాల్న వెళ్ళి చూసేయాలని పిస్తుంది గదా! అలాంటి ఆవేశమే వచ్చి మిమ్మల్ని చూడ్డానికిలా పరిగెత్తుకుంటూ వచ్చాను. ఏది ఏమైనా ఒకందుకు మాత్రం నేను సంతోషిస్తున్నాను'' అందామె.

"దేనికీ?" అడిగాడు సూరిబాబు.

"నేనూహించినట్టుగా మీరు బఫూన్‌లా లేరు. పైగా చాలా హాండ్సమ్‌గా ఉన్నారు."

ఆమె అలా అనేసరికి సూరిబాబులో అణగారిపోయిన ఆశ మళ్ళీ చిగురించింది.

"మరైతే ఇహనేం? నా హృదయాన్ని ఫిలప్ చేసుకునే విషయాన్ని పరిశీలించొచ్చు గా?" అన్నాడాశగా.

"హాండ్సమ్‌గా ఉన్నది మీరు. అంతేగానీ మీ హృదయం కాదు. ఇలాంటి పిచ్చిపిచ్చి కరపత్రాల్ని పంచేవాళ్ళని ఏ ఆడపిల్ల మా త్రం ఎలా ప్రేమిస్తుందండీ? సారీ ఫర్‌ది ట్రబుల్. వెళ్ళొస్తానండీ'' అంటూ లేచి నిలబ డిందామె.

"మంచిది'' అన్నాడు సూరిబాబు ముక్తస రిగా.

ఆమె లాస్ట్ అండ్ ఫైనల్‌గా అతనికేసి మరొక్కసారి ఆసక్తిగా చూసి వెళ్ళిపోయింది. బుద్ధి ఎలాంటిదైనా మనిషికి తోక ఉండటం అసాధ్యమని ఆమెకు తెలుసు.

అయినా సరే వెళ్తూ వెళ్తూ ఆమె అలా ఓసారి చూడకుండా ఉండలేకపోయింది.

ఆమె వెళ్ళిపోయాక-

సూరిబాబు ముత్తాత ఫొటో దగ్గరికి పరు గు తీశాడు.

"ఏంటి ముత్తాతా ఇది? నన్నాశీర్వదించ మంటే ఇలా చేశావేంటీ?" అనుకున్నాడు ముత్తాతగారి కళ్ళలోకి ఆవేదనగా చూస్తూ.

★ ★ ★

"ఏంట్రా అలా ఉన్నావ్?"

అప్పుడే ఆఫీస్‌నుండి వచ్చిన కనకలింగం దిగాలుగా కూర్చునున్న సూరిబాబుని చూసి అడిగాడు.

"ఎలా ఉన్నాను?" నవ్వడానికి ప్రయత్నిస్తూ అన్నాడు సూరిబాబు.

"ఈకలు పీకేసిన కోడిపెట్టలా ఉన్నావు'' అంటూ ఉపమానించి "నీ దిగులుకి కారణం?" అన్నాడు కనకలింగం.

చెప్పుకుంటే సిగ్గుచేటని నోరు మెదపలేకపోయాడు సూరిబాబు.

"ఈరోజు కూడా ఎవ్వరూ రాలేదా?" జాలిగా అడిగాడు కనకలింగం.

"రాకేం ముగ్గురొచ్చారు. కానీ..."

"ఊс కానీ?"

"అందరూ నన్నూరికే చూసిపోదామని వచ్చారంతే''

"ఊరికే చూసిపోవడానికా? అంటే?" నిజంగానే విషయమేంటో అర్థంకాక అడిగాడు కనకలింగం.

అమల వచ్చిపోయింతర్వాత రాగిణి, సుజాత అనే ఇంకో ఇద్దరమ్మాయిలు కూడా వచ్చి తనని చూసిపోయిన వైనాన్ని గుర్తుకు తెచ్చుకుని, వ్యధాభరిత హృదయంతో అదంతా మిత్రుడికి వివరించాడు సూరిబాబు.

"సో... వచ్చిన ముగ్గురూ చోద్యం చూడ్డానికొచ్చారే తప్ప, క్యాండిడేట్స్‌గా రాలేదన్నమాట!"

"అవును''

"ఏమన్నారు నిన్ను చూసి?"

"నేనేదో విచిత్రంగా ఉంటాననుకుని వచ్చారట. కానీ తద్భిన్నంగా చాలా హాండ్సమ్‌గా ఉన్నానంటూ మెచ్చుకునిపోయారు'' అర్ధనిజం పలికాడు సూరిబాబు. నిజానికలా అన్నది అమల ఒక్కర్తే. మిగతా ఇద్దరూ అతని అందాన్ని గురించి ఒక్కమాట కూడా మాట్లాడలేదు. అయినా కాస్త ఘనంగా ఉంటుందని అలా కోసేశాడు సూరిబాబు.

"మరైతే నీ హృదయాన్ని వాళ్ళ స్వంతం చేస్కోమనలేకపోయావా?" అతని మాటల్ని నమ్మేస్తూ అన్నాడు కనకలింగం.

"అన్నాను''

"దానికి వాళ్ళేమన్నారు?"

"ఇలా పాంప్లెట్స్ పంచేవాళ్లని ఏ ఆడపిల్లా ప్రేమించదని తెగేసినట్టు చెప్పిపోయారు'' అమల చెప్పిన మాటల్నే మిగతా ఇద్దరికొక్కడా అన్వయిస్తూ అన్నాడు సూరిబాబు.

"సో ఇన్‌డైరెక్ట్‌గా నువ్వొక వెర్రిబాగులోడివి సుమా అని చెప్పిపోయారన్నమాట"

"అంతమాట వాళ్ళేమీ అనలేదు''

"నీబొంద! డైరెక్ట్‌గా అంటేనే అన్నట్టా? నువ్ చెప్పిందాన్నిబట్టి వాళ్ళు నిన్నొక వెర్రిపీనుక్కింద జమకట్టి పోయారని తెలుస్తూనే ఉంది. నే ముందే చెప్పలా, నీ కరపత్రాలు సత్ఫలితాన్నివ్వవని'' మిత్రుణ్ణి గాయపర్చాలని కాకపోయినా జరిగిన విషయం నిజంగానే హాస్యాస్పదంగా ఉన్నందున ఎగతాళిగా అన్నాడు కనకలింగం.

అయినా సూరిబాబు కృంగిపోలేదు.

"ఇవ్వాళ్టితో అయిపోయినట్టు కాదుగా! రేపు మంచి క్యాండిడేట్స్ రావచ్చు. చూస్తుండు'' అన్నాడు చెక్కుచెదరని ఆశాభావంతో.

"నీ బొంద. రేపు కూడా ఇలాంటి వాళ్ళే వస్తారు''

"ఏం కాదు. రేపు మంచివాళ్ళొస్తారు''

"అంటే నిన్ను వింతమృగం అనుకోనివాళ్ళంతా మంచివాళ్ళా?" కనకలింగం మిత్రుడికేసి జాలిగా చూస్తూ అన్నాడు.

"అవును'' సూరిబాబు స్థిరంగా పలికాడు. "నా పాంప్లెట్ ప్రేమార్తిని అర్థం చేసుకోగలిగేవాళ్ళు నిస్సందేహంగా మంచివాళ్ళే!"

"ప్రేమార్తి. భలే పేరు పెట్టావే పైత్యానికి?" అంటూ నవ్వేశాడు కనకలింగం.





"సరే నీ హెూప్‌ని నేనెందుకు కాదనాలి? లెటజ్ వెయిట్ అండ్ సీ'' అనేశాడు మిత్రుణ్ణి మరింత బాధపెట్టడం దేనికిలెమ్మని.



మర్నాడు-

ఉదయం పదీ నలభై అయిదవుతుండ గా...

"టి. సూరిబాబుగారంటే మీరేనా?" అంటూ గుమ్మంలో ప్రత్యక్షమైంది ఇంకో అందాల అతివ.

ఆ అందాల అతివ పక్కనే ఇంకో అందాల అతివ కూడా ఉండడం చూసి సూరిబాబు కాస్త కన్ఫ్యూజయ్యాడు.

ఒకేసారి ఇద్దరు కాండిడేట్స్ వచ్చారన్న మాట.

ఇప్పుడేం చెయ్యడం?

ఇద్దర్నీ ఒకేసారి ఇంటర్వ్యూ చేస్తే బా వుండదేమో?

ఒకర్ని వరండాలో వెయిట్ చెయ్య మని చెప్పాలి. కానీ వయసులో వున్న ఒక ఆడపిల్లని వరండాలో వెయిట్ చెయ్యమ నడం బావుంటుందా?

ఈ విధమైన ఆలోచనలో పడి అడిగిన అతివకు జవాబివ్వడాన్ని కూడా అతను మర్చేపోయాడు.

"మాట్లాడరేమండీ? మిమ్మల్నే అడుగు తుంట. సూరిబాబుగారంటే మీరేనా?"

ఆమె మరోసారి రెట్టించి అడిగాక అప్పుడీ లోకంలోకొచ్చాడు.

"ఆ నేనే... రండ్రండి'' అన్నాడు కూర్చు న్న కుర్చీలోంచి లేచి నిలబడుతూ.

"నాపేరు రమ. దీనిపేరు ఉష. మేమి ద్దరం క్లోజ్ ఫ్రెండ్స్. మొన్న మా కాలేజీగేటు దగ్గర మాకు మీ కరపత్రం దొరికింది. దాన్ని చూసొచ్చాం"

"అయితే ఇద్దరూ ఫ్రెండ్సేనన్నమాట. సో నో ప్రోబ్లం" అనుకుని

"ముందు మీరు లోపలికి రండి'' అన్నా డు సూరిబాబు.

దాంతో ఆ అతివలిద్దరూ లోపలికొచ్చి అతను చూపించిన సోఫాలో పక్కపక్కనే కూర్చున్నారు.

"మీలో రమ ఎవరు, ఉమ ఎవరు?" అడిగాడు సూరిబాబు వాళ్ళిద్దరూ కూర్చు న్నాక.

"ఉమ కాదు ఉష. నాపేరు రమ, దాని పేరు ఉష" అంది రమ.

'ఉన్నది ఒక్క హృదయం. ఎట్ ఎ టైమ్ ఇద్దరొస్తే ఎలా?' అని మనసులో అనుకుని వాళ్ళిద్దరికేసీ మార్చిమార్చి చూశాడు సూరి బాబు.

తన హృదయంలో ఎవరికి చోటిస్తే బా వుంటుందో ముందు తాను డిసైడ్ చేస్కో వాలి గదా! అందుకే అతనలా మార్చి మార్చి చూశాడన్నమాట.

చూడ్డం అయ్యాక.

'ఇద్దరూ బాగానే ఉన్నారు. ప్రేమించబుల్ గానే ఉన్నారు. కాబట్టి ఎవరైనా నో ప్రోబ్లం' అనుకుని.

"ఊ చెప్పండి'' అన్నాడు సూరిబాబు.

"ఏం చెప్పమంటారు?" అడిగింది రమ.

"అదే నా కరపత్రం గురించి మీ రియా

క్షన్' అన్నాడు సూరిబాబు స్టైయిల్‌గా కాలు మీద కాలేసుక్కూర్చుంటూ.

"యూ మీన్..."

"ఐ మీన్ నా పాంప్లెట్ చూశాక మీలో కలిగిన స్పందన వగైరా..."

"ఏముందీ చాలా హ్యాపీగా ఫీలయ్యాం. మగవాళ్ళంతా సంతలోని పశువుల్లా కట్నా నికమ్ముడుపోతున్న ఈరోజుల్లో ఇల్లడ్డెకిచ్చి నంత ఈజీగా నా హృదయం ఖాళీగా ఉంది. ఆసక్తి గలవారు ఫిలప్ చేస్కోవచ్చంటూ మీరు ప్రకటించడం రియల్లీ వెరీవెరీ గ్రేట్. నూటికో కోటికో ఒక్కరుంటారు మీలాంటి ఆదర్శపురుషులు'' అంది రమ.

రెండు చెవుల్లోనూ రెండు గరాటులు దోపి వాటిలో తేనె పోస్తున్నట్టుగా అనిపించింది సూరిబాబుకి ఆమె అలా అంటుంటే.

అంటే ఆ పలుకులు అతనికి అంత తియ్యగా అనిపించాయన్నమాట.

'అబ్బ! ఇన్నాళ్ళకు నా మంచితనాన్ని అర్థం చేసుకోగలిగే అతివలు తారసపడ్డారు' అనుకున్నాడానందంగా.

"మీ ఇద్దరికీ అలాగే అనిపించిందా?" అడిగాడు కుతూహలంగా

"మా ఇద్దరివీ ఒకే భావాలండీ! చెప్పేను గదా ఇద్దరం 'క్లోజ్ ఫ్రెండ్స్' అని. ఇద్దరికీ అలాగే అనిపించింది. అందుకే మీ విశాల హృదయంలో చోటు కోరి వచ్చాం" అంది రమ.

రెండు చెవుల్లోనూ రెండు గరాటులు దోపి వాటిలో తేనెతో పాటు పంచదార కూడా కలిపి పోస్తున్నట్టుగా అనిపించింది సూరిబాబుకి.

అంటే వీళ్ళు అభ్యర్థినులుగానే వచ్చారన్నమాట.

తనలో వింత మృగాన్ని చూసినట్టు చూసిపోవడానికి రాలేదన్నమాట.

ఎంతదృష్టమెంతదృష్టం?!!





'ఆ కుళ్ళుమోతు కనకలింగంగాడు కరపత్రం సత్ఫలితాన్నివ్వదన్నాడు' అని మనసులో మిత్రుణ్ణి కసిగా తిట్టుకుని,

"చాలా సంతోషమండీ'' అన్నాడు సూరిబాబు.

ఒక్క క్షణమాగి "కానీ ఒక చిన్న సమస్య'' అన్నాడు ముక్కుమీద గీరుకుంటూ.

"ఏంటది?" అడిగింది రమ.

"అన్నీ మీరే మాట్లాడుతున్నారు. మీ ఉమగారికి మాటలు రావా?"

"వచ్చు. కానీ దానిపేరు ఉమ కాదు ఉష. అద్సరే ముందు మీరు మీ సమస్యేంటో చెప్పండి'' అంది రమ.

"ఏం లేదండీ! నాది విశాల హృదయమే అయినప్పటికీ అందులో మీ ఇద్దరికీ చోటివ్వలేను. కేవలం ఒక్కరికి మాత్రమే ఇవ్వగలను. ఈ విషయంలో మీరు నా అశక్తతని సహృదయంతో అర్థం చేసుకోవాలి'' ఎంతో బాధగా ముఖంపెట్టి అన్నాడు సూరిబాబు.

"తెలుసు'' అంటూ నవ్వింది రమ.

ఎదుటి వ్యక్తి మెంటల్ అనిపించినప్పుడు ఖచ్చితంగా నవ్వే వస్తుంది ఎవరికైనా.

"మరైతే ఈ సమస్యకు పరిష్కారం ఏంటో కూడా మీరే చెప్పాలి'' అన్నాడు సూరిబాబు.

"ఏముంది వెరీ సింపుల్. మా ఇద్దర్లో మీకెవరు నచ్చితే వాళ్ళకే మీ హృదయాన్నివ్వండి'' నాలుక చప్పరించేస్తూ చాలా తేలిగ్గా అంది రమ.

"అలా చేస్తే మీలో ఒకరి హృదయం గాయపడుతుంది కదా?"

"పడదు. ఎందుకంటే ఒకరికోసం ఒకరు దేన్నయినా త్యాగం చేసుకోగలిగేటంత గొప్ప స్నేహం మాది. మీ హృదయాన్ని మీరు మాలో ఎవరికిచ్చినా రెండోవాళ్ళు బాధపడటం అనేది జరగదు'' ఉభయుల తరఫునా తానే హామీ ఇస్తూ అంది రమ.

"మీరేమంటారు ఉమగారూ?" ఎందుకయినా మంచిదని రెండో అతివని కూడా

అడిగి చూశాడు సూరిబాబు.

"దానిపేరు ఉమ కాదు ఉష. ముందే చెప్పేనుగా మా ఇద్దరివీ ఒకటే అభిప్రాయాలని. నా మాటే దానిమాట. దాని మాటే నా మాట" అంది రమ.

సదరు రెండో అతివ 'మరే' అన్నట్టుగా తలాడించిందే తప్ప నోరుతెరిచి ఒక్కముక్క కూడా మాట్లాడలేదు.

దాంతో సూరిబాబుకి సహజంగానే సందేహం వచ్చేసింది.

కొంపదీసి మూగది కాదుగదా అని.

అలా అనిపించాక వాళ్ళిద్దర్నీ మరింత నిశితంగా పరిశీలించాడు.

ఇద్దరూ తెల్లగా పొడుగ్గానే ఉన్నారు.

ఇద్దరూ సన్నజాజి తీగల్లాగానే ఉన్నారు.

ఇద్దరి ముక్కులూ సంపెగ పువ్వుల్లాగే ఉన్నాయి.

ఇద్దరి కళ్ళూ కలువరేకుల్లాగే ఉన్నాయి.

ఇద్దరి ముఖాలూ చంద్రబింబాల్లాగే ఉన్నాయి.

అంటే ఇద్దరూ సేమ్‌టుసేమ్. ఒకేలా ఉన్నారని కాదు సరిసమానమైన అందగత్తెలు.

కానీ...

రమలో లేని ఓ స్పెషాలిటీ ఉషలో ఉండటం గమనించగలిగాడు సూరిబాబు. చూడగా చూడగా తెలిసింది అతనికా విషయం.

రమవి మామూలు బుగ్గలు. ఉషవి నవ్వితే సొట్టపడే బుగ్గలు!

నవ్వితే సొట్టపడే బుగ్గలు మామూలు బుగ్గలకన్నా సహజంగానే అందంగా ఉంటాయి కదా?

సో...

రమకన్నా ఉషే అందగత్తన్న మాట!

ఇప్పుడు తన ఎంపిక ఏ ప్రాతిపదికమీద జరగాలి?

వయసూ వగైరాలు ఒకేలా ఉన్నాయ్ కాబట్టి అందంలో ఉషదే పైచెయ్యి కాబట్టి ఉషవైపే మొగ్గింది సూరిబాబు మనసు.

కానీ... ఆమె మూగదా మంచిదా, అది తేల్చుకోవాలిగా ముందు.

అందుకని...

"నేను మీ ఇద్దరికి ఓ టెస్ట్‌పెడతాను. ఏం అనుకోకుండా మీరిద్దరూ దాన్లో పాల్గొనాలి" అన్నాడు సూరిబాబు.

"ఏంటది?" రమే అడిగింది.

"మీరిద్దరూ పదహారో ఎక్కం తప్పుల్లేకుండా ఒప్పజెప్పాలి" అన్నాడు సూరిబాబు ఠక్కున.

"దేనికి?" కించితాశ్చర్యంగా అడిగింది రమ.

"చెప్తాగా! ముందు ఎక్కం ఒప్పజెప్పండి" అన్నాడు సూరిబాబు.

గజ్జెల గుర్రాల్లాంటి ఇద్దరాడపిల్లల్ని ఎదురుగా పెట్టుకుని వాళ్ళేదో గుజ్జనగూళ్ళాడుకునే వయసు పిల్లలైనట్లు వాళ్ళని ఎక్కాలు ఒప్పజెప్పమంటే అలా అడిగిన వ్యక్తిని 'మోటర్‌గాడు' కాదని ఎవరు మాత్రం అనుకోగలరు?

రమ ఉషకేసి చూసింది. 'చూశావా మెంటల్‌గాడే' అన్నట్టు.

ఉష కూడా రమకేసి చూసింది. 'అవును మెంటల్‌గాడే' అన్నట్టు.

పదహారో ఎక్కం రాక వాళ్ళిద్దరూ అలా మొహమొహాలు చూస్కుంటున్నారేమోననుకుని- "పోనీ పదహార్రాక పోతే పదో ఎక్కం చెప్పండి చాలు. తేలిగ్గా ఉంటుంది" అన్నాడు సూరిబాబు.

ఎక్కం ఏదయితేనేం? అతనిక్కావలసింది నిజంగా ఎక్కం కాదు గదా? ఆ వంకతో ఉషకి మాటలొచ్చో రావో తెల్సుకోవచ్చు కదాని అతని ఉద్దేశ్యం.

కానీ ఆ సంగతి ఆ అతివలకేం తెలుసు?!

అందుకే కిసుక్కున నవ్వేరిద్దరూ.

"ఎందుకండీ నవ్వుతున్నారు?" అన్నాడు సూరిబాబు.

"ఏడ్వలేక" అంది రమ.

దానికతను బిత్తరపోయి చూడగా "లేకపో తే ఏంటండీ? పదో ఎక్కం రానివాళ్లెవరైనా ఉంటారా ఈ పృధ్విలో?" అంటూ ఈసారి ఫకాలున నవ్వింది రమ.

"పోనీ అయిదో ఎక్కం చెప్పండైతే అది కూడా ఈజీగానే ఉంటుంది'' అన్నాడు సూరి బాబు.

"ఒకటో ఎక్కం అయితే ఇంకా ఈజీగా ఉంటుందిగా?"

రమ అలా అంటుంటే ఆ మాటల్లోని ఎగతాళిని పట్టించుకోకుండా "నో ప్రోబ్లం. పోనీ అదే చెప్పండి'' అన్నాడు సూరిబాబు.

'క్రాక్ మాస్టర్ జనరల్' అనుకుంది రమ.

'తిక్కసన్నాసి' అనుకుంది ఉష.

'ఇలాంటి పిచ్చివెధవల్తో కాలక్షేపం బాగానే ఉంటుంది' అనుకున్నారిద్దరూ సంయుక్తంగా.



సరే చూద్దాం ఏం జరుగుతుందోనను కుని,

"ఒక్కొక్కటి ఒకటి... రెండొకట్ల రెండు...మూడొకట్ల మూడు..." అంటూ ఒకటో ఎక్కం ఒప్పజెప్పింది రమ.

"ఉమగారూ! ఊఁ ఇంక మీరు చెప్పండి'' అన్నాడు సూరిబాబు.

"దానిపేరు ఉమ కాదండీ! ఉష! ఎందుకు మీరిలా కన్ఫ్యూజైపోతున్నారు?" అంది రమ.

సూరిబాబు తెగబోలెడు సిగ్గుపడిపోయాడు.

"ఎబ్బే ఏం లేదండీ రమ, ఉమ అంటే రైమ్ కలుస్తుంది కదాని కన్ఫ్యూజైపోతున్నానల్లే ఉంది'' అన్నాడు.

"మీరు మొదట్నుంచీ ఇంతేనా?" అడిగింది రమ.

"అవునండీ... చిన్నప్పట్నుంచీ నాకు కన్ఫ్యూజన్ కాస్త ఎక్కువే"

అంతకన్నా ఏం చెప్పాలో తోచక అలా అన్నాడు సూరిబాబు.

"నేనడుగుతున్నది కన్ఫ్యూజన్ గురించి కాదు..."

"మరి?"

"మీ అస్తవ్యస్థమానసిక స్థితిగురించి''

"అంటే?" నిజంగానే అర్థంగాక బుర్రగీరుకున్నాడు సూరిబాబు.

"అదే మీరిలా పిచ్చిపిచ్చిగా ప్రవర్తించడం వగైరా'' అంది రమ.

"నేను పిచ్చిపిచ్చిగా ప్రవర్తించానా?!!!"

ప్రపంచంలో ఉన్న ఆశ్చర్యాన్నంతట్నీ ముఖంమీదకు తెచ్చుకుంటూ అతనలా అడుగుతుంటే-

"కాదా మరి?" అంటూ కిసుక్కున నవ్వింది రమ.

"అసలలా పాంప్లెట్ జారీ చేయడమే ఒక పిచ్చిపని. దానికి తోడు వచ్చిన వాళ్ళతో ఇలా ఒకటో ఎక్కం ఒప్పజెప్పించుకుంటున్నారూ అంటే అది మరింత పిచ్చి పని. చిన్నప్పుడు మీ మెదడుకేమయినా దెబ్బతగిలిందా?"

ఆమె కంఠంలో ధ్వనించిన జాలికి తూలిపడబోయి తమాయించుకున్నాడు సూరిబాబు.

చిన్నప్పుడు మెదడుకు దెబ్బతగలడం మాటేమోగానీ, ఇప్పుడు మాత్రం అతని గుండెకి చాలా గట్టిదెబ్బే తగిలింది ఆమె అలా అంటుంటే.

అంటే ఆ కనకలింగంగాడన్నట్టు వీళ్ళిద్దరూ తనని నిజంగానే పిచ్చివాళ్ళుగా జమకట్టేశారన్నమాట!

దుఃఖం ఎగదన్నుకురాబోయిందిగాని పరాయి ఆడపిల్లల ముందు ఏడ్వటం బావుండదని నిగ్రహించుకున్నాడు.

మీరు నా మానసిక స్థితిగురించి చాలా తప్పుగా అర్థంచేస్కున్నారండీ! నా పాంప్లెట్ వెనకున్న ప్రేమార్తినిగానీ, మీతో ఎక్కం ఒప్పజెప్పించుకోడం వెనకున్న నా ఆంతర్యాన్నిగానీ మీరు గ్రహించనే లేదసలు'' అన్నాడు ఎంతో బాధగా.

"ప్రేమార్తి?"

"అవునండీ! వయసొచ్చినప్పట్నుంచీ మొదలైంది నాలో ఈ ప్రేమార్తి. ఎవర్నో ఒకర్ని ప్రేమించాలన్న నా ప్రయత్నాలన్నీ బెడిసికొట్టడంవల్ల నేనలా కరపత్రాన్ని వెయ్యించాల్సొచ్చింది..."

"అది సరే... మరీ ఎక్కాలు గోలేంటి?!!"

"అదాండి? ఏంలేదు. వచ్చినప్పట్నుంచి మీ ఉమగారొక్క మాటకూడా మాట్లాడలేదు గదా! ఆవిడకు మాటలొచ్చో లేదోనని టెస్ట్ చెయ్యడానికి అలా ఎక్కాలు చదవమన్నాను''

'సత్యమేవజయితే' అని మనసులో అనుకుని దాపరికం లేకుండా నిజం ఒప్పేసుకున్నాడు సూరిబాబు.





"అదా సంగతీ? మీరూహించింది నిజమే! మా ఉమకి మాటలు రావు'' అంది రమ.

"మరింతసేపూ వచ్చనే అన్నారుగా? సో ఇప్పటికైనా ఒప్పుకుంటారా నేను తెలివైన వాణ్ణనని? మీతో నిజం ఎలా చెప్పించేశానో చూశారా?" అన్నాడు సూరిబాబు కించిత్ గర్వంగా.

"నేను మాటలు వచ్చన్నది మా ఉషకి. అంటే దీనికి. మాకు ఉమామహేశ్వరని ఇంకో ఫ్రెండు కూడా ఉంది. దానికి రావు మాటలు''

రమ నవ్వుతూ అలా అనేసరికి చిత్తయి పోయాడు సూరిబాబు.

'వీళ్ళు అతివలు కాదు. నా మతిపోగొట్టడానికొచ్చిన 'సుత్తివలు' అనుకున్నాడు.

'సుత్తివలు' అనే పదానికి అర్థంలేదని తెలిసి కూడా అతనిలాగే అనుకున్నాడు.

అనుకున్నాక "సారీ అండీ మళ్ళీ కన్ఫ్యూజైపోయా! మీ ఫ్రెండు పేరు ఉషగదూ'' అన్నాడు నాలుక్కరుచుకుంటూ.

"అవునండీ నా పేరు ఉషే'' అంటూ అప్పటికి నోరుతెరిచింది ఉష.

"హమ్మయ్య! అయితే మీకు మాటలొచ్చన్నమాట?!" సంబరంగా అన్నాడు సూరిబాబు.

"వచ్చు... కావాలంటే ఒకటో ఎక్కం ఒప్పజెప్పమంటారా?" అడిగింది చిలిపిగా ఉష.

"ఆc" అనబోయి నాలుక్కరుచుకున్నాడు. "ఎబ్బే ఎందుకండీ! మీరు లక్షణంగా మాట్లాడుతున్నారుగా''

"పోనీ పాట పాడమంటారా?"

"అబ్బే అది మాత్రం ఎందుకండీ! మీకు మాటలొచ్చని తెలుస్తూనే ఉందిగా? నో నాట్ నెసెసరీ''

"పోనీ డ్యాన్స్ చెయ్యమంటారా?"

"మీకు డ్యాన్స్ కూడా వచ్చా'' ఆమెని విస్ఫారిత నేత్రాలతో చూశాడు సూరిబాబు.

"వచ్చండీ. మా ఉష సకల కళాకోవిదురాలు. సంగీతం, నృత్యం, చిత్రలేఖనం- ఇలా ఒకటేమిటి- చతుష్షష్టి కళల్లో సగానికిపైగా వచ్చు'' ఉష తరపున డబ్బా వాయించింది రమ.

నవ్వితే సొట్టలుపడే బుగ్గలకి తోడు ఇవన్నీ ఎక్స్‌ట్రా క్వాలిఫికేషన్స్ అన్నమాట.

కాస్త మితభాషే కావచ్చు. అయితేనేం? ఉషే బెస్టు.

'సో... నా హృదయంలో చోటు ఉషకే!' మనసులో అలా అనుకున్నాక.

"మీరు నన్ను క్షమించాలి రమగారూ!" అన్నాడు సూరిబాబు.

"దేనికి?" అడిగింది రమ.

"మిమ్మల్ని డిసప్పాయింట్ చేస్తున్నందుకు. నా మనసు ఉషగారివైపే మొగ్గు చూపుతోంది''

"చూపితే?"

"అదేంటండీ అలా అంటారు. నేను మీకు ముందే చెప్పేను గదా! నా మనసులో ఒక్కరికి మాత్రమే చోటివ్వగలనని. ఆ చోటిపుడు ఉషగారి పరమైపోయింది. మీ అభ్యర్థిత్వాన్ని నిరాకరిస్తున్నందుకు మీరు నన్ను మన్నించాలి'' అన్నాడు సూరిబాబు ఎంతో బాధగా.

"అయితే మీ విశాల హృదయంలో చోటు చేసుకునే అదృష్టం మా ఉషకి మాత్రమే దక్కిందంటారు?" ముఖం నిండా నిరాశ పులుముకుంటూ అంది రమ.

ఆమె నిరాశాపూరిత ముఖాన్ని చూస్తుంటే శరాఘాతం తగిలిన లేడి కూనలా గిజగిజలాడిపోయాడు సూరిబాబు.

'హే భగవాన్! నాకు ఒక్క హృదయాన్నే ఎందుకిచ్చావయ్యా? రెండు హృదయాల్నిచ్చుంటే ఇద్దరికీ చోటిచ్చుండేవాణ్ణిగా? ఇప్పుడు చూడు నీవల్ల ఒక అమాయకురాలైన ఆడపిల్ల ఎలా బాధపడుతోందో?' అనుకున్నా

డావేదనగా.

ఒక అందమైన ఆడపిల్ల తన హృదయంలో చోటుదొరకనందుకు బాధపడుతుంటే డెందం కలతచెందకుండా ఎవరికుంటుంది?

ప్చ్! ఏమిటో ఈ జీవితం?

నిన్నటిదాకా ప్రేమార్తితో బాధపడిన తను ఇవ్వాళ ఓ ప్రేమమయిని బాధపెట్టాల్సివస్తోంది!

అయితే అతివృష్టి లేకపోతే అనావృష్టి అంటే ఇదే కాబోలు. మనసులో అలా అనుకుంటూ

"బాధపడుతున్నారా రమగారూ? మీరు మొదట్లో ఏం చెప్పారో ఒక్కసారి గుర్తుచేసుకోండి, మీఇద్దరిలో ఎంతో త్యాగనిరతుందనీ, నా హృదయాన్ని మీలో ఎవరికిచ్చినా బాధపడబోమనీ అన్నారుగా? మీరిపుడవి మర్చిపోయి ఇలా బాధపడితే ఎలా చెప్పండి? 'మ్యారేజస్ ఆర్ మేడిన్ హెవెన్' అంటారు పెద్దలు. మీకూ నాకూ రాసిపెట్టిలేదు, ఏం చేస్తాం?" అన్నాడు సూరిబాబు ఆమెను ఓదారుస్తూ.

రమ కొనగోటితో కన్నీటిని మీటుకుంటుండగా ఉష జోక్యం చేసుకుంటూ అడిగింది. "మరెవరెవరికి రాసిపెట్టుంది?"

'ఎంత అర్థరహితమైన ప్రశ్న?' అనుకున్నాడు సూరిబాబు మనసులో.

"అదేంటండీ అలా అడుగుతున్నారు. రమగారి క్యాండిడేచర్‌ని తిరస్కరించానూ అంటే దానర్థం మిమ్మల్ని సెలక్ట్ చేశాననే కదా? ఆ సంగతి మీ ఫ్రెండుతో స్పష్టంగా చెప్పాను గదా! అంటే మీకూ నాకూ రాసిపెట్టుందనే గదా అర్థం?"

"అలా మీరనుకోగానే సరిపోతుందా?! అసలు మేమిద్దరం అభ్యర్థినులుగా వచ్చామని ఎవరు చెప్పారు?"

ఉష అలా అనేసరికి నెత్తిమీద సమ్మెటతో మోదినట్లనిపించింది సూరిబాబుకి.

"ఉషగారూ!" అన్నాడు దిగ్భ్రాంతిగా. "ఎ...ఎ...ఏంటండీ మీరంటోంది? నా విశాలమైన హృదయంలో చోటు కోరి వచ్చామని మీరేగా అన్నారు! ఇపుడిలా ప్లేటు ఫిరాయిస్తున్నారేంటీ?" అన్నాడు ఆవేదనగా.

"నేనా? నేనుకాదామాటన్నది. మా రమ" అంది ఉష రమకేసి చూస్తూ.

"అన్నది రమగారే అయినా మీ ఇద్దరి తరఫునా అన్నారుగా? ఏం రమగారూ... కాదా?" అన్నాడు సూరిబాబు రమవైపు తిరుగుతూ.

"అవునండీ'' అంది.

"మరి మీ ఫ్రెండిపుడిలా మాట మార్చడం బావుందా?"

"తనేం మాట మార్చలేదే! మేం మీ హృదయంలో చోటు కోరి వచ్చిన మాట నిజం. కానీ ఆ చోటు మాకోసం కాదు. మీది విశాల హృదయం గనుక, పుట్టుమూగదైన మా ఇంకో స్నేహితురాలు ఉమామహేశ్వరికేమైనా చోటివ్వగలరేమోనని వచ్చాం"

ఆమె అలా అనేసరికి.

"ఇంతేలే ఈ జీవితమూ చివరికి అంతా శూన్యమూ'' అని గట్టిగా పాడి బిగ్గరగా ఏడ్వాలనిపించింది సూరిబాబుకి. కానీ ఆ పని చెయ్యలేకపోయాడు. పాడనూలేకపోయాడు. ఏడ్వనూ లేకపోయాడు.

అసలే జరిగిన అవమానానికి గుండె మండిపోతుంటే వాళ్ళముందేడ్చి మరికాస్త పరువుపోగొట్టుకోవడం ఏం బావుంటుంది?

అందుకే ఎలాగో నిగ్రహించుకుని "మీరా మాట ముందే చెప్పొచ్చుగా? ఇంతసేపూ మీరే అభ్యర్థినులుగా వచ్చినట్టు మాలో ఎవర్ని సెలక్ట్ చేసుకున్నా బాధపడం, గాడిదగుడ్డూ అంటూ ఎందుకు నన్నాటలాడించారు?" అన్నాడుక్రోషంగా.

"మేమొచ్చిందే మిమ్మల్నాటపట్టించడానిక్కాబట్టి. లేకపోతే ఏంటండీ? మీ హృదయానికి నచ్చిన మనిషిని మీరే వెతుక్కోవాలిగాని, నా హృదయం ఖాళీగా ఉందని





పాంప్లెట్స్ పంచుతారా ఎవరైనా? మీలాంటి తిక్కసా(మాట్‌నో పట్టుపట్టి చూడాలని పించడం మా తప్పా?"

'కాదు... అసలింతసేపు మీతో మాట్లాడ్డం నాదే బుద్ధితక్కువ' అని మనసులో అను కుని.

'ముత్తాతా నన్నెంత పిచ్చివెధవని చేశా వయ్యా?' అని ముత్తాతని కూడా మనసులో నే స్మరించుకుని.

అప్పటికీ ఆశ చావక "పోనీ అయ్యిందేదో అయ్యింది ఆ ఉషగార్నే పంపించండి. ఆవిడ అభ్యర్థిత్వాన్ని కన్సిడర్ చెయ్యడానికి ప్రయ త్నిస్తాను'' అన్నాడు సూరిబాబు.

"నేనిక్కడే ఉన్నాగా?" అంది ఉష.

"అయామ్‌సారీ! కన్‌ఫ్యూజన్‌లో అలా అన్నా! నా ఉద్దేశ్యం ఉమగారని. మనిషి మూగదైతేనేం మనసు మూగది కాదుగా?" అంటూ తన తప్పిదాన్ని సరిదిద్దుకున్నాడు సూరిబాబు.

"అసలు ఉమామహేశ్వరి అనే స్నే హితురాలు మాకుంటేగా పంపించడానికి?" అంటూ ఘొల్లున నవ్వారాఅతివలిద్దరూ.

ఆ నవ్వు పిశాచాల నవ్వులా అని పించింది సూరిబాబుకి.

ఇద్దరూ కలిసి ఇంతసేపూ తన చెవుల్లో తామరపువ్వులు పెట్టారన్నమాట!!

ఎంత ఘోరంగా ఫూలైపోయాడు తను?!!

ఛీ!!

తనమీద తనకే అసహ్యం కలిగిపోయి గుండెకాయలో కుమ్మరిపురుగు దూరి దొలు స్తున్నట్టు అతను గిజగిజలాడిపోతుంటే.

"టాటా!" అంటూ వెళ్ళిపోయారా అతివ లిద్దరూ.

వాళ్లు వెళ్ళిపోయాక ఇందాక పాడుకోలేక పోయిన పాటని ఇపుడు మనసారా పాడుకు న్నాడు సూరిబాబు.

★ ★ ★

మిత్రుడికెదురైన చేదు అనుభవాన్ని గు రించి తెలుసుకున్నాక "ఇప్పటికైనా అర్థ మైందా నా మాటల్లోని నగ్నసత్యం?" అన్నా డు కనకలింగం.

"ఏం కాదు. వాళ్ళిద్దరూ స్త్రీ జాతిలో తప్పబుట్టిన తుంటర్రాస్కెల్స్. అందుకే వా ళ్ళకి నా ప్రేమార్తి అర్థంకాలేదు. అందుకే వాళ్ళునన్నలా ఆట పట్టించి పోయారు'' అన్నాడు సూరిబాబు అతన్తో ఏకీభవించ కుండా.

"అంటే నీలో ఇంకా ఆశ చావలేదన్న మాట"

"చావలేదు. చావదు కూడా. ఎందుకంటే నేను పంపిణీ చేసిన మొత్తం పాంప్లెట్సు ఇరవైవేలు. అందులో ఓ ట్వెంటీఫైవ్ పర్సెంట్ వేస్టయిపోతాయ్ అనుకున్నా..."

సూరిబాబు మళ్ళీ కాలిక్యులేషన్స్ ప్రా రంభించే సరికి చిర్రెత్తిపోయింది కనకలింగా నికి.

"నీ బొంద! ఆపు నీ వెధవలెక్కలు'' అనరిచాడు కోపంగా.

"వెధవ లెక్కలేంటీ, ఉన్నమాటే చెబుతు న్నాను. ఆ పర్సెంట్లో'

"చస్ నోర్ముయ్'' అంటూ తానే అతని నోటిని మూసేశాడు కనకలింగం. "నిన్ననే చెప్పేడిశావ్‌గా కనీసం పద్దెనిమిది మందొస్తా రని. ఇప్పటికైదుమందైపోయారు కాబట్టి ఇంకా పదమూడు మంది రావాల్సుంది. అదే గదా నువ్ చెప్పేది?"

"యా'' అన్నాడు సూరిబాబు ధీమాగా తలెగరేస్తూ. వీడితో వాదించటం దేనికిలె మ్మని మిన్నకుండిపోయాడు కనకలింగం.

కాసేపటితర్వాత ఇద్దరూ భోజనాలు ము గించి పాన్ వేసుకుందామని అలా ఓ కిళ్ళీ కొట్టుదాకా వెళ్ళారు.

ఎప్పుడేనా భోజనానంతరం కిళ్లీలు వే స్కోడం వాళ్ళిద్దరికీ అలవాటు.

షాపువాడు రెండు మిఠాయి కిళ్లీలు కట్టి ప్యాక్‌చేసి వాటిని సూరిబాబు కందించాడు.



ఒకటి మిత్రుడికిచ్చి రెండో కిళ్లీని విప్పుతుంటే దానికి చుట్టబడిన కాగితం తను వెలువరించిన కరపత్రం తాలూకు ముక్కే నని గ్రహించిన సూరిబాబుకి ఏడుపొచ్చి నంతపనైంది.

అందాల అతివల చేతుల్లోకి వెళ్ళాల్సిన తన పాంప్లెట్లు ఇలా కిళ్లీలు ప్యాక్ చెయ్యడానికి ఉపయోగించబడటం ఏమిటి?

"రేయ్ రేయ్ చూశావా ఇది'' అన్నాడు కాగితమ్ముక్కని కనకలింగానికి చూపుతూ!

"ఆ చూశా'' అన్నాడు కనకలింగం 'వాటిఫ్?' అన్నట్టుగా తలెగరేస్తూ.

ఆ నిర్లక్ష్యానికి సూరిబాబు హృదయం ఖేదపడింది.

అంతలో ఆ షాపువాడన్నాడు. "ఏంటిసార్ ఆ కాగితం గురించి మాట్లాడుకుంటున్నారు? చాలా విచిత్రమైన పాంప్లెట్ అది. ఏ పిచ్చి వెధవ ప్రింట్ చెయ్యించాడో గాని దాన్ని చూసి నవ్వలేకచచ్చాన్నేను''

అతనలా అంటుంటే వాణ్ణి పీకపిసికి చంపెయ్యాలన్నంత కోపమొచ్చింది సూరిబాబుకి.

అయినప్పటికీ ఆ పిచ్చి వెధవ తానేనన్న విషయం అతగాడికి తెలియజేయడం ఇష్టంలేక "అలాగా'' అంటూ ఓ వెర్రినవ్వు నవ్వి "ఈ ముక్కలో మొత్తం లేదు. అసలే ముందా పాంప్లెట్‌లో?" అనడిగాడు అమాయకుడిలా.

కనకలింగానికి ఘొల్లున నవ్వాలనిపించింది గాని, మిత్రుణ్ణి బాధపెట్టడం ఇష్టంలేక ముసిముసిగా నవ్వి ఊరుకున్నాడు.

"నేను చెప్పడం దేనికి? చింపనివి కూడా ఇంకా ఉన్నాయ్. ఒకటిస్తాను. మీరే చదూకోండి. అప్పుడు మీకే తెలుస్తుంది. వాడెంత పిచ్చిసన్నాసో'' అంటూ ఓ ఖాళీ జర్దాడబ్బాలో చుట్టలా చుట్టి దోపబడున్న పాంప్లెట్స్ బొత్తిలోంచి ఒకదాన్ని బైటికిలాగి సూరిబాబు చేతికందించాడు కిళ్ళీ కొట్టువాడు.

"నన్ను పిచ్చిసన్నాసంటావుట్రా పిచ్చి వెధవా!" అంటూ వాడి కాలర్ పుచ్చుకోలేని పరిస్థితాయె!

అందుకే మరోసారి వెర్రినవ్వు నవ్వి దాన్నప్పుడే తొలిసారిగా చూస్తున్నవాడికిమల్లే అందులోకి దృష్టిసారించాడు సూరిబాబు.

"ఏముందిరా అందులో?" కనకలింగం తను కూడా అమాయకత్వాన్ని నటిస్తూ అడిగాడు.

"ఇదుగో చూడు'' అంటూ సూరిబాబు దాన్నతనికందించాడు.

కనకలింగం కూడా దాన్ని తొలిసారి చూస్తున్నవాడికిమల్లే చూసి "ఈ కిళ్ళీకొట్టు సోదరుడన్నది నిజమే గురూ! వీడెవడో నిజంగానే పిచ్చిసన్నాసిలా ఉన్నాడు. మతిలేని వెధవలా ఉన్నాడు. ఏవంటావ్?" అన్నాడు సూరిబాబుకేసి చిలిపిగా చూస్తూ.

"అలాగనే ఎందుకనుకోవాలి? అతనొక ప్రేమార్తితో బాధపడుతున్న ఉత్తమ ప్రేమికుడయ్యుండొచ్చుగా?" మనసు కుతకుతా ఉడికిపోతుంటే పైకి మాత్రం మామూలుగానే ఉండటానికి ప్రయత్నిస్తూ అన్నాడు సూరిబాబు.

"ప్రేమార్తా? అంటే అదేంటి సార్?" కిళ్లీ కొట్టువాడు కుతూహలంగా అడిగాడు.

"అదొక అజీర్తిలాంటి వ్యాధి. అంటే ఎవర్నయినా ప్రేమించాలని ఉంటుందిగానీ ఆడవాళ్ళ ఎదుటపడి ఆ మాట చెప్పడానికి ధైర్యం సరిపోదన్నమాట! అలాంటి పిరికిసన్నాసులే ఇలాంటి కరపత్రాల్ని ప్రింట్ చెయ్యించి దేశంమీదికొదుల్తారు'' అన్నాడు కనకలింగం నవ్వుతూ.

"అంటే మదపిచ్చి వెధవలన్నమాట! అంతేనా సారూ?"

కిళ్లీ కొట్టువాడలా అంటుంటే వాడి ఎదురుగా మట్టిపిడతలో ఉన్న సున్నమంతట్నీ తీసి వాడి ముఖానికి పుయ్యాలనిపించింది సూరిబాబుకి.

# ఏరిన ముత్యాలు

★ గొప్ప పుస్తకాలు చదవడమంటే పూర్వశతాబ్దాల వ్యక్తులతో మాట్లాడటమే.

—రెనీ డెకార్ట్స్

★ మంచిసూక్తి తెలివైనవాడి ఉంగరంలో మెరిసే వజ్రం వంటిది. మూర్ఖుడి చేతిలో రాయివంటిది.

—సుభాషితం

★ తమ బిడ్డలకు పుష్కలంగా ధనం ఇస్తే చాలుననుకునేవాళ్ళు అనేకమంది వాళ్ళ శీలం మెరుగుపడటానికి శ్రద్ధ తీసుకోరు.

—సోక్రటీస్

★ గుడులు, గోపురాలు తిరుగుతూ అక్కడ దీపాలు వెలిగించడంకన్నా హృదయంలో ఒకే ఒక్క జ్యోతి వెలిగించుకుంటే మంచిది.

—గార్డెత్

★ సమస్త శ్రేయస్సుకూ, ఆనందానికి మూలమైంది ప్రేమతత్వం.

—స్వామి శివానంద

★ ఒకేభావం వున్నచోట రెండు భావాలు సృష్టించేవాడు ఉపాధ్యాయుడు.

—ఎల్బర్ట్ హబ్బర్డ్

★ అర్థంకాకుండా తొందర, తొందరగా ఒక గ్రంథం చదవడం కంటే సార్థకంగా ఒక పుట చదవటం మేలు.

—మెకాలే

★ శీలం స్వంత ఆస్థి. అత్యంత గౌరవప్రదమైంది.

—గాంధీ

★ మాట్లాడుతున్నప్పుడు ప్రజల భాషలో మాట్లాడాలి. ఆలోచిస్తున్నప్పుడు మేధావుల వరవడి ననుసరించాలి.

—అరిస్టాటిల్

★ ఆరోగ్యవంతమగు దేహం ఆత్మకు అతిధిగృహం.

—బేకన్

★ సుఖాలు ఒక్కుమ్మడిగా రావు. కష్టాలు ఒంటరిగా రావు.

—చైనీస్ సామెత

★ మోకరిల్లి బతకడం కంటే నిలబడి మరణించడం మంచిది.

—అలెగ్జాండర్

సేకరణ : పి.వి. రమణకుమార్




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రనుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఏప్రిల్ చతుర నవల ప్రేమార్తి ............

సమీక్షకుని పేరు : ............

చిరునామా : ............

............

............

............

కానీ అంత పని చెయ్యలేక, "మదపిచ్చి వేరు, ప్రేమార్తి వేరు'' అన్నాడు ఉక్రోషంగా.

అతని ముఖం ఎర్రబడటాన్ని గమనించి, "నేనా మతిలేని గాడిదని తిడుతుంటే మధ్యలో మీక్కోపమెుస్తోందేంటి సారూ?" అన్నాడు కిళ్ళీకొట్టువాడు.

'అధిక ప్రసంగం వెధవా!' అని మనసులో తిట్టుకున్నప్పటికీ పైకి మాత్రం ఏమీ అనలేకపోయాడు సూరిబాబు.

"అబ్బే నాకెందుకూ కోపం? కావాలంటే ఆ అడ్డగాడిదని ఇంకా అడ్డమైన తిట్లూ తిట్టు. మధ్యలో నాకేంటి? కాకపోతే అతనిది మదపిచ్చి కాదంటున్నానంతే. దాన్ని ప్రేమార్తి అంటారు'' అన్నాడు నిస్సహాయంగా.

"పేరేదయితేనేం? మొత్తానికది మదపిచ్చిలాంటిదే! కావాలంటే వాణ్ణి బండబూతులు కూడా తిట్టవోయ్. మాకేం అభ్యంతరం లేదు'' అన్నాడు కనకలింగం.

మిత్రుడూ కమ్ రూమ్మేటయ్యుండి అతను కిళ్ళీకొట్టువాణ్ణలా ఎగదొయ్యడం సూరిబాబుకి చాలా బాధ కలిగించింది.

"ఛీ! ఈ ప్రపంచంలో స్నేహం అనే పదానికే అర్థంలేదేమో'' అనుకున్నాడావేదనగా.

"ఎందుకు లెండి సార్ పాపం ఆ వెధవని తిట్టడం. ఏదో వాడిపుణ్యమాని ఇలా ఓ నెలకి సరిపడా కిళ్ళీలు ప్యాక్ చేసుకోవడానికి కాగితాలొచ్చాయ్ నాకు''

షాపువాడలా అనేసరికి 'హమ్మయ్య' అనుకున్నాడు సూరిబాబు మనసులో.

"అలా అన్నావ్ బాగుందోయ్! ముక్కూమొహం తెలీని వాళ్ళని తిట్టడం అంత మంచిది కాదు'' అని క్షణమాగి "అన్నట్టీ పాంప్లెట్స్ నీ చేతికెలా వచ్చాయ్?" అనడిగాడు.

"డిస్ట్రిబ్యూట్ చెయ్యమని కుర్రాళ్ళకిస్తుంటారు కస్టమర్! వాళ్ళేమో పంచగలిగినన్ని పంచి మిగతావి మాకిచ్చేసి పోతుంటారు. ఇది మామూలే' అన్నాడు షాపువాడు.

'అలాగా' అన్నట్టు తల పంకించి "పదరా పోదాం" అన్నాడు సూరిబాబు. ఇంకా అక్కడే వుంటే ఆ షాపువాడు ఇంకా ఏమైనా అంటాడేమోనని.

అప్పటికే పెంకులా మాడిపోయివున్న మిత్రుడి ముఖాన్ని చూసి తెగబోలెడు జాలిపడిపోయి "సరే నడువైతే'' అనేశాడు కనకలింగం సదరు షాపువాణ్ణి ఇంకేమీ రెచ్చగొట్టకుండా.

కానీ నాలుగడుగులు వేశాక లంకించుకున్నాడు. "నే చెబితే నమ్మేవ్ కాదు. చూశావా ఆ పాన్‌షాప్ వాడేవన్నాడో' అంటూ.

"కిళ్ళీలు కట్టుకునేవాడికి ప్రేమ గురించేం తెలుస్తుంది? అందుకే వాడేదో వాగేడు. ఆ మాటల్ని పట్టించుకోవాల్సిన అవసరం నాకు లేదు'' అన్నాడు సూరిబాబు.

"అయితే నువ్ చేసింది వెర్రిపనని ఇప్పటిక్కూడా నీకనిపించట్లేదన్నమాట!! వాటే పిటీ!!?" అంటూ నిట్టూర్చాడు కనకలింగం.



మర్నాడు పొద్దున్నే సూరిబాబు మళ్ళీ ట్రిమ్‌గా తయారైపోతుంటే "ఎక్కడికి? ఆఫీస్‌కేనా?" అనడిగాడు కనకలింగం.

"కాదు. ఇవ్వాళ ఖచ్చితంగా మంచివాళ్ళొస్తారు. వచ్చే వాళ్ళకి నేను కాస్త నీట్‌గా

కనిపించాలిగా? అందుకే తయారవుతున్నా'' అన్నాడు సూరిబాబు.

"నీబొంద" అనబోయి మానేశాడు కనక లింగం ఎందుకులే ఎనర్జీ వేస్ట్ చేసుకోవడ మని.

అంతలో గుమ్మం దగ్గరేదో అలికిడైతే ఇద్దరూ అటుకేసి చూశారు.

అతివకాదు. అంతకు ముందెన్నడూ చూసెరుగని ఓ ముప్పై అయిదేళ్ళ వ్యక్తి కనిపించాడు గుమ్మం దగ్గర.

"ఎవరండి మీరు? ఏంకావాలి?" అడిగాడు కనకలింగం.

"నా పేరు శ్యామ్రావండీ! నేను సూరిబాబుగారికోసం వచ్చాను. మీలో సూరిబాబెవరు?" అన్నాడా వ్యక్తి.

"నేనేనండీ'' ముఖాన నవ్వు పులుముకుంటూ అన్నాడు సూరిబాబు.

"నేను మీ కరపత్రాన్ని చూసొస్తున్నానండీ! లోపలికి రావచ్చా?" అన్నాడు శ్యామ్రావు.

'కరపత్రాన్ని వేసింది పెళ్ళికాని యువతుల్ని ఉద్దేశించిగదా! మగాడొచ్చాడేంటీ?' అని మనసులోనే అనుకుని వచ్చిన వ్యక్తిని గుమ్మం దగ్గరే నిల్చోబెట్టడం మర్యాద కాదు కాబట్టి "ఆ రండ్రండి'' అన్నాడు సూరిబాబు.

శ్యామ్రావ్ లోపలికొచ్చి కనకలింగం చూపించిన ఓ కుర్చీలో కూర్చున్నాడు.

"ఊ... ఇప్పుడు చెప్పండి. ఏంటి విషయం?" అన్నాడు సూరిబాబు.

"చెప్పాగా మీ కరపత్రాన్ని చూసొచ్చానని'' ఆ గదినంతా ఓమారు కలియజూస్తూ అన్నాడు శ్యామ్రావ్.

"కానీ నేనా కరపత్రాన్ని వేసింది ఆడవాళ్ళనుద్దేశించిగదండీ!" అన్నాడు సూరిబాబు.

"కాదని నేనన్నానా? నేనొచ్చింది మా చెల్లెలు శ్రావణి తరపున మాట్లాడ్డానికి'' అన్నాడు శ్యామ్రావ్ నవ్వేస్తూ.

"మనిషి బాగానే వున్నాడు. కానైతే కాస్త స్క్రూ లూజ్ కావచ్చు. అయితేనేం అడ్జస్ట్ అయిపోవచ్చు. శ్రావణి విపరీతమైన లావు గదా! అన్నీ తిన్నగా వున్నవాళ్లెందుకు చేస్కుంటారు?" అనుకున్నాడు మనసులో

అదే సమయంలో 'అన్నగారే ఇంత బావుంటే ఇంక ఆ చెల్లాయెంత బావుంటుందో?, శ్రావణి చాలా మంచి పేరు. సో, మనిషి కూడా ఖచ్చితంగా అందగత్తె అయ్యుంటుంది' అనుకున్నాడు సూరిబాబు మనసులో.

"అలాగా! చాలా సంతోషం" అన్నాడు పైకి క్షణమాగి.

"మీ చెల్లాయిని కూడా తీస్కురాలేకపోయారా?" అన్నాడేదో పూర్వపరిచయం ఉన్న వాడికి మల్లే.

"తనక్కాస్త సిగ్గెక్కువలెండి. అంత తేలిగ్గా పరాయి మగాళ్ళ దగ్గరికి రాదు. అందుకే ముందుగా నేనొక్కణ్ణే వచ్చాను. మీ ఒపీనియన్ ఏంటో తెలుసుకున్నాక కావాలంటే చూపులేర్పాటు చేసుకోవచ్చు'' అన్నాడు శ్యామ్రావ్.

"నా ఒపీనియన్ ప్రత్యేకంగా తెలుసుకోవాల్సింది ఏముందండీ? నా కరపత్రాన్నిబట్టి మీకర్థమయ్యే వుంటుంది నా ప్రేమార్తి ఎలాంటిదో. రిక్వైర్డ్ క్వాలిఫికేషన్స్ అన్నీ వుంటే మీ సిస్టర్‌ని ఓ క్యాండిడేట్‌గా కన్సిడర్ చెయ్యడానికి నాకేం అభ్యంతరం లేదు'' ఎంతో ఔదార్యంగా అన్నాడు సూరిబాబు.

'నీ బొంద! ఎంత స్టయిలొలకబోస్తున్నావ్‌రా' అనుకున్నాడు కనకలింగం మనసులో అతగాడికి శ్యామ్రావ్ రాక చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

'ఈ తింగరి వెధవ మతుండో లేకో ఏదో పాంప్లెట్ వేస్తే అది చూసి తగుదునమ్మా అంటూ ఈ పెద్దమనిషి ఇలా రావడమేంటి? ఇతని క్కూడా మతిలేదా ఏంటి కొంపదీసి?' కనకలింగం సందేహించాడు.

'దేర్ మస్ట్ బి సమ్‌థింగ్ రాంగ్' అని కూడా అనుకున్నాడు మనసులో.




ఇద్దరు మతిలేని మనుషులు మాట్లాడుకుంటున్నప్పుడు మధ్యలో తను తల దూర్చడం బావుండదులెమ్మని మౌనంగా ఓ కుర్చీలో కూర్చుండిపోయాడు.

"మీ కరపత్రంలో మీరు కోరిన అర్హతలన్నీ మా చెల్లాయికున్నాయండీ! ఇంటర్మీడియేట్ ప్యాసైంది. వయసు ఇరవై. ముఖం చంద్రబింబంలా ఉంటుంది''

శ్యామ్రావ్ కనకలింగం ఉనికినేమాత్రం పట్టించుకోకుండా సూరిబాబు వైపే చూస్తూ చెప్పాడు.

"మరైతే ఇహనేం? నా హృదయాన్ని మీ సిస్టర్‌కెలాట్ చేసే విషయాన్ని తప్పకుండా పరిశీలిస్తాను. ఎప్పుడు తీసుకొస్తారు మీ చెల్లాయిని?" సూరిబాబు సంబరంగా అడిగాడు.

ఒకపక్క అలా అడుగుతూనే 'చూశావా నా కరపత్రం మహిమ?' అన్నట్టుగా కనకలింగంకేసి చూసి కళ్లెగరేశాడు.

"నీ బొందలే' అని పైకైతే అనలేదుగానీ, అన్నట్టుగానే కళ్లెగరేశాడు కనకలింగం.

మిత్రులిద్దరూ అలా కళ్లెగరేసుకోవడం చూసి "అతను మీ ఫ్రెండా?" అనడిగాడు శ్యామ్రావ్ సూరిబాబుని.

"అవునండీ ఫ్రెండూ కమ్ రూమ్మేటు. పేరు కనకలింగం. సింధూ కొరియర్స్‌లో ఉద్యోగం" అంటూ మిత్రుణ్ణి అతనికి పరిచయం చేశాడు సూరిబాబు.

ఐసీ అన్నట్టుగా తల పంకించి "హలో' అంటూ కనకలింగాన్ని విష్ చేశాడు శ్యామ్రావ్.

మర్యాదకోసం "హలో' అంటూ తనూ విష్‌చేసి చిన్నగా నవ్వి ఊరుకున్నాడు కనకలింగం.

అంతలో "ఇంతకీ మీరు నా ప్రశ్నకు బదులివ్వలేదు'' అంటూ మళ్ళీ అసలు విషయంలోకి దిగాడు సూరిబాబు.

"దాందేముందండీ! మీరెప్పుడంటే అప్పుడే! కావాలంటే మీరిప్పుడే మా ఇంటికొచ్చి మా చెల్లాయిని చూస్కోవచ్చు'' అన్నాడు శ్యామ్రావ్.

"వాటేస్పీడ్?" అనుకున్నాడు సూరిబాబు.

అలా అనుకుంటుంటే అతనికి ఆలస్యం అమృతంవిషం అన్న సామెత గుర్తొచ్చింది.

"సరేనండీ! ఇప్పుడే వెళ్దామయితే'' అనేశాడు ఠక్కున.

అన్నాక "మాట" అంటూ కనకలింగాన్ని పక్కకు పిల్చుకెళ్ళి "రేయ్ నువ్ కూడా రారా నాతో' అన్నాడు రిక్వెస్టింగ్‌గా.

"నేనెందుకూ? నువ్వెళ్లి చూసిరా'' అన్నాడు కనకలింగం.

"అహ అలాక్కాదు. నేనొక్కణ్ణే వెళ్తే అక్కడ కన్‌ఫ్యూజైపోతాను. నువ్ కూడా తోడుంటే బావుంటుంది'' అన్నాడు సూరిబాబు మరింత రిక్వెస్టింగ్‌గా.

సహజంగానే కనకలింగాని క్కూడా ఆ అమ్మాయెలా వుంటుందో చూడాలనిపించింది.

ఈ పనికిమాలిన వెధవ దగ్గరకి ఆ పనికిమాలిన వెధవొచ్చాడు అంటే ఆ అమ్మాయి ఇంకెంత పనికిమాలినదయ్యుంటుందోనన్న కుతూహలం కూడా అతన్ని ఒప్పుకునేలా చేసింది.

"సర్లేరా! నీకోసం ఆఫీసుకి సెలవుపెట్టేస్తా నివ్వాళ" అన్నాడు ఎంతో ఔదార్యంగా.

దాంతో సూరిబాబు మళ్ళీ శ్యామ్రావ్ దగ్గరికొచ్చి "నేనూ మా ఫ్రెండూ ఇద్దరం వస్తామండీ!" అన్నాడు "ఎనీ అబ్జక్షన్?" అన్నట్టుగా చూస్తూ.

"విత్ ప్లెజర్' అంటూ నవ్వేశాడు శ్యామ్రావ్. 'హే భగవాన్ ఈ తిక్కవాడికి మా చెల్లాయి నచ్చేట్టు చెయ్యిస్వామి' అనుకున్నాడు మనసులో.

★ ★ ★

ఫీవర్ హాస్పిటల్లో బెడ్ నెంబర్ ఫార్టీ

సెవన్లో వున్న సూరిబాబు నుదుటిమీద తడి గుడ్డ వేస్తూ 'పాపం పిచ్చిసన్నాసి' అనుకున్నాడు కనకలింగం బాధగా.

తడిగుడ్డవల్ల నుదుటిమీద కలిగిన చల్లటి స్పర్శానుభూతికి సూరిబాబు మెల్లగా కళ్ళు తెరిచాడు.

"ఎలా ఉందిరా?" కనకలింగం అడిగాడు అతని కళ్లలోకి జాలిగా చూస్తూ.

"అయ్యబాబోయ్! గుర్తు చెయ్యకురా!" అన్నాడు సూరిబాబు భయంభయంగా.

"నేనడుగుతూంది ఆ శ్యామ్రావ్ చెల్లెలి గురించి కాదురా. నీ జ్వరం గురించి''

కనకలింగం అలా అన్నాక సూరిబాబు కళ్లలోని భయం కాస్త సద్దుమణిగింది.

"కాస్త తగ్గినట్టే ఉంది'' అన్నాడు నీరసంగా.

కనకలింగం మిత్రుడి మెడకింద చెయ్యేసి చూసి, "అవున్రోయ్ కాస్త తగ్గినట్టేవుంది. అయినా జడుపు జ్వరమేగా? ఎంతలో తగ్గిపోతుందిలే' అన్నాడు ధైర్యం చెబుతూ.

సూరిబాబు కొచ్చింది నిజంగా జడుపు జ్వరమే.

శ్యామ్రావ్ వెంటవెళ్ళాక, అక్కడ శ్రావణి అనబడే పర్వతాకారాన్ని చూశాక అతను భయపడకుండా వుండలేకపోయాడు.

ఎందుకంటే-

పుట్టి బుద్ధెరిగిన తర్వాత అదే మొదటిసారి అతనికి అంత లావు సౌందర్యమూర్తిని చూడ్డం.

మొహం చంద్రబింబమే.

అయితేనేం ఆకారం అబ్నార్మల్!

అందుకే ఆమెని చూడగానే అతనికక్కడికక్కడే జ్వరం వచ్చేసింది.

"ఎలా వుంది మా చెల్లాయి?" అని శ్యామ్రావ్ అడిగితే అతను కనీసం జవాబైనా ఇవ్వలేకపోయాడు.

సమయానికి కనకలింగం పక్కనే వున్నాడు కాబట్టి శ్యామ్రావ్‌కి సారీ చెప్పి, సూరిబాబుని తీస్కొచ్చి హాస్పిటల్లో పడేశాడు.

ప్రస్తుతం విజయవంతమైన మూడవరోజు సూరిబాబు హాస్పిటల్లో చేరి.

దేవుడి దయవల్ల మిత్రుడికి జ్వరం తగ్గుముఖం పట్టిందని కనకలింగం సంతోషిస్తుండగా "అన్నట్టు నిన్నామొన్నట్లో నా కోసం మళ్ళీ ఎవరూ రాలేదా మన రూమ్‌కి?" అనడిగాడు సూరిబాబు.

జ్వరం కాస్త తగ్గిందో లేదో అప్పుడే మిత్రుడిలో మళ్ళీ అలా 'ప్రేమార్తి' స్టార్ట్ అయిపోవడం ఒళ్ళు మండిపోయేలా చేసింది కనకలింగానికి.

"ఇంత జరిగినా నీకింకా బుద్ధిరాలేదా?" అన్నాడు కోపంగా.

"ఎందుకురా అంతకోపం? ఇపుడేవంత కొంప మునిగిపోయిందని? నేను కాస్త వీక్ హార్టెడ్ ఫెలోని కాబట్టి ఆ పర్వతాన్ని చూసి జడుసుకున్నాను. ఇకమీదట కూడా అలాంటి వాళ్లే వస్తారనేముంది? అయినా పాపం ఆ అమ్మాయేం స్వయంగా రాలేదుగా? వాళ్ళన్నయ్య దురాశకిపోయి మనల్ని అప్రోచ్ అయ్యాడు. నువ్ చూస్తూండు ఇక నుంచి అందరూ అద్భుతమైన అమ్మాయిలే వస్తారు'' అన్నాడు సూరిబాబు చెక్కుచెదరని ఆశాభావంతో.

"నా బొంద. రెండ్రోజుల్నుంచి మూసినకన్ను తెరవకుండా హాస్పిటల్లో పడుండి పైగా ఏవంత కొంపమునిగిపోయిందంటావా? నీకేం నువ్ దర్జాగా జ్వరంతో మూలుగుతూ పడుకున్నావ్! నీకు సేవలు చెయ్యలేక నేను చచ్చాను మధ్యలో! నిన్నా ఇవ్వాళా కూడా మళ్ళీ సెలవనేసరికి మా బ్రాంచ్ మేనేజర్ ఎంత విసుక్కున్నాడో తెలుసా?" అన్నాడు కనకలింగం మిత్రుడిని చురచురా చూస్తూ.

"సారీరా నీకు చాలా ట్రబులిచ్చినట్టున్నాను. అది సరే నాకోసం ఎవరైనా వచ్చారో రాలేదో అది చెప్పు ముందు'' అన్నాడు సూరిబాబు.





"ఎవ్వరూ రాలా. అయినా నిన్నిక్కడ చేర్పించిన తర్వాత నేను మాత్రం రూంలో వుండి చచ్చిందెక్కడ? స్నానానికని ఒక రెండు సార్లు వెళ్ళానంతే'' చిరాగ్గా అన్నాడు కనకలింగం.

'అయితే ఎవరో ఒకరు వచ్చేపోయుంటారు... ప్చ్' అని మనసులో అనుకున్నా అదేమాట పైకనేందుకు ధైర్యం చాల్లేదు సూరిబాబుకి.

అసలే జ్వరం తగ్గుతూ తగ్గుతూ వున్నప్పుడు మిత్రుడితో తిట్లుతిని దాన్ని పెంపొందించుకోవడం దేనికి లెమ్మని మౌనంగా ఉండిపోయాడు.

★ ★ ★

మర్నాడు హాస్పిటల్‌నుండి డిశ్చార్జయి ఇంటికొచ్చేశాడు సూరిబాబు. ఇల్లంటే అదే రూము.

"అయ్యిందేదో అయ్యింది. ఇకనైనా నువ్ మామూలుగా ఆఫీసుకెళ్ళిపో. నీ పాంప్లెట్స్ చూసి మన రూం కొచ్చేవాళ్ళు ఎలాంటి వాళ్లో బాగా అర్థమయ్యిందిగా!?" అన్నాడు కనకలింగం అతనికి నచ్చజెబుతూ.

కానీ సూరిబాబుకా హితోపదేశం తలకెక్కలేదు.

"నన్నలా నిరుత్సాహ పరచమాకురా!" అన్నాడు సీరియస్‌గా.

"అయితే నీలో ఇంకా ఆశ చావలేదన్న మాట?"

"ఆశని చంపేస్కోవాల్సినంత నిరుత్సాహకరమైన సంఘటనలు ఏం జరిగాయని?"

"ఇంతకన్నా ఇంకేం జరగాలి? మొదటొచ్చిన వాళ్ళంతా నిన్ను వింతజంతువుని చూసినట్టు చూసిపోవడానికొచ్చారు. మొన్నొచ్చినాయనేమో పర్వతంలాంటి తన చెల్లెల్ని నీకంటగట్టడానికి వచ్చాడు. దీన్ని బట్టి ఏమర్థమవుతోంది? సిన్సియర్ క్యాండిడేట్స్ ఎవరూ నీ పాంప్లెట్స్ చూసి రాబోరని తెలిసిపోవడంలా?"

"అక్కడే నువ్ పప్పులో కాలేస్తున్నావ్! వాగుపొంగినపుడు ముందు మురికినీరొచ్చి అదంతా కొట్టుకుపోయాక ఆ తర్వాత మంచి నీరొస్తుంది. ఇదీ అంతే! వేస్ట్ క్యాండిడేట్స్ అంతా ఇలా వచ్చి వెళ్ళిపోయాక బెస్ట్ క్యాండిడేట్స్ అంతా నిదానంగా వస్తారు''

మిత్రుడు ఎంతో కాన్ఫిడెంట్‌గా అలా అంటుంటే ఇంక అతనికి నచ్చచెప్పబోవటం అనవసరమేనని అర్థమైపోయింది కనకలింగానికి.

"సరే నీ ఇష్టం" అనేసి తనమట్టుకుతాను వెళ్ళిపోయాడు ఆఫీసుకి.

అతను వెళ్ళిన ఓ పది నిముషాలకి...

సూరిబాబు ఎక్స్‌పెక్ట్ చేసినట్టే ఓ బెస్ట్ క్యాండిడేట్ వచ్చింది.

"సూరిబాబుగారు మీరేనా?"

చూడ్డంతోనే ఆమె బెస్ట్ 'క్యాండిడేట్' అని అర్థమైపోవడంతో "అవునండీ నేనే, రండి లోపలికి'' అన్నాడు సూరిబాబు ఎంతో సంతోషంగా.

ఆమె ముఖంలో వినయమూ, విధేయతా కొట్టొచ్చినట్టుగా కనిపిస్తున్నాయి. లేత ఆకుపచ్చ రంగు కాటన్ చీర ధరించి ఉందామె. చెవులకు సింపుల్‌గా ఉన్న దిద్దులు, మెళ్లో ఓ ముత్యాల దండ, నుదుట దోసగింజ షేప్‌లో వున్న ఓ స్టిక్కర్ బొట్టు. పొడవాటి వాలుజడ, ఆ వాలుజడలో ఒకేఒక్క గులాబీ పువ్వు ఓవరాల్‌గా చాలా సింపుల్‌గానూ ఒద్దికగానూ ఉందామె.

ఇక అందం విషయానికొస్తే ముక్తసరిగా చూడచక్కని అందమామెది. చూసిన వెంటనే కళ్ళు తిప్పుకోవాలంటే ఎవరికైనా అసాధ్యమే! సన్నగా, తెల్లగా, పొడవుగా మానవాకారంలో వున్న ఓ 'మెరుపుతీగె'లా ఉంది.

అంత అందంగా, అంత ఒద్దికగా, అంత వినయవిధేయతలు కలిగివున్న అమ్మాయిలో ఊరికే ఉలికించిపోవడానికొచ్చేంత క్రౌర్యం వుండబోదు. కాబట్టి సహజంగానే ఆమె ఓ బెస్ట్ క్యాండిడేట్ అని అర్థమైపో



యింది సూరిబాబుకి.

ఆమె లోపలికొచ్చి కూర్చున్నాక "ఊ చెప్పండి. ఏంటి విషయం?" అనడిగాడు సూరిబాబు.

'పద్ధెనిమిదీ, పంతొమ్మిదేళ్ళుండొచ్చు' అనుకున్నాడు మనసులో ఆమె ఆకారాన్నిబట్టి వయసుని అంచనావేస్తూ.

"నాపేరు సుజీవనండీ! నేను మీ కరపత్రాన్ని చూసొచ్చాను'' చెప్పిందామె.

"ఐసీ... నా కరపత్రం గురించి మీ అభిప్రాయం?" అడిగాడు సూరిబాబు.

"అంటే?" అన్నట్టుగా చూసిందామె.

"ఏం లేదండీ! నా రూమ్‌మేట్ కనక లింగం నేను చేసింది చాలా 'తిక్కపని' అంటున్నాడు మీకెలా అనిపించిందో తెలుసుకుందామని''

ముందే అలా అనేస్తే ఒకవేళ ఆమెక్కూడా అలాంటి అభిప్రాయమే ఉన్నట్లయితే తొందరగా బయటపడి పోతుందికదాని అలా అనేశాడు సూరిబాబు.

"నాకైతే అలా అనిపించలేదండీ! ఇదొక గోల్డెన్ ఆపర్చ్యూనిటీ అనిపించింది''

ఆమె జవాబు సూరిబాబుని ఆనందపరవశుణ్ణి చేసింది.

అలా అనిపించి వచ్చే అమ్మాయికోసమే గదా తానెదురు చూస్తూంట?

"అలాగాండీ? చాలా సంతోషం. ఎందుకని మీ కలా అనిపించింది?" అనడిగాడు సంతోషంగా.

"నిజం చెప్పమంటారా, అబద్ధం చెప్పమంటారా?"

"నిజమే చెప్పండి'' అన్నాడు సూరిబాబు 'ఇదేంటిలా అడుగుతోంది?' అని మనసులో అనుకుంటూ.

అలా అనుకుంటున్నప్పుడు అతను మనసులో కాస్త గాభరా పడ్డమాట నిజమే.

కానీ తీరా ఆమె చెప్పిన సమాధానం విన్నాక అతనిలోని ఆ గుబులు కాస్తా తొలగిపోయింది.

ఎందుకంటే ఆ సమాధానం అతను ఎక్స్‌పెక్ట్ చేసిందే!

సుజీవన- వాళ్ళ అమ్మానాన్నలకి పెద్ద కూతురు. ఆమె తర్వాత ఇంకో నలుగురాడపిల్లలున్నారు. వాళ్ళ తర్వాత ఓ తమ్ముడున్నాడు. ఆమె తండ్రి శాయన్న ఓ హైస్కూల్లో వాచ్‌మెన్‌గా పనిచేస్తున్నాడు. చాలా పేద కుటుంబం. అంతమంది అమ్మాయిలకి కట్నాలిచ్చి పెళ్ళి చెయ్యడం అతనివల్ల అయ్యేపని కాదు. అందుకే సుజీవన అతని కరపత్రాన్ని చూసి అలా రెస్పాండ్ అయ్యింది. అతను గనక కట్నం పేరెత్తకుండా ఉండేట్టయితే ఆమె అతని హృదయాన్ని ఫిలప్ చేసుకోవడానికి సిద్ధంగా ఉంది.

ఆమె అలా ఫ్రాంక్‌గా ఈ విషయాలన్నీ చెప్పేసరికి సూరిబాబు హృదయం దూదిపింజెకన్నా తేలికైపోయింది.

అతను ప్రేమార్తితో అల్లాడిపోతున్న మనిషాయె! కట్నం దేముంది? ముత్తాత దయవల్ల తనకే బోలెడంత ఆస్థి ఉందాయె!

అందుకే "భలేవారండీ! కట్నం కోరుకునే వాణ్ణే అయితే నేనలా కరపత్రాన్ని ఎందుకు రిలీజ్ చేస్తాను? డబ్బు నాకొక సమస్య కాదు. మా ముత్తాత చాలా మంచివాడు. చాలా చాలా సంపాదించిపోయాడు. ఎటొచ్చీ నేను కోరుకునేదల్లా ప్రేమ!" అన్నాడు తేలిగ్గా నవ్వేస్తూ.

"మీరు మీ హృదయాన్ని నాకిస్తే ఐ మీన్ మీ హృదయంలో చోటిస్తే ఐ మీన్ నన్ను మీ ఇల్లాలిగా స్వీకరిస్తే మీరు కోరుకుంటున్న ప్రేమని నేను మీకు తప్పకుండా అందించగలను'' అంది సుజీవన అతి కష్టంమీద బిడియాన్ని జయిస్తూ.

ఆమె జవాబుకి సూరిబాబు సంబరపడిపోలేదు.

పెళ్లయ్యాక ప్రేమించడంలో థ్రిల్లేముందీ? ఏ భార్య అయినా చచ్చినట్టు భర్తని ప్రే





మించే తీర్తుంది.

తనక్కావలసింది పెళ్లికి ముందు ప్రేమ.

ఆ మాటే చెప్పాడామెకి.

అంటే క్లుప్తంగా కాదు. వయసొచ్చినప్పట్నుంచీ తాను ప్రేమకోసం ఎంతగా తపించిపోయిందీ, ఎన్నెన్ని ప్రయత్నాలు చేసిందీ, ఏ కారణంగా తాను విజయం సాధించలేకపోయిందీ అన్నీ వివరంగా చెప్పాడామెకి.

"సో... ఇప్పుడర్థమైందనుకుంటా మీకు ఏ ప్రేమార్తి నాతో ఆ కరపత్రాన్ని వెలువరింపజేసిందో' అన్నాడు చివర్లో.

"అంటే మీ ఉద్దేశం?" అంది సుజీవన.

"సదుద్దేశమే. నేను మిమ్మల్ని తప్పకుండా పెళ్లి చేసుకుంటాను. కానీ దానికన్నా ముందు కొంతకాలం పాటు మనిద్దరం ప్రేమించుకోవాలి. ఆ తర్వాత పెళ్లి" మనసులో దురాలోచననేది లేదు కాబట్టి ధైర్యంగానే చెప్పాడు సూరిబాబు. అంటే తడబడకుండా అన్నమాట.

కానీ సుజీవన మాత్రం అతని మాటల్ని పాజిటివ్‌గా రిసీవ్ చేస్కోలేకపోయింది.

అతన్లోని ఆ ప్రేమార్తేదో తీరిపోయాక పెళ్లీలేదు గిల్లీ లేదు పొమ్మంటే?

ఆ ప్రశ్నే వేసిందామె.

"చఛ... నేనలాంటివాణ్ణి కాదండీ!" అన్నాడు సూరిబాబు ఎంతో నమ్మకంగా.

"అని మీరంటున్నారు. కానీ నేను నమ్మాలనేముందీ?"

"పోనీ ఆ మేరకు ఓ హామీపత్రం రాసివ్వమంటారా?"

"మీరు కథలూ గట్రా రాస్తుంటారా?"

"ఎబ్బేలేదు. ఎందుకని అలా అడుగుతున్నారు?" సుజీవన సడన్‌గా అలా అడిగేసరికి ఒకింత కన్‌ఫ్యూజే అయ్యాడు సూరిబాబు.

"హామీపత్రం అంటుంటేనూ?" అంటూ నవ్వింది సుజీవన.

"అయినా అలాంటి హామీపత్రాలవల్ల ప్రయోజనం ఏముంటుందండీ? తీరా నన్ను ప్రేమలోకి దింపాక మీరు మొండిచెయ్యి చూపిస్తే నాలుక గీసుకోవడానిక్కూడా పనికిరాదా హామీపత్రం" అంది నవ్వడం అయ్యాక పెదవి విరుస్తూ.

ఆమె అలా అనుమానంగా మాట్లాడ్డం సూరిబాబు కేమంత బాధ కలిగించలేదు.

'ఓ ఆడపిల్లగా ఆమె జాగ్రత్తలో ఆమె ఉండటం సబబేగదా' అనుకున్నాడు.

"మరైతే మిమ్మల్ని నమ్మించడానికి నన్నేం చెయ్యమంటారు?"

"అంటే నేను మీకు నచ్చినట్టేనా?" అతనికేసి నిశితంగా చూస్తూ అడిగింది సుజీవన.

"నచ్చబట్టేగా ఇప్పుడీ ప్రశ్నలన్నీ ఉత్పన్నమవుత?" అన్నాడు సూరిబాబు.

ఇంతకన్నా మంచి అమ్మాయిలు ఇంకా వస్తారేమోనన్న ఆలోచన ఆ సమయంలో అతన్లో కలగలేదు.

కలిగినింటి పిల్లకాదన్నమాటేగానీ సుజీవనకేం తక్కువ?

అందుకే ఆమె 'ఊఁ' అంటే చాలు. తన హృదయాన్ని ఆమెకిచ్చేయాలన్న నిర్ణయానికొచ్చేశాడు అతను.

అతని 'ఫాస్ట్ డెసిషన్' ఆమెని మరింత సందిగ్ధంలో పడేసింది.

అఫ్‌కోర్స్... తన 'ప్రేమార్తి' గురించి అతనంతకుముందే చాలా స్పష్టంగా చెప్పినప్పటికీ 'మరీ ఇంత వేగిరపడిపోతున్నాడేంటబ్బా?' అని అనుకోకుండా ఉండలేకపోయింది.

"అన్నట్టిందాక నా గురించి అన్నీ చెప్పి చదువు గురించి చెప్పడం మర్చిపోయాను. నేను టెన్త్ మాత్రమే పాసయ్యాను. అది కూడా కంపార్ట్‌మెంటల్‌గా, అత్తెసరు మార్కుల్తో. అయినా ఫర్వాలేదా?" అడిగింది అతనేమంటాడో చూద్దామని.

"నా భార్యతో ఉద్యోగం చెయ్యించాల్సిన అవసరం నాకు లేదండీ. అసలామాటకొస్తే

నాక్కూడా ఉద్యోగం చెయ్యాల్సిన అవస రంలేదు. కానైతే పురుషలక్షణంకదాని చేస్తు న్నానంతే. అంచేత మీరు కంపార్ట్‌మెంటల్‌గా పాసైనా అత్తెసరు మార్కులొచ్చినా అదేం పట్టించుకోవాల్సిన విషయం కాదు'' అన్నా డు సూరిబాబు సిన్సియర్‌గా.

అతనలా అంటుంటే 'మన ప్రేమా నంతరం మన పెళ్లి జరిగితీర్తుంది' అని అతను హామీ ఇస్తున్నట్టే అనిపించింది సుజీ వనకి. 'అయినా సరే ముక్కూమొహం తె లీని వ్యక్తిని అంత తేలిగ్గా నమ్మేదెలా?'

"ఒకవేళ మీ పాంప్లెట్‌ని చూసి మరికాసే పటికి నా కన్నా మంచి అమ్మాయెవరైనా వస్తే అప్పుడు నా అభ్యర్థనని కేన్సిల్ చే స్తారా?" సడెన్‌గా అడిగింది సుజీవన.

"నెవ్వర్' అన్నాడు సూరిబాబు దృ ఢంగా. "ఈ క్షణంలో మీరు గనక 'ఊc' అన్నారనుకోండి. ఇంతటితో ఈ విషయం ముగిసిపోయినట్లే! ఎందుకంటే ఇది హృద యానికి సంబంధించిన విషయంగదా! ఒక సారి ఒకరికిచ్చేశాక మళ్లీ మళ్లీ ఇంకెవ్వరికీ ఇవ్వడానికి సాధ్యం కాదుగదా?"

అతనలా మాట పూర్తి చేశాడో లేదో "అయితే ఊc కొట్టేస్తున్నాను'' అంది సుజీ వన ఠక్కున.

"చాలా థాంక్సండీ! రియల్లీ అయామె లక్కీగై' అన్నాడు సూరిబాబు అంతకన్నా ఠక్కున.

"మాట తప్పరుగా?"

"నెవ్వర్' స్థిరంగా పలికాడు సూరిబా బు.

అప్పుడు...

అప్పుడు వినిపించింది "ఎక్స్‌క్యూజ్‌మి. మే ఐ కమిన్ ప్లీజ్?" అంటోన్న ఓ కోమల స్వరం గుమ్మంలోంచి.

సూరిబాబు గుమ్మంకేసి చూసి నిర్ఘాంత పోయాడు.

పోడామరి?

రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమాదులు తపస్సు చేసుకునే రుషుల ముందు ప్రత్యక్ష మవుతారు, తపోభంగం కలిగించడానికి. అంతేగానీ తన గుమ్మంలో ప్రత్యక్షం కా వడం ఏంటి?

కళ్లు మిరుమిట్లు గొలుపుతున్న ఆమె అందానికి మూర్ఛవచ్చినంతపనైంది సూరిబా బుకి.

'మనుషుల్లో మరీ ఇంత అందమైన వా ళ్లు ఉండటం ఎలా సాధ్యం?' అని అనుకో కుండా ఉండలేకపోయాడు.

"ఎస్... కమిన్' అన్నాడు ఎలాగో తెప్ప రిల్లుతూ.

"సూరిబాబుగారు మీరేనా?" ఆమె లోప లికొస్తూ అడిగింది.

"నేనే. అలా కూర్చోండి'' అన్నాడు సూరి బాబు.

ఆమె వచ్చి సుజీవన పక్కనే ఖాళీగా వున్న మరో కుర్చీలో కూర్చుంది.

ఆమె పక్కన సుజీవనను చూస్తుంటే సూర్యుడిముందు దివిటీలా అనిపించింది సూరిబాబుకి.

సుజీవన ఆమెకేసి రెప్పవాల్చకుండా చూస్తూ ఉంది.

ఎంతందమెంతందం? స్త్రీ అయ్యుండి కూడా ఆమె అందాన్ని చూస్తుంటే సుజీవన మనసులో ఏదో సంచలనంలాంటిది కలి గింది.

'తనకే ఇలా ఉంటే సూరిబాబుకింకెలా ఉంటుందో?'
అనిపించిందామెకి.

"నా పేరు ప్రహేళిక. నేను మీ కరపత్రా న్ని చూసి వచ్చాను'' ఆమె తనని తాను పరిచయం చేసుకుంటూ చెప్పింది.

"అలాగా! బట్ అయామ్ వెరీ వెరీ సారీ అండీ'' అన్నాడు సూరిబాబు వెంటనే.

'దేనికి?' అన్నట్టుగా చూసిందామె ఆశ్చ ర్యంగా.




"ఆ కరపత్రం చాప్టర్ మీరు రావడానికి కొద్దిక్షణాల ముందే క్లోజ్ అయిపోయింది. ఈమె పేరు సుజీవన. జస్ట్ మీరొచ్చేముందే నా హృదయాన్ని ఈమెకిచ్చేశాను. సో... మీరొచ్చింది. నా హృదయం కోసమే అయితే అయామ్ ఎక్స్ట్రీమ్‌లీ సారీ ఫర్‌ది డిసప్పాయింట్‌మెంట్' అన్నాడు సూరిబాబు.

అతని మాటలకామెతోపాటు సుజీవన కూడా దిగ్భ్రాంతురాలైంది.

"నాలాంటి జగదేకసుందరిని వివరాలైనా పూర్తిగా అడిగి తెలుసుకోకుండానే నో అనేస్తున్నాడేమిటి?" అని తెల్లబోతోంది వచ్చిన ఆ అతిలోకసుందరి.

'ఇచ్చిన మాటకోసం ఎంత అందగత్తెని వదిలేసుకుంటున్నాడు?' అన్న దిగ్భ్రాంతి సుజీవనది.

"అదేంటండీ నా గురించి ఏమీ తెలుసుకోకుండానే 'నో వేకెన్సీ' అనేస్తున్నారు! నేనెవర్నో తెలుసా? బిజినెస్ మాగ్నెట్ భానుప్రకాశ్ పేరు మీరు వినేవుంటారు. అయామ్ హిజ్ ఓన్లీ డాటర్! నాకు మొదట్నుంచీ విచిత్రంగా ఉండటం అన్నా, విచిత్రంగా ఉండే మనుషులన్నా చాలా ఇష్టం. మనం ఏం చేసినా అది చాలా వెరైటీగా ఉండాలని కోరుకునే మనిషిని నేను. మీ పాంప్లెట్ చాలా విచిత్రంగా అనిపించి మీలాంటి విచిత్రమైన మనిషిని ఎలాగైనా నా సొంతం చేసుకోవాలన్న పట్టుదలతో వచ్చాను. భానుప్రకాశ్ అనగానే మీ కర్థమైపోయి ఉంటుంది నేనెంత ఆస్తిపరురాలినో. ఇహ నా అందం సంగతి నేనుగా చెప్పాల్సిందేంలేదు. మీ కళ్లనడిగితే అవే చెబుతాయి.. ఇప్పుడు చెప్పండి... మీ హృదయాన్ని నాకిస్తారా? లేదా?" అంది ప్రహేళిక దిగ్భ్రాంతినుండి అతికష్టమ్మీద కోలుకుంటూ.

"మీరు ఎవరైనా కావచ్చుండీ! కానీ చెప్పానుగా, మీర్రావడానికి కొద్దిక్షణాల ముందే నా హృదయాన్నీమెకిచ్చేశాను. అయామ్ సారీ! మీకెంత ఆస్తయినా ఉండొచ్చు. కానీ ఒకసారి ఒకరికిచ్చిన హృదయాన్ని మళ్ళీ వెనక్కి తీసుకోవడం నా వల్లయ్యే పనికాదు'' అన్నాడు సూరిబాబు నిర్మొహమాటంగా.

అతనలా అంటుంటే సుజీవన మరింత దిగ్భ్రాంతికి లోనయ్యింది.

'బాప్‌రే బాప్! ఎంత నిజాయితీగల మనిషి? ఇతన్నా తాను ముందు శంకించింది?'

ఒకపక్క ఆశ్చర్యపోతూనే అలా అనుకోకుండా ఉండలేకపోయింది సుజీవన.

ప్రహేళిక ముఖం కందగడ్డలా అయ్యింది సూరిబాబు మాటలకి.

అసలే డబ్బులో పుట్టి డబ్బులో పెరిగిన మనిషేమో, "ఏం చూస్కుని వీడికింత మిడిసిపాటు?" అన్న ఉక్రోషం ఏర్పడిపోయిందామెలో.

"ఒకసారి ఇచ్చిన హృదయాన్ని వెనక్కి తీసుకోకూడదని రూలేం లేదులెండి. కావాలంటే నష్టపరిహారంగా ఎంతో కొంత పడేస్తాను. ఆమెనే అడగమనండి ఎంత కావాలో?" అంది ఆవేశంగా.

"ఇంత అందమైన మనిషిలో ఎంత అహంకారం? ఛీ!" అనిపించింది సూరిబాబుకి.

"మీరు కోటి రూపాయలిచ్చినా ఆమె నా హృదయాన్ని మీకు తిరిగివ్వరు. ఏవండీ సుజీవనగారూ అంతేకదూ?" అన్నాడు తను కూడా ఆవేశపడిపోతూ సుజీవనవైపు తిరిగి.

ఇది కలా నిజమా అనిపించింది సుజీవనకి.

ప్రహేళిక గేటుదాటి లోపలి కొస్తూండటం చూసే ఇంతకుముందు తానంత తొందరపడి 'ఊ' అనేసింది.

ఇప్పుడా 'ఊం'కి ముందు మరో 'ఉ'ని చేర్చి "ఉఊం" అంటే కోరినంత డబ్బిస్తానంటోంది ప్రహేళిక. ఎంత విచిత్రమైన పరిణామం?



సినిమాల్లోనే జరుగుతుంటాయ్, ఇలాంటి ఇన్సిడెంట్స్ సాధారణంగా.

"మాట్లాడరేంటి సుజీవనగారూ?" అని సూరిబాబు రెట్టించిన మీదటగానీ ఆమె ఆ ఆశ్చర్యంలోంచి తేరుకోలేకపోయింది.

తనకిచ్చిన మాటకోసం అంతటి అందగత్తెనీ, అంతటి ఆస్తి పరురాల్నీ తృణప్రాయంగా తోసిపారేస్తున్న సూరిబాబుమీద ఆమెలో ఒక్కసారిగా చెప్పలేనంత గౌరవం ఏర్పడిపోయింది.

ఆ సమయంలో ఆమెకు తన కుటుంబ పరిస్థితిగానీ, తమ లేమిగానీ గుర్తుకురాలేదు.

"ఏముంది సూరిబాబుగారూ మాట్లాడ్డానికి? నా తరఫున మీరే చెప్పారుగా? మీ మాటే నా మాట. కోటి రూపాయలిచ్చినా నేను మిమ్మల్ని వదులుకోను'' అనేసింది తక్కున.

అంతే.

ప్రహేళిక ముఖం పెంకులా మాడిపోయింది.

అవమానభారంతో ఆమె నిలువెల్లా కంపించిపోయింది.

"అంతేనా? అదే ఆఖరిమాటా?" అంది ఉక్రోషంగా.

"ముమ్మాటికీ అంతే'' అంది సుజీవన తొణకబోయిన మనసుని కూడగట్టుకుంటూ.

"షిట్!" అంటూ ఛివాల్న లేచి నిలబడింది ప్రహేళిక.

ఆమె మరొక్కమాట కూడా మాట్లాడకుండా విసవిసా వెళ్ళిపోతుంటే చేష్టలు దక్కి కూర్చుండిపోయారు సూరిబాబూ సుజీవనా.

ఆమె గేటు తీసుకుని వెళ్ళిపోతుంటే అప్పుడు గమనించాడు సూరిబాబు రోడ్డు మీద ఆగివున్న కాంటెస్సా కారుని.

అది ప్రహేళిక కారే.

ఆమె ఆ కారుని సమీపించగానే అంతవరకూ ఎక్కడున్నాడో ఏమోగానీ డ్రైవర్ ఫ్రేమ్‌లోకి ఎంటరయ్యాడు.

అతను అతివినయంగా డోర్ ఓపెన్ చేసి పట్టుకోగానే ప్రహేళిక కోపంగా సూరిబాబు రూంకేసి ఓ చూపు చూసి కారులో ఎక్కికూర్చుంది.

ఆ కాంటెస్సా అక్కణ్ణుంచి కదిలి వెళ్ళిపోయాక "డబ్బుందన్న అహంకారం ఆమెతో ఎలా మాట్లాడించిందో చూశారా?" అన్నాడు సుజీవనవైపు తిరిగి.

'మరే' అన్నట్టుగా తలాడించింది సుజీవన.

ఆమె ఆ ఆశ్చర్యంలోంచి ఇంకా తేరుకోలేకపోతూ వుంది!

సూరిబాబు ప్లేస్‌లో ఇంకెవరున్నా అంత మంచి అవకాశాన్ని వదులుకోరు.

అలాంటిది ఇతను ఇచ్చినమాట కోసం.

"ఏంటి సుజీవనగారూ ఏదో ఆలోచిస్తున్నట్టున్నారు?"

సూరిబాబు ప్రశ్న ఆమెనాలోచనల్లోంచి ఇవతలకు లాగింది.

"అబ్బే ఏంలేదండీ'' అంది.

"ఏమీ లేకపోవడం ఏంటి? మీ కింకా నా మీద అనుమానం పోనట్టుగా వుంది. అందుకే ఆలోచిస్తున్నారు. అవునా?" అన్నాడు సూరిబాబు.

"మీమీద ఇంకా అనుమానమా? అబ్బ! ఎంత పెద్ద జోక్ వేశారు సూరిబాబుగారూ?" అంది సుజీవన.

"జోకా?" ఆశ్చర్యంగా అన్నాడు సూరిబాబు.

"కాక?" అంటూ ఎదురుప్రశ్న వేసింది సుజీవన. "దీన్ని జోకనే అంటారు సూరిబాబుగారూ! లేకపోతే ఏంటి? ఇప్పుడు జరిగిన సంఘటన చెప్పకనే చెప్పింది మీ హృదయం ఎలాంటిదో. ఐ మీన్ ఎంత మంచిదో. అంత మంచి హృదయంలో చోటు దొరికినందుకు ఏ ఆడపిల్లైనా సంతోషిస్తుందే




తప్ప, మిమ్మల్ని ఇంకా అనుమానిస్తుందా?" అంది బిడియంగా తలదించుకుంటూ.

'యాం హూం' అని అరవాలన్నంత సంతోషం కలిగింది సూరిబాబుకి ఆమె అలా అంటుంటే.

"అయితే మీకు నామీద నమ్మకం కలిగేసిందన్నమాట. నేనింక ఎలాంటి హామీ పత్రాలూ రాసివ్వనక్కర్లేదన్నమాట?" అన్నాడు సంబరంగా.

"అవును'' అంది సుజీవన దించిన తలని ఎత్తకుండానే ముసిముసిగా నవ్వుతూ.

"అయితే ఈ క్షణంనుండి మనిద్దరం ప్రేయసీప్రియులమన్నమాట. మరైతే ఇంక ఆలస్యం దేనికి? కమాన్ ప్రేమించుకుందాం రండి'' అన్నాడు సూరిబాబు. మితిమీరిన ఆనందంలో తానేం మాట్లాడుతున్నదీ తనకే తెలియనిస్థితిలో.

"అంటే?" అతనికేసి కొంచెం ఆగ్రహంగా చూసింది సుజీవన.

అప్పుడుగాని అర్థంకాలేదు సూరిబాబుకి. తాను చాలా తప్పుడర్థం వచ్చేలా మాట్లాడానని.

"సారీ అండీ! మీరు నా హృదయాన్ని స్వీకరించారన్న సంతోషంకొద్దీ ఏదో వాగేశాను. అవునూ, అసలింతకీ ప్రేమించుకోవడం అంటే ఏంటండీ?" అన్నాడు- ఇప్పుడున్న ఈ మాటల్లో కూడా తప్పుడర్థమే ఉందని గ్రహించుకోకుండా.

అతను మళ్ళీ అలాంటి ప్రశ్నవేయడం సుజీవనకు చిరుకోపాన్ని రప్పించినా, అతని కంగారూ అదీ చూసి ఫకాల్న నవ్వకుండా వుండలేకపోయింది.

"మీలో ప్రేమార్తో అదేదో ఉందన్నారుగా? సో మీకే తెలియాలి ప్రేమించుకోవడం అంటే ఏంటో?" అంది నవ్వడం అయ్యాక.

"ప్రేమించుకోవడం అంటే''

"ఊం అంటే?"

"అదేనండీ. సినిమాల్లో చూస్తుంటాంగదా! అదన్నమాట" అన్నాడు అంతకన్నా ఏంచెప్పాలో తోచక.

కొమ్ములు తిరిగిన రచయితలు సైతం సరిగ్గా నిర్వచించలేనిది ప్రేమంటే.

అలాంటిది సూరిబాబు అంతకన్న గొప్ప సమాధానం ఏం చెప్పగలడు పాపం?

అతని జవాబుకి సుజీవన మరోమారు ఫకాల్న నవ్వింది.

"భలేవారండీ ప్రేమంటే ఏంటో సరిగ్గా తెలియకుండానే 'ప్రేమార్తి'తో పాంప్లెట్స్ వెయ్యించారా?" అంది నవ్వడం అయ్యాక.

ఆమె మాటలకు ఈసారి సూరిబాబు సిగ్గుపడ్డాడు. "చఛ... తెలియకపోవడం కాదండీ. తెలుసు. కానీ చెప్పలేకపోతున్నాను''

"పోనీ నన్ను చెప్పమంటారా?" అడిగింది సుజీవన.

"చెప్పండి చెప్పండి'' అన్నాడు సూరిబాబు ఉత్సాహంగా.

ఏదో అలా అనేసిందే తప్ప తీరా చెప్పబోయేసరికల్లా ఆమెక్కూడా అర్థం కాలేదు ఏం చెప్పాలో.

"డిటో' అంది పెదవి విరుస్తూ.

"అంటే?" అన్నాడు సూరిబాబు కించిద యోమయంగా.

"నాదీ మీ పరిస్థితే'

"అంటే?"

"ప్రేమంటే ఏంటో తెలుసుగాని నేను కూడా మీలాగే దాన్ని మాటల్లో చెప్పలేకపోతున్నాను''

ఆమె అలా అనేసరికి ఈసారి ఫకాల్న నవ్వడం సూరిబాబు వంతైంది.

"భలేవారండీ! ఈ పాటి దానికేనా 'పోనీ నన్ను చెప్పమంటారా' అంటూ అంత ఇదిగా ముందుకొచ్చారు?" అన్నాడు నవ్వడం అయ్యాక.

"నేను ముందుకొచ్చానా? అసలు కూర్చు

న్న చోటునుంచి కదలనిదే?" అంటూ తన కేసి తాను చూసుకుంది సుజీవన.

భావిసతీమణి అంత గొప్ప జోక్ వేస్తే నవ్వు రాకుండా ఎవరికుంటుంది?

అందుకే మరోమారు ఫకాల్న నవ్వేశాడు సూరిబాబు.

"ప్రేమంటే ఇదేనండీ'' అన్నాడు నవ్వడం అయ్యాక.

"అంటే?" అంటూ అయోమయంగా చూడ్డం ఈసారి సుజీవన వంతైంది.

"కూర్చున్నచోటునుంచి ఒక్క అంగుళమైనా కదలకుండానే మీరు ముందుకొచ్చి నా హృదయంనిండా నిండిపోయారు. చూడండీ, దీన్నే ప్రేమంటారు'' అన్నాడు సూరిబాబు నోటికొచ్చిన వాగుడేదో వాగేస్తూ.

"అదేంటి మీ హృదయం ఇంకా మీ దగ్గరెలా ఉంది? ఇందాకే మీరు దాన్ని నాకిచ్చేశారుగా?" అంది సుజీవన ఆశ్చర్యాన్ని అభినయిస్తూ.

ఆమె అభినయచాతుర్యానికి తెగముచ్చట పడిపోతూ మళ్ళీ ఫకాల్న నవ్వాడు సూరిబాబు.

"సందేహం లేదండీ! మన మధ్య ప్రేమ పుట్టేసినట్టే'' అన్నాడు నవ్వడం అయ్యాక.

"అదెలా?" అంది సుజీవన.

"ఒకరి మాటలొకరికి ఇంతగా నచ్చుతున్నాయీ అంటే ఒకర్ని చూసి ఒకరం ఇంతగా నవ్వేసుకుంటున్నామూ అంటే దానర్థం అదేగా?" అన్నాడు సూరిబాబు.

'అలాగేం?' అన్నట్టుగా నవ్వి ఊరుకుంది సుజీవన.

"మరింక నేను వెళ్లిరానా?" అంది కొద్దిక్షణాల తర్వాత.

"అప్పుడేనా?" అన్నాడు సూరిబాబు దిగులుగా.

"అంటే ఎంతసేపని మీ ముందు ఇలా కూర్చోమంటారు?" అంది సుజీవన.

సూరిబాబుకేం చెప్పాలో తోచలేదు.

అంటే బొత్తిగా తోచలేదని కాదు. 'ఎన్ని యుగాలైనా మీతో మాట్లాడుతూ ఇలా గడిపేయగలను' అని అనాలనిపించింది. కానీ ఇంత త్వరగా అంత హెవీ డైలాగ్ వాడ్డం బావుండదేమోననిపించి మిన్నకుండిపోయాడు.

"మాట్లాడరేమండీ? నేనింక వెళ్లొస్తాను'' అంటూ అతని అనుమతి కోరకనే లేచి నిలబడింది సుజీవన.

"సరే' అన్నాడు సూరిబాబు తానూ లేచి నిలబడుతూ "మళ్ళీ ఎప్పుడొస్తారు?"

"పదే పదే నేను మీ రూంకి రావడం అంత బావుండకపోవచ్చు. కాబట్టి రేపట్నుంచి మనం బయటెక్కడైనా కలుసుకుందాం" అంది సుజీవన.

ఇదేదో బాగానే ఉన్నట్టుందే అనుకుని,

"మీరే చెప్పండి రేపు మిమ్మల్ని ఎక్కడ కలుసుకోమంటారో?" అన్నాడు సూరిబాబు.

"రేపు సాయంత్రం అయిదింటికి టాంక్ బండ్‌కి రండి. నేను విగ్రహం దగ్గర వెయిట్ చేస్తుంటాను'' అంది సుజీవన గుర్తుకోసం ఆ విగ్రహం పేరు చెబుతూ.

"సరేనండి'' అన్నాడు సూరిబాబు.

"ఇకనుండి మీరు ఈ అండీలూ గుండీలూ మానెయ్యాలి''

ఆమె మాటని వెంటనే శిరసావహిస్తూ, "సరే సుజీవనా!" అన్నాడు సూరిబాబు.

'దట్స్ గుడ్' అన్నట్టుగా నవ్వి "మరి నేను వెళ్ళిరానా?" అంది సుజీవన.

"అలాగే. కానీ మీ అడ్రస్ ఇచ్చెళ్లండి'' అన్నాడు సూరిబాబు.

"దేనికి?"

"ఒకవేళ మీరు రాకపోతే..."

"రాకుండా ఎందుకుంటాను?"

ఆమె అలా ప్రశ్నించేసరికి సూరిబాబు ఇంకేమీ మాట్లాడలేకపోయాడు. ఆమె అంత కాన్ఫిడెంట్‌గా చెబుతున్నప్పుడు తానింకా





ఏమైనా అంటే అది ఆమె ప్రేమని శంకించిన ట్టే అవుతుందనిపించి 'సరే మీ ఇష్టం' అన్నట్టుగా తలాడించి ఊరుకున్నాడు.

ఆమె అతనికి చేత్తో టాటా చెప్పి వెళ్ళిపోయింది.

ఆమెని గేటుదాకా సాగనంపి తిరిగొచ్చాక ఇది నిజమా, కలా అన్న సందేహం కలిగి తనని తానే ఓ మారు గిచ్చి చూసుకున్నాడు సూరిబాబు.

గిచ్చుకున్న చోట నొప్పి బాగానే తెలియడంతో అది కలకాదు నిజమేనని అతనికి స్పష్టంగా అర్థమైపోయింది!



''నేనేం చెవిలో పువ్వెట్టుకోలేదు''

కనకలింగం ఆఫీస్నుండి రాగానే సూరిబాబు జరిగిన విషయం యావత్తూ చెప్పడంతో అతనన్నాడలా.

నిజమే మరి!

చెవిలో పువ్వెట్టుకున్నవాళ్ళు మాత్రమే నమ్మగలిగేట్టుగా ఉంది సూరిబాబు చెప్పినదంతా.

"అంటే నావన్నీ కోతలంటావా?" ఉక్రోషంగా అన్నాడు సూరిబాబు.

"కాదని నన్ను నమ్మమంటావా?" అన్నాడు కనకలింగం ఎగతాళిగా.

"నీకంత నమ్మకం లేకపోతే రేపు సాయంత్రం నువ్కూడా నాతో టాంక్బండ్కి రా! అక్కడ నువ్వే చూద్దువుగాని నా ఫియాన్సీ సుజీవనని'' అన్నాడు సూరిబాబు.

అతనంత ధీమాగా అనేసరికి సహజంగానే కనకలింగం ఒకింత మెత్తబడ్డాడు.

"చూపిస్తాననంటున్నావు కాబట్టి సుజీవన అనే అమ్మాయి నిన్నప్రోచ్ అయ్యిందని నమ్ముతాను. ఆమె పేదింటి అమ్మాయి అంటున్నావు కాబట్టి నీ బోడి కరపత్రాన్ని చూసి ఏదో ఆశపడి అలా వస్తే వచ్చుండొచ్చు. కానీ ఆ తర్వాత వినిపించావే, ఇంకెవరో 'ప్రహేళిక' అంటూ అది మాత్రం నేను చచ్చినా నమ్మను'' అన్నాడు అదోలా చూస్తూ.

"ఎందుకని నమ్మవు?"

"సదరు ప్రహేళిక- అదే ఆ అమ్మాయి బిజినెస్ మాగ్నట్ భానుప్రకాష్ కూతురంటున్నావుగా? అందుకని నమ్మను''

"అంటే నీ వుద్దేశ్యం?"

"నా బొంద. అబద్ధాలాడ్డానిక్కూడా ఓ హద్దుండాల్రా! ఆ మొదటమ్మాయి పేదరాలు కాబట్టి నీ దగ్గరి కొచ్చిందంటే, ఇట్సోకే. కాస్త నమ్మబుల్గానే ఉంది. కానీ ఓ కోటీశ్వరుడి కూతురు నిన్ను వెదుక్కుంటూ రావడం ఉంది చూశావ్ ఇది మాత్రం కలలో తప్ప ఇలలో జరిగే పనికాదు'' అన్నాడు కనకలింగం చేతులు తిప్పుతూ.

మిత్రుడు తననో అబద్ధాల కోరుగా ఎంచి అంత హారిబుల్గా మాట్లాడ్డం సహజంగానే సూరిబాబుకి చాలా బాధ కలిగించింది.

"నీతో అలా లేనిపోనివి కల్పించి చెప్పాల్సిన అవసరం నాకేముంది? కావాలంటే మా ముత్తాతమీద ఒట్టు. ఇప్పటికైనా నమ్ముతావా?" అన్నాడు ఆవేదనగా.

"నా బొంద. నీ బోడి ఒట్టు స్వర్గంలో ఉన్న మీ ముత్తాతనేం చేస్తుంది? చచ్చిపోయిన వాళ్ళమీద ఒట్టెవరైనా వెయ్యగలరు''





అన్నాడు కనకలింగం నాలుక చప్పరించేస్తూ.

"పోనీ నా ఫియాన్సీ సుజీవన మీద ఒట్టు. అసలీ ఒట్లన్నీ దేనికి? రేపు నీకామెను పరిచయం చేస్తాగా. ఆమెనే అడుగు. అప్పుడు తెలుస్తుంది. నీకు నిజం" అన్నాడు సూరిబాబు.

దాంతో 'కొంపదీసి వీడు చెబుతున్నదంతా నిజమేనా?' అనిపించింది కనకలింగానికి.

నిజం కాకపోతే మరీ అంత గట్టిగా ఎందుకు చెబుతాడు?

మనసులో తనని తానే ఆ ప్రశ్న వేసుకున్నాక అప్పుడనిపించింది అతగాడికి ఇదేదో నిజమే అయ్యుంటుందని.

"మరైతే ఏం పోయేకాలమొచ్చిందని ఆమెను కాదన్నావ్‌రా?" అన్నాడు పూర్తిగా మెత్తబడిపోతూ. అంటే మిత్రుడి మాటల్ని నమ్ముతూ.

"ఇందులో పొయ్యేకాలం ఏముంది? జస్ట్ ఆమె రావడానికి ముందే నేను సుజీవనకి మాటిచ్చేశాను. ఆ ప్రహేళిక సుజీవనకన్నా అందంగా ఉన్నమాట నిజమే. ఆస్తిపరురాలన్న మాట నిజమే! అయినంత మాత్రాన ఇచ్చినమాట తప్పలేంగదా?"

సూరిబాబు అలా అంటుంటే అతనిది అమాయకత్వం అనుకోవాలో, పిచ్చి అనుకోవాలో, వెర్రి అనుకోవాలో, లేక ఇంకేదయినా కొత్తపదం వెతుక్కోవాలో ఏమో, అసలేమీ అర్థంకాలేదు కనకలింగానికి.

ఆ షాక్‌నుంచి తేరుకోవడానికి అతనికి రెండు నిముషాలకన్నా ఎక్కువసేపే పట్టింది.

"ఎంత పిచ్చి సన్నాసివిరా నువ్వు?" అన్నాడు తేరుకున్నాక ఆవేదనగా.

మిత్రుడు ఒక మహత్తరమైన అవకాశాన్ని చేజార్చుకుంటే ఆవేదన కలక్కుండా ఎవరికుంటుంది?

"ఇందులో పిచ్చిసన్నాసితనం ఏముందిరా? అసలా అమ్మాయి ఎంత పొగరుగా మాట్లాడిందో తెలుసా?" కళ్లెగరేస్తూ సూరిబాబు అలా అంటుంటే అతన్ని కుళ్ళబొడవాలనిపించింది కనకలింగానికి.

లేకపోతే ఏంటి? కోటీశ్వరుడి కూతురన్నాక ఆ మాత్రం పొగరు లేకుండా ఉంటుందా? పొగరుంది కదాని అంత ఆస్థిపరురాల్ని అలా వదిలేసుకుంటారా ఎవరైనా?

ఆమాటే అన్నాడు పటపటా పళ్ళు నూరుతూ.

కోటీశ్వరుడికి అల్లుడయ్యే అపూర్వ అవకాశాన్ని వెర్రిబాగుల తనం కొద్దీ కాలదన్నుకున్న అప్రాచ్యుడి మీద ఎవరికి కోపం రాకుండా ఉంటుంది?

"అసలా మాటకొస్తే ఆమెకంత పొగరుందని తెలియకముందే నేనామెని రిజెక్ట్ చేసేశాను తెలుసా?" తను చేసిందేదో ఘనకార్యమైనట్టు మిత్రుడలా అంటుంటే ఇంక కోపాన్ని నిగ్రహించుకోలేకపోయాడు కనకలింగం.

"నోర్ముయ్యరా పూలాఫెనేస్' అనరిచేశాడు గట్టిగా.

ఎంత గట్టిగా అంటే, అతనరిచిన ఆ అరుపుకి ఆ పక్క గదిలోని వాళ్ళు కంపించిపోయారు.

"ఎందుకురా అలా అరుస్తావు?" అన్నాడు సూరిబాబు మిత్రుడి దిక్కు ఆశ్చర్యంగా చూస్తూ.

"నేను చేసిన దాంట్లో తప్పేముందని?"

"తప్పా తప్పున్నరా? తలకాయలో మెదడున్నవాడెవడూ నీలా చెయ్యడు. ముక్కూ మొహం తెలియని ఓ అమ్మాయికి, జస్ట్ కొద్దిక్షణాల ముందు ఓ మాటిచ్చినంతమాత్రాన, ఆ కారణంగా అంత గొప్పింటమ్మాయిని వదులుకోవడం... ఛ... ఛ... నవ్వాలో ఏడ్వాలో కూడా అర్థం కావట్లేదు నాకు. ఇప్పటికైనా మించిపోయిందేంలేదు. ఆ సుజీవనో, బొజీవనో ఆవిడగారి సంగతి మర్చి

పోయి అర్జంట్‌గా వెళ్ళి ఆ ప్రహేళికని క్షమా పణ అడుగు. అవసరమైతే కాళ్ళమీదైనా పడిపో. అంతేగానీ ఆమెని మాత్రం చెయ్యిజారుచ్చుకోవద్దు. నీ స్నేహితుడిగా, శ్రేయోభిలాషిగా నీ బాగుకోరి చెబుతున్నాను'' అన్నాడు కనకలింగం సూరిబాబు చేతులు రెండూ గట్టిగా పట్టుకుంటూ.

అతని 'పాయింటాఫ్ వ్యూ'లో అతనంటున్నది కరక్టే! కారణం ఏమైనా కానీ, ప్రహేళిక లాంటి అమ్మాయి ఏరికోరి వస్తే ఇంకో దరిద్రురాలికోసం ఆమెను వదులుకోవడం తప్పున్నర తప్పే.

కానీ సూరిబాబు 'పాయింటాఫ్ వ్యూ' వేరుకదా?

అందుకే "నువ్ నన్ను మిస్‌గైడ్ చేస్తున్నావురా'' అన్నాడు సూరిబాబు.

"మిస్‌గైడ్ చెయ్యడం కాదు. మతి కలిగిన వాడిలా ప్రవర్తించమంటున్నాను'' అన్నాడు కనకలింగం కోపంగా.

"మతి కలిగినవాణ్ణి కాబట్టే ఇచ్చిన మాటకు కట్టుబడ్డాను. క్షణానికోలా మనసు మార్చుకునే వాళ్ళని మతి కలిగిన వాళ్ళనరు. చపల చిత్తులంటారు. అయినా నాక్కావలసింది నా ప్రేమార్తి తీరడమే తప్ప డబ్బుకాదు. డబ్బున్న ఆ పొగరుమోతు కన్నా డబ్బులేని సుజీవనే మిన్న'' అన్నాడు సూరిబాబు జరిగినదానికేమాత్రం పశ్చాత్తాపం చెందకుండా.

చేసింది తప్పని అతనికనిపిస్తేగదా పశ్చాత్తాపం చెందడానికి?

"ఆమె చాలా డబ్బున్న అమ్మాయి కదా? జరిగిన దానికి కడుపుమండి ఒక వేళ నిన్ను రౌడీల చేత తన్నిస్తే?" కనకలింగం సడన్‌గా ఓ కుశంకని వ్యక్తం చేశాడు.

"అలా ఎన్నటికీ జరగదు. తెలుగు సినిమాల్లో నగ్మాలాంటి పొగరుమోతు హీరోయిన్లు మాత్రమే అలాంటి వెర్రిమొర్రి పనులు చేస్తారు. కానీ ఇది జీవితం. అయినా సరే ఇప్పటికే చాలా సినిమాటిక్ సంఘటనలు జరిగిపోయాయి. ఇంకా ఇంకా అలా జరుగుతూనే వుంటాయని నేననుకోను'' మహాజ్ఞానిలా ముఖం పెడుతూ అన్నాడు.

కానీ అక్కడ ప్రహేళిక సరిగ్గా అదే ఏర్పాట్లో ఉందని అతనికేం తెలుసు?

★ ★ ★

"ఏంటి బేబీ నువ్వు అంటున్నది?" ఆశ్చర్యంగా అన్నాడు భానుప్రకాష్.

అలా అంటూనే కూతురికేసి చాలా చాలా విస్మయంగా చూశాడు.

"ఎస్. డాడీ! నాకు అర్జంట్‌గా ఓ అరడజను మంది రౌడీలు కావాలి'' అంతకుముందు చెప్పినదాన్నే పునరుద్ఘాటించి "ఐ మీన్ కిరాయి గూండాలు'' అంది ప్రహేళిక.

"చూడు బేబీ, నా ఒడ్డూ పొడవూ ఆకారమూ కొంతలో కొంత కీ.శే. రావుగోపాలరావులా ఉంటే ఉండొచ్చు. అంతమాత్రానికే నేనేదో విలన్‌నయినట్టూ, నువ్వేదో విలన్ కూతురివైనట్టూ ఏంటమ్మా ఈ కోరరాని కోరిక? కోట్లాది రూపాయల్తో వ్యాపారం చేస్తున్నాను. బిజినెస్ పరంగా నాకెంతో మంది శత్రువులున్నారు. అయినా నాకే ఎప్పుడూ కిరాయి గూండాలతో అవసరం పడలేదు. ఎందుకంటే అన్ని విషయాల్లోనూ సక్రమ మార్గంలోనే వెళ్ళే మనిషిని నేను. అలాంటిది నీకు కిరాయి గూండాలతో పనేమొచ్చింది? వక్రమార్గాల్లో వెళ్ళే వాళ్ళకే అలాంటి వాళ్ళతో పనిబడుతుంది. అసలు విషయమేంటో చెప్పుతల్లీ. దాన్నిబట్టి నేను డిసైడ్ చేస్తాను ఏం చెయ్యాలో?" అన్నారాయన.

ఒక్కగానొక్క కూతురు కాబట్టి ప్రహేళిక మీద ఆయనకు చెప్పలేనంత అనురాగం ఉన్నమాట నిజమే.

ఆమె కొండమీది కోతి నడిగినా తెచ్చి ఇస్తూంటాడెప్పుడూ.

కానీ ఇప్పుడామె అడిగింది సామాన్యమైన కోరికకాదు గదా?!




కూతురు కిరాయి రౌడీలను అరేంజ్ చెయ్యమంటుంటే సంగతేంటో తెలుసుకోకుండా ఏ తండ్రి మాత్రం దాని కంగీకరిస్తాడు?

"ఒకానొక సూరిబాబు అనే కోన్‌కిస్కా వెధవ నన్ను చాలా ఘోరంగా ఇన్సల్ట్ చేశాడు డాడీ! అర్జంట్‌గా నేను వాడి పొగరణచాలి'' అంది ప్రహేళిక పిడికిళ్ళు బిగిస్తూ. అలా అంటున్నప్పుడామె ముక్కుపుటాలు రోషంతో అదిరాయి. నవలల్లో రాసేట్టే ఆమె దవడ కండరం ఒకటి బిగుసుకుంది.

కూతురి ఉద్రేకమూ, వాలకమూ చూస్తుంటే ఆమె గుండెకేదో బలమైన దెబ్బే తగిలిందని అర్థమైంది భానుప్రకాష్‌కి.

"ఎవడమ్మా నిన్నిన్సల్ట్ చేసిన ఆ అడ్డగాడిద? ఎన్ని గుండెలు వాడికి?" అంటూ తనుకూడా ఆవేశపడిపోయి ఆ వెంటనే తెలివి తెచ్చుకున్నాడు.

"ఆవేశం చాలా అనర్థదాయకం తల్లీ! ఆ వెధవెవడో నిన్నిన్సల్ట్ చెయ్యడం తప్పే. అందుకని అతనిమీద రౌడీలని ప్రయోగించాలనుకోవడం తెలిసి తెలిసి మనం కూడా తప్పు చేసినట్టే అవుతుంది. అలాంటి జులాయి వెధవల్ని శిక్షించడానికి పోలీసులున్నారుగా? వాడు నిన్నెలా ఏడిపించాడో చెప్పు. వెంటనే వాణ్ణి 'ఈవ్ టీజింగ్' నేరంకింద అరెస్ట్ చెయ్యించేస్తాను. రౌడీల దాకా ఎందుకు? ఆ దేహశుద్ధేదో ఆ పోలీసులే చేస్తారు వాడికక్కడ" అన్నాడు అనునయింపుగా.

"అతను చేసిన ఇన్సల్ట్ 'ఈవ్‌టీజింగ్' కిందకు రాదు డాడీ'' అంది ప్రహేళిక.

"అదేంటి బేబీ?" కాస్త ఆశ్చర్యంగా చూశాడు భానుప్రకాష్.

"అవును డాడీ! ఈవ్‌టీజింగ్ కిందకు రావడానికి అతను తనంతటతానుగా నా వెంటపడి నన్నేం ఏడిపించలేదు. నేనే పనిగట్టుకుని అతని రూమ్‌కెళ్ళి అతనితో ఇన్‌సల్ట్ చేయబడ్డాను''

"వాట్?" భానుప్రకాష్ మరికాస్త ఆశ్చర్యపోయాడు. "నువ్వే అతని రూమ్‌కెళ్ళావా? అసలేం జరిగిందో వివరంగా చెప్పమ్మా'' అన్నాడు ఆందోళనలోనే ఆసక్తి కూడా మిళితమైన స్వరంతో.

"చెప్తా డాడీ! ముందీ పాంప్లెట్ చూడు'' అంటూ తన వ్యానిటీ బ్యాగ్‌లోంచి ఓ కరపత్రాన్ని బైటకు తీసి తండ్రికందించింది ప్రహేళిక.

"ఎవడమ్మా ఈ వెర్రివెంగళప్ప?" అన్నాడు భానుప్రకాష్ అందులోని విషయం చదవడమయ్యాక.

"ఏమో డాడీ! అడ్రసే తప్ప నాక్కూడా వివరాలు తెలియవు'' అంది ప్రహేళిక పెదవి విరుస్తూ.

"అసలీ తిక్కసన్నాసి రూమ్‌కి నువ్వెందు కెళ్ళాల్సి వచ్చింది?" కూతురి కేసి అదోలా చూస్తూ అడిగాడు భానుప్రకాష్.

'నీకసలు బుద్ధుందా?' అన్నట్టుగా.

"పెక్యూలియర్‌గా వుండే మనుషులన్నా, పెక్యూలియర్‌గా ఉండటం అన్నా చిన్నప్పటి నుంచీ నాకెంతిష్టమో నీకు తెలుసుగా డాడీ! ఇంత విచిత్రమైన పాంప్లెట్‌ని ప్రింట్ చేయించిన మనిషి ఖచ్చితంగా విచిత్రమైన వ్యక్తే అయ్యుంటాడనిపించి, సరే ఓసారి చూద్దాం నచ్చితే అప్పుడు మిగతా విషయాలాలోచించుకోవచ్చని వెళ్ళాను. కానీ నన్ను చూస్తూనే 'సారీ అండీ' అనేశాడు.

"దేనికి?"

"ఆ కోన్‌కిస్కాగాడు అంతకుముందే ఇంకో అమ్మాయికి మాటిచ్చేశాడుట. అంటే ఎప్పట్నుంచో వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటున్నారని కాదు. జస్ట్ నేను ఎంటరవ్వడానికి ముందే అతనామెకు మాటిచ్చాడట. అపుడా అమ్మాయికూడా అక్కడే ఉంది..." అంటూ ప్రారంభించి విషయమంతా డీటెయిల్డ్‌గా చెప్పుకొచ్చింది ప్రహేళిక.

"నిజంగానా బేబీ'' అన్నాడు భానుప్రకాష్



ఆశ్చర్యంగా.

ఎంత విచిత్రమైన వ్యక్తి కాకపోతే ఇచ్చిన మాట కోసం తనలాంటి కోటీశ్వరుడి కూతుర్ని రిజెక్ట్ చేస్తాడు?

కో అంటే కోటిమంది ' ఉరుక్కుంటూ మరీ ముందుకొస్తారు తన కూతుర్ని చేస్కోవడానికి.

అలాంటిదాకుర్రాడు అంత సిల్లీ కారణానికి అంత సింపుల్గా 'నో' అనేశాడూ అంటే... నిజంగా అతనెంత విచిత్రమైన వ్యక్తి?

ఆయనలా అనుకుంటూ ఉండగా "నిజమే డాడీ కోటి రూపాయలిచ్చినా సరే నేను మనసు మార్చుకునేది లేదంటూ అతను నన్ను చాలా ఘోరంగా ఇన్సల్ట్ చేశాడు. అతనే కాదు. ఆ అమ్మాయి కూడా ఆ మాటే అంది. అందుకే వాళ్ళిద్దరిమీద ఒళ్ళు భగభగా మండిపోతూ వుంది నాకు'' అంది ప్రహేళిక పటపటా పళ్ళు నూర్తూ.

"అంటే ఇద్దరికిద్దరూ పిచ్చివాళ్ళే అన్నమాట!" స్వగతంలా అన్నా పైకే అన్నాడు భానుప్రకాష్.

"పిచ్చికాదు డాడీ అది పొగరు. ఆఫ్టరాల్ సామాన్యమైన మనుషులు. వాళ్ళకే అంత మిడిసిపాటుంటే నాకెంతుండాలి?" అంది ప్రహేళిక పళ్ళు నూరడం ఇంకా కంటిన్యూ చేస్తూనే.

"అది సరే బేబీ! వాళ్ళకి పొగరా పిచ్చా అన్నది వేరే విషయం. ముందు నీ సంగతి చెప్పు. వాడేదో మూర్ఖత్వం కొద్దీ అలాంటి పాంప్లెట్స్ వెయ్యించాడే అనుకో. నీ తెలివేమయ్యింది?! మన స్టేటసేంటో మర్చిపోయి నువ్వా బోడిగాడి రూమ్కెళ్ళడం ఏమైనా బాగుందా? ఒకవేళ వాడొప్పుకున్నా నువ్వా గతిలేని వెధవని పెళ్ళి చేసుకోవడానికి నేనొప్పుకుంటానని నువ్వెలా అనుకున్నావు?" కాస్త కోపంగా అన్నాడు భానుప్రకాష్.

"ఏమో డాడీ. నేనంత దూరం ఆలోచించలేదు. అతనొక విచిత్రమైన వ్యక్తి అనిపించడంవల్ల తొందరపడి అలా వెళ్ళాను. అక్కడ నాకిలాంటి అవమానం జరుగుతుందని నాకేం తెలుసూ?" అంది ప్రహేళిక.

"ఇందులో అవమానం ఏముంది బేబీ? వాళ్ళిద్దరూ డబ్బు విలువ తెలియని పిచ్చిసన్నాసులు కాబట్టి అలా ఏదేదో వాగుంటారు. పోనియ్..." తేలిగ్గా అనేశాడు భానుప్రకాష్.

"నో డాడీ! నేను దీన్నంత తేలిగ్గా వదిలిపెట్టదల్చుకోలేదు. నా అందాన్నీ, ఐశ్వర్యాన్నీ అంత తేలిగ్గా తీసిపారేసిన అతన్ని నేను అంత తేలిగ్గా క్షమించలేను''

కూతురి దవడ కండరం మళ్ళీ బిగుసుకోవడం చూసి ఆమెలో రగులుతున్న పగని అర్థం చేసుకోగలిగాడు భానుప్రకాష్.

"అతనిమీద నీకంత కోపంగా ఉంటే అతన్నిక్కడికే రప్పించి అతనిచేత నీకు క్షమాపణ చెప్పిస్తానమ్మా! సరేనా?" అన్నాడు కూతుర్ని శాంతింపచేయచూస్తూ.

"ఒకవేళ అతను రాకపోతే?"

"ఆ సంగతి నాకొదిలేయమ్మా. అతన్ని రప్పించే బాధ్యత నాది. గోటితో పోయేదానికి గొడ్డలెందుకు చెప్పు? అతన్ని రౌడీల చేత తన్నించినంత మాత్రాన నీ కోరిగేదేంటి చెప్పు?"

తండ్రి అలా హామీ ఇచ్చేసరికి ప్రహేళిక ఒకింత శాంతించగలిగింది.

"సరే డాడీ! నువ్వు అన్నట్టు అతని చేత నాకు అపాలజీ చెప్పించగలిగితే సరే. లేదంటే మాత్రం నాదైన మార్గంలో నేను ప్రొసీడైపోతాను. ఆc" అంది బెదిరిస్తున్న ధోరణిలో.

"అంతదాకా రానివ్వనమ్మా! నా మాట నమ్ము'' అన్నాడు భానుప్రకాష్.

'చూద్దాంగా' అన్నట్టు తలెగరేసి ఊరుకుంది ప్రహేళిక.

దరిమిలా అక్కణ్ణుంచి ఆమె తన గదిలోకి వెళ్ళిపోగా 'తల్లిలేని పిల్ల' అని చిన్నప్ప





ట్నుంచీ అల్లారుముద్దుగా పెంచినందుకు ఇలా రణపెంకిగా తయారయ్యింది. ఎప్పుడేం చేస్తుందో తనకే తెలియదు ప్చ్... అనుకున్నాడు భానుప్రకాష్.

కూతురి విచిత్రమైన నైజాన్ని సంఘటనల వారీగా జ్ఞప్తికి తెచ్చుకుంటూ చాలాసేపు ఆయనక్కడే అలాగే కూర్చుండిపోయాడు.

చిన్నప్పటినుంచీ ప్రహేళికది అదోరకమైన మనస్తత్వం.

ఏమాత్రం విచిత్రంగా కనిపించినా చాలు. ఆ వస్తువుగానీ, బొమ్మగానీ తనకే చెందాలని కోరుకుంటూ ఉండేది.

అలాగే తను ధరించే దుస్తులుగానీ, తన వేషాలంకరణగానీ, తను వేసుకునే చెప్పులుగానీ, అందరికన్నా భిన్నంగా అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించేవిగా ఉండాలని కోరుకునేది.

అందుకే ఆ అమ్మాయి కోసం దేశవిదేశాల నుంచి చిత్రవిచిత్రమైన వస్తువుల్నీ, దుస్తుల్నీ ప్రత్యేకంగా తెప్పిస్తూ ఉండేవాడు భానుప్రకాష్.

వాటన్నిటినీ ప్రదర్శనకు గనక పెడితే ఖచ్చితంగా అది ఒక మ్యూజియమ్ అవుతుంది.

విచిత్రంగా ఉండే వాటిమీద ఆమెకున్న వ్యామోహం ఆమెనిపుడిలా సూరిబాబు దగ్గరికి నడిపించడం, అతనామెనలా తిరస్కరించటం, అది ఆమెలో కసిగా రూపాంతరం చెందటం అంతా విచిత్రంగానే అనిపించింది భానుప్రకాష్‌కి.

అతన్నెలాగైనా రప్పించి అతనితో కూతురికి క్షమాపణ చెప్పించాలి.

అప్పుడుగానీ ఈ గొడవ చల్లారదు.

లేకపోతే కూతురిలోని కసి మరింతగా పెరిగిపోతుంది.

అదేగనక జరిగితే పరిణామాలు చాలా తీవ్రంగా ఉంటాయ్

అసలే గారాబంగా పెరిగినపిల్ల. పైగా మొండిఘటం. ఒకపట్టాన విడిచిపెట్టదు దేన్నీ.

ఇందాక బెదిరించినట్లు నిజంగానే ఆ సూరిబాబుని తన్నించడమో మరోహటో చేస్తే...

తన్నులు తిన్నవాడు ఊరికే వుండడు గదా? తిన్నగా వెళ్ళి పోలీస్ రిపోర్టిస్తాడు. పోలీసులు కూపీ లాగితే విషయం బయటపడకుండా ఉంటుందా?

బిజినెస్ మాగ్నెట్ భానుప్రకాష్ కూతురిలా చేసిందని బయటకు పొక్కితే అది ఎంత నామర్దాగా ఉంటుంది?

నామర్దా మాట దేవుడెరుగు. ఏ కారణంవల్లైనా కేసు బిగిసిపోయి ప్రహేళిక శిక్ష అనుభవించాల్సి వస్తే?!

అయ్యబాబోయ్! ఇంకేమైనా ఉందా?

ఏ విషయాన్నైనా మల్టిపుల్ ఏంగిల్స్‌లో ఆలోచించే మనస్తత్వం వున్న భానుప్రకాష్ అలా పరిపరివిధాల ఆలోచించిన మీదట "సుధీర్!" అంటూ తన పర్సనల్ సెక్రటరీని కేకేశాడు.

"ఏంటి సార్?" అంటూ వచ్చి చేతులు గట్టుకు నిలబడ్డాడు సుధీర్.

"నువ్ అర్జంట్‌గా వెళ్ళి ఈ వ్యక్తినొకసారి కలుసుకోవాలి" అంటూ తన చేతిలో ఉన్న పాంప్లెట్‌ని అతనికందించాడు భానుప్రకాష్.

అంతకుముందు ప్రహేళిక ఇచ్చిపోయిన పాంప్లెట్ అది.

సుధీర్ విషయం చదివి "ఎందుకు సార్?" అన్నాడు కుతూహలంతో పాటు ఆశ్చర్యంకూడా ధ్వనించింది అతని కంఠంలో.

విషయం పూర్తిగా చెప్పి అతని దృష్టిలో తన కూతుర్ని చులకన చేయడం ఇష్టంలేక "వివరాలు తర్వాత. ముందు నువ్ అతన్ని అర్జంట్‌గా మీటవ్వాలి" అన్నాడు భానుప్రకాష్.

"మీకొ్ట్షై?"

"నేనతన్ని అర్జంట్‌గా చూడాలనుకుంటు న్నానని చెప్పి అతన్ని ఉన్నపళంగా నా దగ్గరకి తీసుకురావాలి''

"సరే సార్' అంటూ తల తాటించాడు సుధీర్. "ఇప్పుడు వెళ్ళమంటారా?" అడిగాడు.

"ఆఁ..."

"మన ఇంటికే తీసుకురమ్మంటారా?"

"వద్దు. నేను జూబ్లీహిల్స్‌లోని మన గెస్ట్‌హౌస్‌లో ఉంటాను. అక్కడికి తీసుకురా'' అన్నాడు భానుప్రకాష్.

ఆయనకు సిటీలో మూడు గెస్ట్ హౌస్‌లున్నాయి.

"సరే సార్' అంటూ మరోమారు తలతాటించి అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు సుధీర్.

అతని వయసు నలభైరెండు సంవత్సరాలు. ఎంతోకాలంగా భానుప్రకాష్ వద్ద ఎంతో విశ్వాసపాత్రంగా పనిచేస్తున్నవ్యక్తి. ఎంత కఠినమైన పని అప్పగించినా యజమాని మాటను తు.చ. తప్పకుండా పాటించే మనిషి.



అతను వెళ్ళిపోయాక కూడా ఇంకా ఆ విషయం గురించే ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు భానుప్రకాష్.

తన కూతుర్ని వద్దు పొమ్మన్న వ్యక్తి,

సిరిరా మోకాలొడ్డిన ఆ వింత మానవుడు.

ఎలా ఉంటాడో అర్జంట్‌గా చూసేయాలని ఆయనక్కూడా అనిపించింది.

★ ★ ★

కంచాల్లో అన్నం వడ్డించుకుంటున్న మిత్రులిద్దరూ కాలింగ్‌బెల్ మోతకి ఉలిక్కిపడ్డారు.

సమయం పావుతక్కువ తొమ్మిది.

'ఎవరయ్యుంటారబ్బా?' అనుకున్నాడు కనకలింగం.

'మరో కొత్త క్యాండిడేటేమో!?' అనుకున్నాడు సూరిబాబు.

"ఎవరో చూసి రారా'' అన్నాడు మిత్రుడితో.

"ఇంత రాత్రప్పుడు ఎవరయ్యుంటారంటావు?" అన్నాడు కనకలింగం కూర్చున్న చోటునుంచి లేవకుండానే.

"ఎవరో లేట్‌కమర్ అయ్యుంటుంది. వెళ్ళి తలుపు తియ్'' అన్నాడు సూరిబాబు ముసిముసిగా నవ్వేసుకుంటూ.

"అంటే?"

"లేట్‌గా వచ్చిన క్యాండిడేటని. నా హృదయం ఆల్రెడీ ఫిలప్ అయిపోయిన సంగతి తెలియక ఇంకెవరో కొత్తమ్మాయి వచ్చుంటుంది. వెళ్ళి చూసిరా''

"నీ బొంద. అమ్మాయైతే ఇంత రాత్రప్పుడెందుకొస్తుంది?"

"ఎంతరాత్రి? తొమ్మిది కూడా కాలేదింకా. నా అంచనా ఎప్పుడూ తప్పవ్వదు. అమ్మాయే అయ్యుంటుంది. వెళ్ళి తలుపు తియ్'' అన్నాడు సూరిబాబు.

"నా మనసెందుకో కీడును శంకిస్తోందిరా'' అన్నాడు కనకలింగం లేచే ప్రయత్నమేదీ చెయ్యకుండా.

"కీడా?" 'వాడ్డూ యూ మీన్' అన్నట్టుగా చూశాడు సూరిబాబు.

"నువ్వా ప్రహేళిక సంగతి చెప్పినప్పట్నుంచీ నా మనసు మనసులో లేదురా! నాకెందుకో ఆమె నిన్ను తప్పకుండా రౌడీల చేత తన్నిస్తుందనే అనిపిస్తోంది. బహుశా వచ్చింది ఆ రౌడీలే అయ్యుంటారు'' అన్నాడు కనకలింగం.

"ఛీ! వెంటనే మనం అర్జంట్‌గా కేబుల్ కనెక్షన్ పీకేయించాలి'' అన్నాడు సూరిబాబు.

పొంతనలేని అతని మాటలకి వింతగా చూశాడు కనకలింగం అతనికేసి.

"అదేంటి?" అన్నాడు అయోమయంగా.

"లేకపోతే ఏంటి? ఆ కేబుల్ కనెక్షన్ ఉండటంవల్లే గదా రోజుకి రెండో మూడో తెలుగు సినిమాలు చూడగలుగుతున్నాం. అందువల్లే కదా నీకిలాంటి చండాలపు అనుమానాలన్నీ వస్తున్నాయ్? రౌడీలూ కాదు, నీ బొందా కాదు. ఎవరో అందమైన ఆడపిల్లే అయ్యుంటుంది. వెళ్లి తలుపు తియ్'' ఒకపక్క చిరాకు పడుతూనే వివరణ ఇచ్చాడు సూరిబాబు.

దానికి కనకలింగం ఏదో అనబోయాడు.

కానీ ఈలోగా 'ట్రింగ్గ్...' అంటూ మరోసారి మోగింది కాలింగ్‌బెల్.

"ఐ డోంట్ థింక్ సో. వచ్చింది రౌడీలే అయ్యుంటారు. కాబట్టి నువ్వే వెళ్ళి తలుపు తియ్. కావాలంటే నీ వెనక నేనూ వస్తాను'' అన్నాడు కనకలింగం కాస్త భయంగా.

'ఓరి పిరికి దద్దమ్మా' అని మనసులో అనుకుని "సరే నేనే తీస్తాలే' అంటూ లేచి వెళ్ళి తలుపు తీశాడు సూరిబాబు.

అతననుకున్నట్టు వచ్చింది ఇంకో అతివ కాదు.

కనకలింగం అన్నట్టు రౌడీలే.





ఒకరు కాదు ఇద్దరుకాదు. అరడజను మంది పైగా ఉన్నారు.

వాళ్ళచేతుల్లో కత్తులూ, కటార్లూ లాంటివి ఏమీ లేకపోయినా, మిత్రుడంతకుముందే పదేపదే హెచ్చరించి వున్నందున వాళ్లని చూస్తూనే గజగజా వణికిపోయాడు సూరిబాబు.

"అరె గట్లా వణుకుతున్నారేంటి సార్?" అన్నాడు ఆ రౌడీల్లో ఒకడు తెలంగాణా యాసలో.

అతని చేతిలో కత్తైతే లేదుగానీ, ఏదో పుస్తకమూ పెన్నూ ఉన్నాయి.

"పేరు చెప్పుని సార్" అన్నాడు వాడు ఆ పుస్తకాన్ని తెరుస్తూ.

కంచంముందు నుంచి కదలకుండానే ఇదంతా గమనించిన కనకలింగం ఎందుకయినా మంచిదని చటుక్కున అక్కణ్ణుంచి లేచిపోయి ఒక్క పరుగున లావెట్రీలోకి దూరిపోయి లోపల్నుంచి బోల్టు బిగించేసుకున్నాడు.

సూరిబాబు తన మిత్రుడే కావచ్చు.

అయినంత మాత్రాన అతగాడు చేసిన నిర్వాకానికి ఉత్తపుణ్యానికి తనుకూడా తన్నులు తినడం దేనికన్న సదుద్దేశ్యంతోనే అతనిలా లావెట్రీలో దూరిపోయాడు.

ఎవరుచేసిన కర్మ వారే అనుభవించడం ధర్మం కదా?

రౌడీల్లో ఒకడు అలా తన పేరడిగేసరికి "దె...దె... దేనికీ?" అన్నాడు సూరిబాబు మరింతగా వణికిపోతూ.

"గిట్లంటరేంటి సార్! పండగ సెయ్యనికి" అన్నాడు ఆ రౌడీయే మళ్ళీ.

'అందరి తరపునా వీడొక్కడే మాట్లాడుతున్నాడూ అంటే వీడు వీళ్ళందరికీ నాయకుడన్నమాట' అనుకున్నాడు సూరిబాబు.

"పండగ సెయ్యనీకి అంటున్నాడూ అంటే దంచడానికన్నమాట!తన పేరు సూరిబాబు అని కన్‌ఫర్మ్ అయిపోగానే వీళ్ళం దరూ తనమీద పడి దంచుతారన్నమాట.

కత్తులూ, కటార్లూ లేకపోతేనేం? ఒక్కోడూ ఒక్కో పిడిగుద్దు గుద్దితే చాలదా? తన చాప్టర్ క్లోజ్ అయిపోవడానికి?" ఆ ఆలోచన అతని లోని వణుకుని ద్విగుణీకృతం చేసేసింది.

అది చూసి "సార్ చాలా వణికిపోతుంద్రా! ఎక్కుఒద్దులే. యాభై చాల్లే" అన్నాడింకో రౌడీ.

బహుశా వీడు ఉపనాయకుడేమో ననుకున్న సూరిబాబు, "అబ్బే యాభైకూడా వద్దండీ, నేను తట్టుకోలేను" అన్నాడు భయంభయంగా. 'యాభై పిడిగుద్దులంటే అది మాత్రం సామాన్యమా?' అనుకున్నాడు మనసులో భయంగా.

"అదేం కుదర్దు సార్! యాభై ఇచ్చి తీరాల్సిందే" అన్నాడు ఉపనాయకరౌడీగాడు

అంటే దానర్థం?

'యాభై పిడిగుద్దులు గుద్దే తీర్తాం అనేకదా?' అనుకున్న సూరిబాబు "ప్లీజ్ సార్... యాభై అయితే నేను చచ్చూరుకుంటాను" అన్నాడు దీనంగా.

"గట్ల మాట్లాడతారేంటి సార్? యాభై అంటే ఏపాటి? పోనీ మీరే చెప్పుని ఎంత రాయమంటారో" అన్నాడు నాయకరౌడీ.

"అయినా ఏడాది కోపాలే కస్సార్ మేమొచ్చేది? మీ పక్కింటోళ్ళు కూడా యాభయ్యే రాసిన్రు. కాబట్టి మీరూ యాభయ్ రాయాల్సిందే! అదీ కాక ఈ ఏడాది శానా పెద్ద వినాయకుణ్ణి పెడతన్నాం. సార్ నడిగేదేంటి నువ్ రాసెయ్యరా" అన్నాడు ఉపనాయక రౌడీ.

వాళ్ళిద్దరూ అలా అన్నాక అప్పుడర్థమైంది సూరిబాబుకి వాళ్ళు తనని తన్నడానికొచ్చిన రౌడీలు కారనీ రానున్న వినాయక చవితి సందర్భంగా చందా వసూలు చెయ్యడానికొచ్చిన కుర్రగ్యాంగనీ.

దాంతో సహజంగానే అతనిలోని ఆందోళనంతా తొలగిపోయి గుండె కుదుటపడిపో

యింది.

"యాభై అంటే కష్టం. ఓ పాతిక రా స్కోండి'' అన్నాడు బేరమాడుతూ.

"ఛ...ఛ పాతికేంటి సార్ అసయ్యంగా? పందిరి మీద కప్పడానికి ఒక ఆక్కూడా రాదు. నలభై రాస్తాం" అన్నాడు నాయక చందా వసూలుగాడు.

వాళ్ళు రౌడీలు కాదని తేలిపోయినందున గుండె ఎంతో తేలికపడిపోయి ఉన్నాడేమో "సరే మీ ఇష్టం" అనేశాడు సూరిబాబు లిబరల్‌గా.

వాళ్ళు చందా వసూలు చేసుకుని రశీదిచ్చి పోయాక సూరిబాబు 'హమ్మయ్య' అనుకుంటూ వెనుదిరిగి చూసేసరికి కనకలింగం లేడక్కడ.

"ఏమైపోయాడబ్బా వీడు?" అనుకుంటూ "రేయ్ కనకం" అంటూ గట్టిగా అరిచాడు.

లావెట్రీలో ఉన్న కనకలింగానికి ఆ అరుపు వినిపించింది గానీ, అతను బదులివ్వలేదు రౌడీలు తంతుంటే హెల్ప్‌కోసం మిత్రుడలా అరిచాడేమోననుకుని.

"కనకం... రేయ్ కనకం..." అని సూరిబాబు మరోమారు అరిచాడు.

ఆ అరుపు తంతుంటే అరుస్తున్నట్టుగా కాకుండా మామూలు గానే ఉండటం గమనించి 'ఇదేంటి? రౌడీలు వీణ్ణి తన్నటం లేదా?' అనుకున్నాడు కనకలింగం ఆశ్చర్యంగా.

అంతలో సూరిబాబే లావెట్రీ దగ్గరకొచ్చి తలుపు తట్టాడు "రేయ్ కనకం" అంటూ.

"ఊc..." అన్నాడు కనకలింగం లోపల్నుంచి.

"ఇదేంటి సడన్‌గా ఇందులో దూరావ్?" అడిగాడు సూరిబాబు బయట్నుంచి.

"ఆరౌడీలను చూసి భయమేసి దాక్కున్నానా. అదేంటి వాళ్ళు నిన్ను తన్నకుండానే వెళ్ళిపోయారా?" అన్నాడు కనకలింగం లోపల్నుంచి ఆశ్చర్యంగా.

"నీ మొహం. వాళ్ళు రౌడీలు కాదు. వినాయక చవితిచందాకోసం వచ్చారు'' అంటూ విషయం వివరించాడు సూరిబాబు బయట్నుంచి.

అప్పుడు తెరుచుకున్నాయ్... లావెట్రీ తలుపులు.

"అయామ్ సారీరా! నేనైనా సేఫ్‌గా వుంటే వాళ్ళు నిన్ను తన్నిపోయాక హాస్పిటల్లో చేర్పించడానికి వీలుగా ఉంటుంది కదాని ఇలా దాక్కున్నా'' అన్నాడు కనకలింగం లోపల్నుంచి బయటికొస్తూ.

"సర్లే సర్లే' అనేశాడు సూరిబాబు.

ఆపత్కాలమందు మిత్రుడు తనని ఏకాకిని చేసి అలా లావెట్రీలో దూరిపోవడం అతనికి చాలా బాధ కలిగించినా పోనీలెమ్మని దాన్ని లోపలికి దిగమింగేసుకున్నాడు.

"అయినా ఇపుడొచ్చింది నిజంగా రౌడీలేం కాదుగా!" అని సరిపెట్టేసుకున్నాడు.

దరిమిలా వాళ్ళిద్దరూ మళ్ళీ భోజనానికి కూర్చున్నారు.

రెండు ముద్దలైనా నోట్లోకి వెళ్లాయో లేదో "ట్రింగ్..." అంటూ మళ్ళీ మోగింది కాలింగ్ బెల్లు.

అది విని...

"ఏం మళ్ళీ దూరిపోతావా లావెట్రీలోకి?" అన్నాడు సూరిబాబు కాస్త హేళనగా.

"సారీరా! ఈసారలాగేం చెయ్యను. కష్టమో, నష్టమో ఇద్దరం కలిసే పంచుకుందాం. ఇద్దరం కలిసేవెళ్ళి తలుపుతీద్దాం పద" అన్నాడు కనకలింగం ఒకింత బిడియంగా.

"అలా అన్నావ్ బాగుంది. సరే లే' అంటూ కంచంముందునుంచి లేచాడు సూరిబాబు.

మనసులో కాస్త భయంగానే అనిపించినా తప్పనిసరై తానూ కంచం ముందునుంచి లేచి ఎంగిలి చేత్తోనే అతన్ననుసరించాడు కనకలింగం.





"ఎక్స్‌క్యూజ్‌మీ! సూరిబాబుగారిల్లిదేనా?"

తీరా తలుపు తీశాక ఇంతకు ముందులా అక్కడ రౌడీలెవరూ లేకుండా నలభై-నలభై రెండేళ్ళ ఒకే ఒక్క వ్యక్తి మాత్రమే ఉండటంతో మిత్రులిద్దరి ప్రాణాలు కుదుటపడ్డాయి.

"అవునిదేనండీ! నేనే సూరిబాబుని మీరెవరూ?" అన్నాడు సూరిబాబు అతనికేసి కుతూహలంగా చూస్తూ.

"నాపేరు సుధీర్. నేను భానుప్రకాష్‌గారి పి.యస్.ని'' అన్నాడావ్యక్తి తనని తాను పరిచయం చేసుకుంటూ.

"భానుప్రకాష్ గారంటే బిజినెస్ మాగ్నెట్ భానుప్రకాష్‌గారేనా?" అడిగాడు సూరిబాబు.

"అవును'' అన్నాడు సుధీర్.

"అంటే ప్రహేళిక గారి ఫాదరేగా?"

"అవును''

"మీ రాకకు కారణం?" అడిగాడు సూరిబాబు. 'ఏమైఉండునో?' అని మనసులో అనుకుంటూ.

"భానుప్రకాష్ గారు అర్జంట్‌గా మిమ్మల్నొకసారి చూడాలనుకుంటున్నారు. ఉన్నపళంగా మిమ్మల్ని వెంటబెట్టుకురమ్మన్నారు'' అన్నాడు సుధీర్.

"దేనికి?" అని సూరిబాబింకా ఏదో అడగబోతుంటే, "వచ్చిన పెద్దమనిషిని గుమ్మంలోనే నిలబెట్టి మాట్లాడతావేంరా? ముందాయన్ని లోపలకి రానియ్'' అన్నాడు కనకలింగం ఎంగిలిచేతిని లుంగీకి తుడిచేసుకుంటూ.

"అవునవును. అయాం సారీ సార్! ముందు మీరు లోపలికిరండి'' అన్నాడు సూరిబాబు కాస్త పక్కకు తప్పుకుని సుధీర్‌కి దారి ఇస్తూ.

సుధీర్ మారు మాట్లాడకుండా లోపలికొచ్చి ఓ కుర్చీలో కూర్చున్నాడు.

ఓమారు ఆ గదినంతా కలియజూశాక అతనికి సీన్ అర్థమైంది.

"అరె... మీరు భోజనం చేస్తూ లేచొచ్చినట్టున్నారు. ముందు ఆ పని కానివ్వండి'' అన్నాడు కాస్త నొచ్చుకోలుగా.

"ఫర్వాలేదు లెండి. ముందు మీరొచ్చిన పనేంటో చెప్పండి?" అన్నాడు సూరిబాబు.

"చెప్పానుగా, భానుప్రకాష్‌గారు మిమ్మల్ని తీసుకు రమ్మన్నారు'' అన్నాడు సుధీర్.

"దేనికి?" ఈసారి కనకలింగం అడిగాడు.

"తెలియదండీ! విషయమేంటో సార్ నాతో చెప్పలేదు. సూరిబాబుగార్ని తీసుకురమ్మన్నారంతే'' అన్నాడు సుధీర్.

దాంతో సహజంగానే కనకలింగం మనసు కీడును శంకించింది.

"మీరు కాసేపలా కూర్చోండి సార్!" అంటూ సుధీర్‌తో చెప్పి, "రేయ్ మాట" అంటూ సూరిబాబుని చాటుకు పిలుచుకెళ్ళాడు.

అంటే బాత్‌రూంలోకి అన్నమాట.

"ఏంట్రా ఇక్కడికి తీస్కొచ్చావ్?" మిత్రుడెందుకలా పక్కకు పిల్చుకొచ్చాడో అర్థంకాక కాస్త అయోమయంగా అడిగాడు సూరిబాబు.

"ఆ భానుప్రకాష్‌గారు నిన్ను తీసుకురమ్మన్నది ఎందుకని అనుకుంటున్నావ్?"

"బహుశా కూతురి విషయం మాట్లాడ్డానికయ్యుంటుంది. పొద్దున్న జరిగినదాన్ని బట్టి ఆమె చాలా పట్టుదల గల అమ్మాయిలా అనిపించింది నాకు. వెళ్ళి తండ్రితో చెప్పుంటుంది ఇలాగిలా జరిగిందని. కూతురి ముచ్చటని కాదనలేక బహుశా నన్ను బతిమాలుకోవడానికి పిలుస్తున్నాడేమో'' అన్నాడు సూరిబాబు.

"నీ బొంద" కనకలింగం విసుగ్గా అన్నాడు. "ఆయనలాంటి వ్యక్తికి బతిమాలుకోవాల్సిన అవసరం ఏముంటుంది? నీ కరపత్రాన్ని చూసి తన కూతురు రెస్పాండైందని

తెలియగానే ఒళ్ళుమండిపోయుంటుంది ఆయనకి. ఇంకెప్పుడూ ఇలాంటి వెర్రిచేష్టలు చెయ్యద్దని నిన్ను తన్నించడానికే..." అంటూ ఆగిపోయాడు కనకలింగం.

"ఎందుకురా నన్నిలా భయపెట్టేస్తున్నావ్? నేనేదో నా ప్రేమార్తికొద్దీ అలా పాంప్లెట్స్ పంచానే తప్ప, ఆయనగారి కూతుర్ని నా దగ్గరకి రమ్మని నేనేం పనిగట్టుకుని పిలవలేదుగదా? అలాంటప్పుడు నన్ను తన్నించాల్సిన అవసరం ఆయనకేంటి?" అన్నాడు సూరిబాబు.

"జుట్టున్నమ్మ ఏ ముడైనా వెయ్యగలదు. డబ్బున్నవాళ్ళు ఏ పనైనా చెయ్యగలరు? నీలాంటి ఓ సాధారణ మానవుని పట్ల తన కూతురు ఎట్రాక్టైందని తెలిస్తే భానుప్రకాష్‌లాంటి ఏ బిజినెస్ మాగ్నెట్ అయినా తట్టుకోలడా?" అన్నాడు కనకలింగం.

"అంటే నీ ఉద్దేశ్యం?"

"ఏముందీ? నిన్ను బాగా తన్నించి సిటీ నుంచి వెళ్లిపొమ్మని నిన్ను బెదిరించడానికే ఆయన నిన్ను పిలిపిస్తున్నారని నా అనుమానం"

"నీ అనుమానం ఏడ్చినట్టే ఉంది. నేను వాళ్ళమ్మాయిని ప్రేమిస్తే కదా అలా బెదిరించడానికి? నేనామెని తిరస్కరించానాయె'' మిత్రుడి మాటల్ని తేలిగ్గా కొట్టేస్తూ అన్నాడు సూరిబాబు.

"అయితే నువ్విప్పుడు అతన్తో వెళ్ళడానికే నిశ్చయించుకున్నావా?"

"ఆఁ" అన్నాడు సూరిబాబు నిర్భయంగా.

"సరే నీ ఖర్మ'' అన్నాడు కనకలింగం. కానీ అంతలోనే అతని అంతరాత్మ అతన్ని హెచ్చరించింది. "నీ ప్రియమిత్రుణ్ణి అతని ఖర్మానికి అతన్ని వదిలేయడం ధర్మమా?" అని.

దాంతో "నా మాటిన్నా. నువ్ అతన్తో వెళ్ళొద్దు'' అన్నాడు మిత్రుడి చేతులెండూ పుచ్చుకుంటూ.

"అంత పెద్దమనిషి రమ్మని కబురంపితే వెళ్ళకుండా వుండటం బావుంటుందా?" అన్నాడు సూరిబాబు.

"ఎందుకు బావుండదు'' అంతగా అవసరమైతే ఆయన్నే మనరూమ్‌కి రమ్మని కబురుచేద్దాం. అక్కడ నిన్ను తుక్కుగా తన్ని ఎక్కడైనా పారేస్తే దిక్కెవరు?" అన్నాడు కనకలింగం పిరికిమందు నూరిపోస్తూ.

'ఇదేదో బాగానే ఉన్నట్టుందే' అనిపించింది సూరిబాబుకి.

"సరే అలాగే చేద్దాం" అన్నాడు మిత్రుడితో ఏకీభవిస్తూ.

దరిమిలా వాళ్ళిద్దరూ బాత్‌రూంలోంచి బయటపడి తిరిగి సుధీర్ వద్దకొచ్చారు.

"మీరు త్వరగా భోజనాలు ముగించండి సార్! మనం త్వరగా వెళ్ళాలి'' అన్నాడు సుధీర్ వాళ్ళని చూస్తూనే.

"ఆయన పిలిచిన వెంటనే మేం రావాలని రూలేముందండి? విషయమేంటో చెప్పకుండా మమ్మల్ని రమ్మంటే వెంటనే వచ్చేయడానికి మాకిక్కడ వేరే పనులేంలేవా? మాతో ఏదన్నా పనుంటే మీ భానుప్రకాష్ గార్నే ఇక్కడికి రమ్మనండి'' అన్నాడు కనకలింగం సూరిబాబు తరపున తానే మాట్లాడుతూ.

అతనంత తిరస్కారంగా మాట్లాడడం సహజంగానే సుధీర్‌కి చాలా బాధ కలిగించింది.

"ఏం సూరిబాబుగారూ మీదీ అదేమాటా?" అన్నాడు ముఖం చిన్నబుచ్చుకుంటూ.

"అంతేగా మరి? మాతో పనున్నప్పుడు ఆయనే మా దగ్గరికి రావాలిగానీ మేం అక్కడికి రావడం ఏంటి?" అన్నాడు సూరిబాబు.

అతనంత ఖచ్చితంగా అలా అనేసరికి సుధీర్ ఇంకేం మాట్లాడలేకపోయాడు.

"సరే. నాదేం పోయిందీ? ఆ మాటే చెప్తా ఆయన్తో'' అంటూ లేచి నిలబడ్డాడు.




సుధీర్ వెళ్ళిపోయాక మిత్రులిద్దరూ సగంలో ఆపేసిన భోజనాలు ముగించారు.

ఇద్దరూ చెరో మంచమూ ఎక్కాక,

"ఈ విషయంలో మాత్రం నువ్ చాలా జాగ్రత్తగా వుండాల్రా. నా మనసెందుకో పదే పదే కీడును శంకిస్తోంది. ఒక వేళ నేను లేనప్పుడు మళ్ళీ ఎవరైనా వచ్చి పిల్చినా కూడా నువ్ తొందరపడి వాళ్ళతో వెళ్ళ మాకు'' అన్నాడు కనకలింగం మిత్రుడికి హితవు చెబుతూ.

వీడివన్నీ అర్థంపర్థంలేని భయాలే అని మనసులో అనుకున్నప్పటికీ "సరేలేరా! అలాగే అలాగే' అనేశాడు సూరిబాబు పైకి.

ఆపైన మరి కాసేపటికే కనకలింగం నిద్రలోకి జారిపోయాడు. సూరిబాబు మాత్రం చాలా సేపు మెలుకువగా ఉండిపోయాడు.

రేపు సాయంత్రం తన ఫియాన్సీతో మాట్లాడాలి కదా? 'ఎలా మాట్లాడితే బావుంటుంది? ఏం మాట్లాడితే బావుంటుంది?' అని ఆలోచిస్తున్నాడు.

రేపు సాయంత్రం తను వెళ్ళేసరికి అప్పటికే కాటన్ దొర విగ్రహందగ్గర తనకోసం ఎదురుచూస్తూ ఉంటుంది సుజీవన.

వెళ్ళగానే ఏమని పలకరించాలి?

'సారీ డియర్ లేటయ్యింది' అంటే బావుంటుందా?

ఇంత త్వరగా 'డియర్' అని సంబోధించడం అంత బావుండకపోవచ్చు.

మరైతే ఏమని పలకరించాలి?

"అయామ్ ఎక్స్ట్రీమ్‌లీ సారీ! చాలా సేపట్నుంచి ఎదురుచూస్తున్నట్టున్నావ్..." అంటే బావుంటుందా?

బాగానే ఉండచ్చు.

కానీ అసలు తనకన్నా ముందు ఆమే వస్తుందన్న గ్యారంటీ ఏముంది.

ఒకవేళ తనే ముందెళ్ళి ఆమెకోసం ఎదురుచూడాల్సి వస్తే?

అప్పుడేమని పలకరించాలి?

"ఇంత లేటుగానా రావడం?" అని బుంగ మూతి పెడితే?

ప్రేమ ముదరకముందే బుంగమూతి పెడితే బాగుంటుందా? బాగుండకపోవచ్చు.

"నీకోసమే ఎదురుచూస్తున్నా సుజీ! ఇంతలేటయ్యిందేం?" అనడిగితే?

బాగానే ఉండచ్చు బహుశా.

కానీ అప్పుడే సుజీవనని కాస్తా 'సుజీ'గా కుదించేయడం అంత బావుండదేమో.

సరే... ఎలాగోలా పలకరింపుల పర్వం పూర్తవుతుందనుకుందాం.

ఆ తర్వాత... ఆ తర్వాత ఏం మాట్లాడాలి?

ఎలా ప్రేమించుకోవాలి?

ఇన్నాళ్ళూ ప్రేమార్తితో రగిలిపోయిన తనకి ప్రేయసితో ఎలా మాట్లాడాలో తెలీకపోవడం, దాన్ని గురించి ఇంతగా బుర్రబద్దలు కొట్టుకోవాల్సి రావడం, అసలు ఎలా ప్రేమించాలన్నది కూడా అర్థంకాకపోవడం చాలా విచిత్రంగా అనిపించింది సూరిబాబుకి.

చెరువులో దిగకుండానే ఈత రమ్మంటే ఎలా వస్తుంది?

ప్రేమ అనే సరోవరంలోకి దిగాక ప్రేమించడం అనే ఈత దానంతటదే వస్తుంది... నో ప్రాబ్లం.

అలా తనకితానే నచ్చజెప్పుకుని అర్థరాత్రి దాటాక ఎప్పటికో నిద్రలోకి జారుకున్నాడు సూరిబాబు.

★ ★ ★

అర్ధరాత్రి దాటినా నిద్రరాలేదు భానుప్రకాష్‌కి.

రాత్రి పదింటికి సుధీర్ వచ్చి విషయం చెప్పినప్పటినుంచీ ఆయన మనసు మండిపోతూనే ఉంది.

కాకితో కబురంపితే చాలు పెద్దపెద్ద ఎంపీలూ, మినిష్టర్లు సైతం తనముందు చేతులు

కట్టుకు నిలబడతారు.

అలాంటిది ఓ కోన్‌కిస్కాగాడు.

వాడెవడో ఓ తిక్కవరపు సూరిబాబుగాడు.

రమ్మనగానే రాకపోవడమేకాకుండా, అవసరమైతే ఆయన్నే రమ్మనమని ఎదురు కబురంపాడూ అంటే- వాడికి ఎంత పొగరనుకోవాలి?

దీన్నిబట్టే అర్థమవుతోంది ప్రహేళికతో వాడెంత దురుసుగా ప్రవర్తించి ఉంటాడో.

వాడి ముఖమైనా చూడకుండానే తనకే ఇంత కోపమొస్తోందే?

అలాంటిది నేరుగా వాడి కొంపకే వెళ్ళి తిరస్కారాన్ని చవిచూసిన ప్రహేళికకు ఇంకెంత ఆవేశం రావాలి?

అందుకే పాపం ప్రహేళిక అంత ఆగ్రహంగా మాట్లాడింది!

నిజమే...

ఏం చూసుకుని వాడికా మిడిసిపాటు?!!

ప్రహేళికంటే చిన్నపిల్లకాబట్టి ముందూ వెనుకా ఆలోచించకుండా వాణ్ణి రౌడీలచేత తన్నించాలనుకుంది.

కానీ అది సరైన పద్ధతికాదు. దండోపాయం- సామ, దాన, బేధ, దండోపాయాల్లో ఆఖరుది.

కాబట్టి తొందరపడకుండా నిదానంగానే నరుక్కురావాలి. కానీ మొత్తానికయితే వాడి పొగరు మాత్రం అణిచేతీరాలి.

అలా చాలాసేపు సూరిబాబు పొగరణచడం గురించే ఆలోచిస్తూ వుండిపోయాడు భానుప్రకాశ్.

అయితే ఆయన ప్రహేళికకుమల్లే విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయే మనిషి కాదు.

తనలాంటి పెద్దమనిషి రమ్మని కబురంపితే ఆఫ్టాల్ ఓ కుర్రకుంక రాను పొమ్మనడం, పైగా తననేరమ్మని అనడం ఆయన అహాన్ని బాగానే దెబ్బతీసింది.

ఆ పొగరుబోతు సంగతేంటో చూసే తీరాలని ఓ గట్టి నిర్ణయానికొచ్చేసి ఎర్రబడ్డ కళ్లతో ఆయన కూడా ఎప్పటికో నిద్రలోకి జారుకున్నాడు.



మర్నాడు పొద్దున్న ఎనిమిదింటికి భానుప్రకాశ్ సుధీర్‌ని పిలిచి "మనం వెంటనే ఆ సూరిబాబు దగ్గరికెళ్ళాలి. డ్రైవర్‌ని కారు రెడీ చెయ్యమని చెప్పు" అంటుంటే.

"అదేంటి డాడీ? ఆ బడుద్ధాయ్ ఇంటికి నువ్ వెళ్ళడం ఏంటీ?" అంది అప్పుడే అక్కడి కొచ్చిన ప్రహేళిక ఆశ్చర్యంగా.

"సుధీర్! నువ్వెళ్ళి డ్రైవర్‌ని రెడీ కమ్మను'' అంటూ అతన్ని బయటకు పంపించేసి, కూతురికి విషయం వివరించాడు భానుప్రకాశ్.

"వాట్? ఆ ప్రబుద్ధుడు నీ అంతటి మనిషిని తన రూమ్‌కి రమ్మన్నాడా? నిజంగా ఎంత విచిత్రమైన మనిషి?" అంది ప్రహేళిక మరింత ఆశ్చర్యంగా.

"అవును బేబీ చాలా హెడ్‌స్ట్రాంగ్ ఫెలో" అన్నాడు భానుప్రకాశ్ ఆమె మాటల్ని సమర్థిస్తున్నట్టుగా.

"వాడికి పొగరెక్కువ కాబట్టి అలా అంటే అనుండొచ్చు డాడీ! అంతమాత్రానికే నువ్




నిజంగానే వాడిరూంకి వెళ్ళడంఏంటి?" అంది ప్రహేళిక 'ఇదేం బాలేదు సుమా!' అన్నట్టుగా పెదవి విరుస్తూ.

"నా అంతటి వ్యక్తి కూతురివి నువ్వే వాడి రూమ్‌కి వెళ్ళగా లేనిది నేను వెళ్తే మాత్రం తప్పేంటి బేబీ? ఏ విషయాన్నైనా సామ, దాన, బేధ, దండోపాయాల్తో పరిష్కరించుకోవాలంటారు పెద్దలు. అందుకే ముందుగా సౌమ్యాన్ని ఎన్నుకున్నా''

తండ్రి చెప్పింది ఏమాత్రం సంతృప్తికరంగా అనిపించలేదు ప్రహేళికకు.

"గాడిదగుడ్డు సౌమ్యం. ఆ రాస్కెల్ రూమ్‌కి నువ్ వెళ్ళడానికి వీల్లేదంతే'' అంది అయిష్టంగా.

"ఆ తొందరపాటే పనికి రాదమ్మా దేనికైనా?" అన్నాడు భానుప్రకాశ్. నేను వాడి రూమ్‌కెళ్ళినంత మాత్రాన మన ఆస్తేం తరిగిపోదు. నీకెందుకూ, నువ్వలాగే చూస్తూండు. వాడెంత గీరగాడైనా సరే, వాడితో నీకు అపాలజీ చెప్పించే బాధ్యత నాది'' అన్నాడు నవ్వేస్తూ.

అంతలో "డ్రైవర్ రెడీగానే ఉన్నాడు సార్! మనదే ఆలస్యం" అంటూ సుధీర్ అక్కడికి రావడంతో అతని ముందు ప్రహేళిక ఇంకేమీ అనలేకపోయింది.

"ఓకే డాడీ నీ ఇష్టం" అనేసి ఊరుకుంది.

★ ★ ★

భానుప్రకాశ్ సూరిబాబు కళ్లలోకి సూటిగా చూశాడు.

"సూరిబాబంటే నువ్వేనా?" అనడిగాడు ఇంకా అలాగే చూస్తూ.

"నేనేనని ఇంతకు ముందే చెప్పేను కస్సార్?" అన్నాడు సూరిబాబు కాస్త ఆశ్చర్యంగా.

భానుప్రకాశ్ ఆ రూమ్‌లోకొచ్చి అప్పటికే ఓ మూడు నిముషాలయ్యింది.

"అయామ్ భానుప్రకాశ్. రాత్రి మా పి.యేని పంపిస్తే నన్నే రమ్మన్నారటగా. అందుకని నేనే స్వయంగా వచ్చాను'' అంటూ రాగానే భానుప్రకాశ్ తననితాను పరిచయం చేసుకోగానే సూరిబాబు, కనకలింగం ఆయనకు నమస్కరించి తమను కూడా పేర్లతోసహా పరిచయం చేసుకోవడం "అయితే నువ్వేనన్నమాట సూరిబాబంటే?" అంటూ ఆయనా? ఏమీ మాట్లాడకుండా ఆయన వెనుకే సుధీరూ లోపలికొచ్చి కూర్చోవడం కూడా ఎప్పుడో జరిగిపోయింది.

కూర్చున్నాక.

"ఏం తీసుకుంటారు సార్... కాఫీనా, టీనా?" అని కనకలింగం అడిగాడు.

ఆయన ఏమీ వద్దన్నట్టు చెయ్యాడించి, మళ్ళీ మొదటికొస్తూ "సూరిబాబు నువ్వేనా?" అని అడగటం సహజంగానే సూరిబాబుని అలా ఆశ్చర్యపోయేలా చేసింది.

ముఖ్యంగా ఆయన తన కళ్లలోకి అలా సూటిగా చూడటం అతన్ని చాలా కన్‌ఫ్యూజ్ చేసేసింది.

ఆయన తనవైపు ఇంకా ఎగాదిగానే చూస్తూ ఉండటం చాలా ఇబ్బందికరంగా అనిపించింది సూరిబాబుకి.

"అదేంటిసార్ అలా అంటున్నారు? నేనే సూరిబాబునంటున్నానుగా?"

"ఏం లేదయ్యా! నా అంతటి మనిషిని నీరూమ్‌కు రప్పించుకున్నావూ అంటే నువ్వేదో కొమ్ములు తిరిగిన మొనగాడివయ్యుంటావనుకున్నాను. కానీ మామూలుగానే ఉండేసరికి నాకా అనుమానం వచ్చిందంతే'' అన్నాడు భానుప్రకాశ్.

ఆయన కంఠంలోని వెటకారాన్ని గుర్తించి "స...స...సారీ సార్' అన్నాడు సూరిబాబు కన్‌ఫ్యూజైపోతూ.

"సారీ దేనికిలే! నువ్వన్నదీ కరెక్టే! అవసరంనాది కాబట్టి నేను నీదగ్గరికి రావడమే సబబు'' అన్నాడు భానుప్రకాశ్ సర్దుబాటు ధోరణిలోకి వచ్చేస్తూ.

కనకలింగం మాట్లాడకుండా ఓ కుర్చీలో

కూర్చునున్నాడన్నమాటేగానీ అతనికి గుండె పీచుపీచుమంటూనే ఉంది ఏం జరగబోతోందో ఏమోనని.

భానుప్రకాశ్‌లాంటి బడావ్యక్తి తమబోంట్ల రూమ్‌కి రావడం... అతనింకా నమ్మలేకపోతూ వున్నాడు.

ఇదేదో అశుభానికే దారితీయబోతోందని ఎందుకోగాని, అతనికి చాలా గట్టిగా అనిపించసాగింది.

అందుకే అతను పళ్ళు గిట్టకరుచుకుని ఓ విగ్రహంలా కూర్చుండిపోయాడు.

భానుప్రకాశ్ అలా అంటుంటే సూరిబాబుక్కూడా ఏం మాట్లాడాలో తోచలేదు.

అంతలో "సరే ఇంక అసలు విషయంలోకి వద్దామా?" అన్నాడు భానుప్రకాశ్ నిశ్శబ్దాన్ని భగ్నంచేస్తూ.

"చెప్పండి'' అన్నాడు సూరిబాబు కుర్చీలో ఇబ్బందిగా కదుల్తూ.

"సుధీర్! నువ్ కాసేపలా బైటికెళ్ళి కార్లో కూర్చో'' అంటూ అతన్ని బైటకు పంపించేసి.

"నిన్న మా ప్రహేళిక ఇక్కడికొచ్చిందటగా?" అంటూ అసలు విషయంలోకి దిగాడు భానుప్రకాశ్.

"అవునుసార్... వచ్చింది..." అన్నాడు సూరిబాబు. 'అయితే ఏంటి?' అన్నట్టుగా చూస్తూ.

"నువ్వామెని చాలా నొప్పించావటగా?"

"నేను తనని నొప్పించానా?? అబ్బే అలాంటిదేం లేస్సార్' అన్నాడు సూరిబాబు. తాను చేసింది పొరపాటు కాదన్న నమ్మకం అతనిలో ఇంకా ఉండబట్టి! అలా అంటున్నప్పుడు అతనేమాత్రం తడబడలేదు.

కానీ అతని జవాబు భానుప్రకాశ్‌కి మాత్రం కోపాన్ని తెప్పించింది.

"డోంట్ బ్లఫ్. మా ప్రహేళిక నాకంతా చెప్పింది. కోటి రూపాయిలిచ్చినా నీ బోడి హృదయాన్ని తనకివ్వనని చాలా గీరగా మాట్లాడేవటగా?" అన్నాడు సూరిబాబుకేసి తినేసేలా చూస్తూ.

తన హృదయాన్ని బోడి హృదయం అన్నందుకు గొంతు పిసికిన కోడిలా గిజగిజలాడిపోయాడు సూరిబాబు.

"నేనేం గీరగా మాట్లాడలేదు. అప్పటికే నా హృదయాన్ని ఇంకో అమ్మాయికిచ్చేశాను. కాబట్టి 'సారీ అండీ నా హృదయాన్ని మీకివ్వలేను' అని మర్యాదగానే చెప్పాను మీ అమ్మాయితో. తనే అపుడు గీరగా మాట్లాడింది. కావాలంటే నీ మొహాన్న ఎంత డబ్బైనా పడేస్తా, అతని హృదయాన్ని నాకిచ్చెయ్? అంటూ మీ అమ్మాయే నా ఫియాన్సీతో చాలా పొగరుగా మాట్లాడింది'' అన్నాడు కోపంగా.

"అయితే అయ్యుండొచ్చు. కానీ ఏం చూస్కుని నువ్విలా మిడిసిపడుతున్నావ్? కోటి రూపాయలిచ్చినా కొనలేనంత గొప్పదా నీ బోడి హృదయం?" వెటకారంగా అన్నాడు భానుప్రకాశ్.

పొరపాటు తన కూతురిదేనని అనిపించడంవల్ల ఆయన అంతకన్నా ఎక్కువగా మండిపడలేకపోయాడు.

ప్రేమార్తితో నిండిన తన పవిత్ర హృదయాన్ని ఆయన మళ్ళీ బోడి హృదయం అనడం... సూరిబాబు ఈసారి తట్టుకోలేకపోయాడు.

"ఏవన్నా అనండిగానీ నా హృదయాన్ని బోడి హృదయం అంటే మాత్రం ఊరుకోను'' అన్నాడు కోపాతికోపంగా.

"ఊరుకోక ఏం చేస్తావ్?" అంతకన్నా కోపంగా అన్నాడు భానుప్రకాశ్.

ఏదో కోపంతో అలా అనేశాడే తప్ప, అంత గొప్ప వ్యక్తిని తానేం చేయగలడు?

తల్చుకుంటే ఆయనే తననేమైనా చేయగలడు!

ఆ విషయం అప్పటికి స్ఫురించడంతో... "స...స... సారీ సార్! కోపంలో అలా





అనేశా! నా హృదయాన్ని బోడి హృదయం అంటే కోపం రాదా మరి?" అన్నాడు సూరిబాబు తగ్గిపోతూ.

'అలారా దారికి' అన్నట్టుగా తల పంకించి.

"ఏది ఏమైనప్పటికీ నీ మాటలవల్ల మా ప్రహేళిక చాలా హర్టైందబ్బాయ్!" అన్నాడు భానుప్రకాశ్.

"దానికి నేనేం చెయ్యగలను సార్? తనని నా దగ్గరికి రమ్మనమని నేనేమన్నా అడిగానా?" సూరిబాబు నా తప్పేం లేదన్నట్టుగా చూస్తూ అన్నాడు.

"అలా అంటే లాభం లేదబ్బాయ్! జరిగిన దానికి మా ప్రహేళిక అవమానభారంతో రగిలిపోతోంది. నువ్వొచ్చి క్షమాపణ చెబితే తప్ప తన మనసు కుదుటపడదు'' అన్నాడు భానుప్రకాశ్ కోటుమీద పడ్డ ధూళిని ఎడమ చేతి చిటికెనవేలితో దులుపుకుంటూ.

ఆ చర్యలో నువ్వూ ఈ ధూళిలాంటివాడివేసుమా. అన్న హెచ్చరిక!

దాన్ని గ్రహించిన సూరిబాబుకి లోలోన మండిపోయింది.

'ఈ డబ్బున్న వాళ్ళందరికీ ఇంత అహంకారం ఎందుకుంటుందో?' అనుకున్నాడు మనసులో.

"నేను మీ అమ్మాయికి క్షమాపణ చెప్పుకోవాలా? నెవ్వర్' అన్నాడు పైకి.

ఆఫ్టాల్ ఓ కోన్‌కిస్కాగాడు తన మాటల్ని అంత తేలిగ్గా తీసిపారేయడం భానుప్రకాశ్‌కి ఒళ్ళు మండిపోయేలా చేసింది.

అయినప్పటికీ ఎలాగో కోపాన్ని అణచుకున్నాడు.

"నువ్వలా అంటే కుదరదబ్బాయ్! నీతో క్షమాపణ చెప్పిస్తానని మా అమ్మాయికి ప్రామిస్ చేశాను. హామీ ఇచ్చాను. సో నువ్వొచ్చి క్షమాపణ చెప్పి తీరాలి'' అన్నాడు వీలయినంత సౌమ్యంగానే.

"బెదిరిస్తున్నారా?" సూరిబాబు అప్రయత్నంగా అనేశాడు.

"బెదిరింపే అనుకో బుజ్జగింపే అనుకో నువ్వెలా అనుకున్నా సరే. కానీ మొత్తానికయితే నువ్ మాత్రం క్షమాపణ చెప్పేతీరాలి''

భానుప్రకాశ్ అలా అంటుంటే 'పోరా బోడిగా' అనుకున్నాడు సూరిబాబు మనసులో.

'ఎంత డబ్బుంటే మాత్రం? మరీ ఇంత గీర పనికిరాదు. నేనేం తప్పుచేశానని ఈయనగారి కూతురికి క్షమాపణ చెప్పుకోవాలి?' అని కూడా అనుకున్నాడు మనసులో.

"అంటే మీరు నన్ను శాసిస్తున్నారన్న మాట. అంతేనా?" అన్నాడు పైకి.

భానుప్రకాశ్ అవుననిగానీ కాదనిగానీ అనలేకపోయాడు. ఆయనకు సూరిబాబు ధైర్యాన్ని చూస్తుంటే చాలా ఆశ్చర్యంగా అనిపించింది.

కోటీశ్వరుడైన తనముందు నిలబడ్డానికే గజగజలాడిపోతారు అనేకమంది.

అలాంటిది కుర్రకుంక నువ్వా నేనా అన్నట్టుగా ఎంత ధైర్యంగా మాట్లాడుతున్నాడు?!!

"ఏం సార్! మాట్లాడరేం?" అని సూరిబాబు మరోసారి రెట్టించిన మీదట ఆయన ఆశ్చర్యంలోంచి తేరుకున్నాడు.

"నువ్వెలాగైనా అనుకోవయ్యా. నాకేం అభ్యంతరం లేదు. కానీ నువ్ నాతో వచ్చి మా అమ్మాయికి క్షమాపణ చెప్పి తీరాలి'' అన్నాడు చిరాగ్గా.

"చెప్పకపోతే?"

"పర్యవసానం చాలా తీవ్రంగా ఉంటుంది'' పళ్ళు కొరుకుతూ అన్నాడు భానుప్రకాశ్.

"అంటే?" ఏ మాత్రం తొణక్కుండా ధైర్యంగా అడిగాడు సూరిబాబు.

"అది నీకిపుడు చెప్పను. చేసి చూపిస్తాను'' అన్నాడు భానుప్రకాశ్ మరింత కోపంగా.

అంతవరకూ మౌనంగా వున్న కనకలింగం పరిస్థితి వికటిస్తోందని గ్రహించి వాళ్ళ సంభాషణలో తల దూర్చాడు. "మీరలా ఆగ్రహించకండి సార్ మావాడికి నేనచ్చజెబుతాగా'' అంటూ.

"ఏంట్రా నువ్ నాకు నచ్చజెప్పేది? నేనేం తప్పు చేశానని వెళ్ళి వాళ్ళమ్మాయికి క్షమాపణ చెప్పాలి?" సూరిబాబు మిత్రుడి దిక్కు కోపంగా చూశాడు.

"తప్పో ఒప్పో అంత పెద్దమనిషి స్వయంగా మన దగ్గరికొచ్చి అడుగుతున్నప్పుడు వెళ్ళి సారీ అంటూ ఓ ముక్క చెప్పేసి వస్తే పోయేదేముందీ?" అన్నాడు కనకలింగం.

'వీడు కాస్త బుద్ధిమంతుడల్లే ఉన్నాడు' అనుకున్నాడు భానుప్రకాశ్.

"నేను చచ్చినా చెప్పను. చెయ్యని నేరానికి క్షమాపణ చెప్పమనడం చాలా అసమంజసంగా ఉంది. ఆయన పెద్ద మనిషే కావచ్చు. అంతమాత్రాన ఉత్తపుణ్యానికి నేవెళ్ళి ఆయన కూతురి కాళ్ళమీద పడాల్నా?" సూరిబాబు అడ్డంగా తలాడిస్తూ అన్నాడు.

"కాళ్ళమీద పడక్కర్లేదు. వచ్చి క్షమాపణ చెప్తే చాలు'' అన్నాడు భానుప్రకాశ్.

"క్షమాపణ... అసలు మీకామాటకర్థం తెలుసా?" అని సూరిబాబు ఇంకా ఏదో అనబోతుంటే కనకలింగం ఒక్కదుటున లేచొచ్చి అతని నోరు నొక్కేశాడు. "ఎందుకురా పెద్దవారితో అంత పొగరుగా మాట్లాడుతావ్?" అంటూ.

'అదీ అలా పెట్టు గడ్డి' అన్నట్టు భానుప్రకాశ్ కనకలింగంకేసి ప్రశంసాపూర్వకంగా చూశాడు.

ఈలోగా సూరిబాబు తన నోటిమీదున్న మిత్రుడి చేతిని విదిలించికొట్టాడు.

"ఎందుకురా అనవసరంగా నా నోరు మూస్తావు? నీకు చేతనయితే వెళ్ళి ఆయన నోరుముయ్యి. లేకపోతే ఏంటి? తప్పు చేసింది వాళ్ళమ్మాయి. మధ్యలో నేను క్షమాపణ చెప్పడం ఏంటి? నా హృదయాన్ని నాకిష్టమొచ్చిన వాళ్ళకిచ్చుకునే హక్కు నాకుంటుంది. దాన్ని కాదనడానికి ఆయనెవరు?" అన్నాడు రోషంగా.

"నీ దిక్కుమాలిన హృదయాన్ని నీకిష్టమొచ్చిన వాళ్ళకే ఇచ్చుకో నాయనా. నేనేం కాదనట్లేదు. నువ్విస్తానన్నా మా అమ్మాయి పుచ్చుకుంటానన్నా నేనేం దానికొప్పుకోన్లే. నాక్కావలసింది నీ హృదయం కాదు క్షమాపణ" అన్నాడు భానుప్రకాశ్.

"క్షమాపణ?" అంటూ చిన్నగా నవ్వాడు సూరిబాబు. ఎదుటివ్యక్తి అహంకారానికి ఒళ్ళు మండిపోగా ఆ మంటలోంచి పుట్టుకొచ్చిందా నవ్వు. "ఎన్ని కేజీలు కావాలి? కేజీకి ఎంతిస్తారు?"

అతని మాటల్లో చాలా తీవ్రమైన వెటకారం ఉన్నా భానుప్రకాశ్ దాన్నొట్టే పట్టించుకోలేదు.

బోలెడంత డబ్బున్న మనిషేమో, డబ్బు ప్రస్తావన ఎలాగూ వచ్చింది కాబట్టి సదరు క్షమాపణకి వెలకట్టడానికే సిద్ధపడి పోయాడు.

"పోనీ నువ్వన్నట్టే ఎంతో కొంత రేటు చెప్పవయ్యా! మా అమ్మాయి దగ్గరికొచ్చి 'నేను చేసింది పొరపాటే. నన్ను మన్నించండి' అనడానికి నీకెంత కావాలో చెప్పు?" అన్నాడు కోటు జేబులోంచి చెక్‌బుక్ బైటికి తీస్తూ.

"ఎంతడిగినా ఇస్తారా?" సూరిబాబు ముఖంలో ఏ భావమూ వ్యక్తం కాకుండా జాగ్రత్త పడుతూ అన్నాడు.

"నేనేం పిచ్చివాణ్ణి కాదు. నువ్వెంతడిగినా ఇవ్వడానికి. అత్యాశకు పోకుండా రీజనబుల్ అమౌంట్ ఏదైనా అడుగు. తప్పకుండా ఇస్తాను'' అన్నాడు భానుప్రకాశ్.

"నా హృదయాన్నే కోటిరూపాయలిచ్చినా ఇవ్వనన్నవాణ్ణి. అలాంటిది ఆత్మాభిమానాన్ని చంపుకుని మీ అమ్మాయికి ఉత్తపుణ్యాని




కి క్షమాపణ చెప్పాలీ అంటే అంతకన్నా ఎక్కువే అడుగుతానేమో! అయినా ఫర్వాలేదా?"

సూరిబాబు అలా అడుగుతుంటే భానుప్రకాశ్ మాత్రమే కాదు. కనకలింగం కూడా ఆశ్చర్యపోయాడు.

ఎందుకీ వెధవ ఇంత పెడసరంగా మాట్లాడుతున్నాడు?

అంత పెద్దమనిషితో ఇలా మాట్లాడ్డం ఏవన్నాబాగుందా?

చూడబోతే వీడేదో పెద్ద చిక్కులోనే పడేలా ఉన్నాడు.

మనసు నిండా ఆందోళన నిండిపోగా "రేయ్ రేయ్... ఏం మాటల్రా అవి?" అన్నాడు కనకలింగం వారింపుగా.

"తెలుగు మాటలే. లేకపోతే ఏంటి? డబ్బు తీసుకుని క్షమాపణ చెప్పాలా?" అన్నాడు సూరిబాబు మిత్రుడి వారింపునేమాత్రం ఖాతరు చెయ్యకుండా.

'వీడు చాలా మొండిఘటంలా ఉన్నాడే?' అనుకున్న భానుప్రకాశ్ "సరే లేవయ్యా, డబ్బు తీసుకోవద్దు. నా కూతురి తృప్తికోసం ఊరికే వచ్చి ఉత్తుత్తి క్షమాపణ చెప్పి వెళ్ళిపో" అన్నాడు.

"అదిమాత్రం ఎందుకు చెప్పాలి? నేను చెప్పనుగాక చెప్పను'' అన్నాడు సూరిబాబు మొండిగా.

బతిమాలుతున్నకొద్దీ ఎదుటివ్యక్తి చెట్టెక్కిపోతుంటే ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు?

భానుప్రకాశ్ "సరే వస్తా!" అంటూ విసురుగా లేచి నిలబడ్డాడు.

ఆయన ముఖం కందగడ్డకన్నా ఎర్రగా అయ్యింది.

"మంచిది వెళ్ళిరండి'' అన్నాడు సూరిబాబు కనీసం కుర్చీలోంచి లేచే ప్రయత్నమైనా చెయ్యకుండా.

అలా భానుప్రకాశ్ అక్కణ్ణుంచి అవమాన భారంతో వెళ్ళిపోతుంటే కనకలింగం చేష్టలుదక్కి నిలబడిపోయాడు.

ఆయన నిష్క్రమణానంతరంగానీ అతనికి నోరు పెగల్లేదు.

"ఏం పనే్జశావ్రా! నీ మాటలకాయన బాగా నొచ్చుకుని వెళ్ళారు. అసలే రావుగోపాలరావులాంటి ఫేసు. రేప్పొద్దున్న నిన్నేం చేయిస్తాడో ఏమో..."

కనకలింగం ఎంతో ఆందోళనగా అలా అంటుంటే "గాడిదగుడ్డులే' అంటూ నాలుక చప్పరించేశాడు సూరిబాబు.

'వినాశకాలే విపరీత బుద్ధి' అనుకున్నాడు కనకలింగం. అదే అన్నాడు పైక్కూడా.

"ఎందుకురా అనవసరంగా నువ్ గాభరాపడి నన్నూ గాభరాపెడతావ్. ఇదేవన్నా సినిమానా, ఇంతలోపే ఆయన నా పాలిట ఓ విలనైపోయి నన్ను రౌడీలతో చంపించేయడానికి?" అనేశాడే తప్ప, సూరిబాబు ఇంకేం వర్రీకాలేదు.

★ ★ ★

"వాడొక మూర్ఖుడు బేబీ! అలాంటి వాళ్ళను గురించి మనం పట్టించుకోకపోవడమే మంచిది''

తండ్రి అలా అంటుంటే తోకతొక్కిన తాచులా సర్రున లేచింది ప్రహేళిక. "అంటే ఏంటి డాడీ నువ్వనేది? ఈ అవమానాన్ని దిగమింగి ఊరుకోవాలా?"

"ఊరుకోక చేసేదేముందమ్మా? నువ్వన్నట్టు రౌడీలచేత చితగ్గొట్టించొచ్చు. కానీ దానివల్ల మనకొరిగేదేంటి?"

"ఒరిగినా ఒరక్కపోయినా అతన్ని మాత్రం నేను వదలదల్చుకోలేదు డాడీ!" అంది ప్రహేళిక పిడికిళ్ళు బిగిస్తూ.

"వదలక?"

"అతన్ని వలేసి పట్టుకుంటాను''

"అంటే?" అన్నాడు భానుప్రకాశ్ కాస్త గాభరాగా.

"అతను మర్యాదగా వచ్చి క్షమాపణ చెప్పుంటే నేనతన్ని వదిలేసేదాన్నే డాడీ! కానీ నిన్ను కూడా అంత ఘోరంగా ఇన్‌సల్ట్ చేశాక నేనతన్ని ఎలా క్షమించగలను? నాకిపుడు కావాల్సింది అతని క్షమాపణ కాదు. నన్ను కాదని ఆఫ్టరాల్ నా కాలిగోటికూడా సరిపోలని ఇంకో అమ్మాయిని అతనెలా ప్రేమిస్తాడో నేనూ చూస్తాను'' దవడ కండరం ఒకటి బిగుసుకోగా మరింత ఆవేశంగా అంది ప్రహేళిక.

"ఆ అమ్మాయే కాదమ్మా, అసలామాటకొస్తే వాడే నీ కాలిగోటికి సరిపోలడు. అలాంటి వాడితో మనకెందుకు చెప్పు? కయ్యానికైనా వియ్యానికైనా సమ ఉజ్జీఉండాలంటారు. ఆ వెధవ సంగతి ఇంక మర్చిపో' అన్నాడు భానుప్రకాశ్ బుజ్జగింపు ధోరణిలో.

"ఇంపాసిబుల్ డాడీ! మర్చిపోవడం కాదు. ఆ తిక్కవెధవని తననితానే మర్చిపోయేలా చేసి నా కాళ్ళచుట్టూ కుక్కలా తిప్పుకుంటాను. అలా చెయ్యలేకపోయిననాడు నా పేరు ప్రహేళికే కాదు''

కూతురలా ఛాలెంజ్ చేస్తుంటే ఇదెక్కడి లంపటంరా బాబూ అనిపించింది భానుప్రకాశ్‌కి.

ఆ టాపిక్‌నింకా పొడిగించి అసలే ఆవేశంలో ఉన్న ఆమెని మరింత రెచ్చగొట్టడం దేనికి లెమ్మని "సరే బేబీ వాడి సంగతి తర్వాత చూద్దాంలే' అనేసి ఏదో పనున్నవాడిలామల్లే అక్కడినుంచి వెళ్ళిపోయాడు భానుప్రకాశ్.

ఎంత పొగరు?

ఎంత అహంకారం?

ఎంత కండకావరం?

తండ్రి వెళ్ళిపోయాక్కూడా ప్రహేళిక ఇంకా సూరిబాబు గురించే ఆలోచిస్తూ ఉండిపోయింది.

నో...

అతన్ని విడిచిపెట్టడానికి వీల్లేదు.

ఏదో ఒకటి- ఏదో ఒకటి చేసేతీరాలి.

ఏదోకాదు- ఇంతకుముందు తానన్నట్టే అతన్ని తన కాళ్లచుట్టూ కుక్కలా తిప్పుకోవాలి.

కానీ ఎలా?

అతనిప్పటికే ఆ సుజీవనో బొజీవనో అదెవర్తికో మనసిచ్చేశానంటున్నాడే!

ఆ మనసుని దాని దగ్గర్నుంచి లాక్కోవడం ఎలా?

చూడబోతే అది అతనికన్నా మొండి రాస్కెల్‌లా ఉంది.

డబ్బుకి లొంగనని ఆల్రెడీ చెప్పేసింది కాబట్టి- ఆ బెదిరించేదేదో దాన్నే బెదిరిస్తే పోలా?

ఈ చివరి ఆలోచన దగ్గర ఆమె మనసు స్థిరపడిపోయింది.

★ ★ ★

భానుప్రకాశ్ ఇల్లు కనుక్కోవడం ఏమంత కష్టం కాలేదు కనకలింగానికి.

ఇంటినైతే కనుక్కోగలిగాడుగానీ 'బివేర్ ఆఫ్ డాగ్స్' అంటూ గేటుకు వేళ్లాడుతోన్న హెచ్చరిక అతన్ని గేటుదాటి లోనికి పోనివ్వలేదు.

విశాలమైన ఆ భవంతికేసి చూస్తూ గేటు దగ్గర నిలబడిపోయాడు.

అంతలో "ఎవరదీ?" అంటూ వచ్చాడు ఖాకీ డ్రెస్‌లో వున్న ఓ ముప్పై అయిదేళ్ల వ్యక్తి.

డ్రెస్సుని బట్టి అతన్ని వాచ్‌మెన్‌గా గుర్తించి "భానుప్రకాశ్‌గార్ని కలవాలి'' అన్నాడు కనకలింగం.

"సార్ ఇంట్లో లేరు'' అన్నాడు వాచ్‌మెన్.

"పోనీ వారి అమ్మాయి ప్రహేళికగారున్నారా?"

"ఉన్నారు. కానీ మీరెవరూ?" అన్నాడు వాచ్‌మాన్ అతనికేసి ఎగాదిగా చూస్తూ.

"నేను సూరిబాబు రూమ్మేట్‌ని. అర్జంట్‌గా మీ అమ్మాయిగార్ని కలుసుకోవాలి''

అన్నాడు కనకలింగం అంతకన్నా తననెలా పరిచయం చేసుకోవాలో తెలియక.

"అలా చెప్తే మా అమ్మాయిగారు మిమ్మల్ని గుర్తుపడతారా?"

"ఊఁ"

"సరే ఇక్కడే నిలబడండైతే. నేవెళ్లి అమ్మాయిగార్ని కనుక్కొనొస్తాను'' అంటూ వెళ్ళిపోయాడు వాచ్‌మాన్.

అత్యంత అధునాతనంగా అంతా మార్బుల్ స్టోన్‌తోనే నిర్మింపబడిన ఆ బిల్డింగ్ కేసి ఆశ్చర్యంగా చూస్తూ అక్కడే నిలబడిపోయాడు కనకలింగం.

'ఇంత అందమైన బిల్డింగ్‌లో ఇంటల్లుడిగా స్థిరనివాసం ఏర్పరచుకునే అవకాశాన్ని చేజార్చుకున్న సూరిబాబుగాడు నిజంగా ఎంత మూర్ఖుడు?' అనిపించింది అతనికా భవంతిని చూస్తుంటే.

ప్చ్... దేనికయినా అదృష్టముండాలి!

వచ్చిన అవకాశాన్ని కాలితో తన్నేసుకున్నాడు వెధవ!

భానుప్రకాశ్‌లాంటి కోటీశ్వరుడి తనయ ఏరికోరి వస్తే కాదు పొమ్మనడానికి అసలు వాడికి నోరెలా వచ్చిందో?

అతనలా ఆలోచిస్తూ ఉండగా- "అమ్మాయిగారు మిమ్మల్ని రమ్మంటున్నారు'' అంటూ మళ్లీ అక్కడికి వచ్చాడు వాచ్‌మెన్.

"కుక్కలు...?" అన్నాడు భయంగా కనకలింగం.

"అవి లోపల కట్టేసున్నాయిలెండి. రాత్రుళ్లే వాటిని విప్పేది. మిమ్మల్నేమీ చెయ్యవు. నాతో రండి'' అన్నాడు వాచ్‌మెన్.

దాంతో కనకలింగం ధైర్యం తెచ్చుకుని అతన్ని అనుసరిస్తూ వెళ్లాడు.

★ ★ ★

"ఊఁ చెప్పండి'' అంది ప్రహేళిక.

కనకలింగం ఇప్పుడు ఆమెకెదురుగా వాళ్ల హాల్లో సోఫాలో కూర్చుని ఉన్నాడు.

"పొద్దున్న మీ డాడీగారు మా రూంకొచ్చారండీ'' అన్నాడు కనకలింగం.

"తెలుసు'' అంది ప్రహేళిక కాస్త కటువుగా.

ఆమె అపురూప సౌందర్యానికి ఆశ్చర్యపోతూ "ఇంత అందంగా వున్న అమ్మాయి ఇంత కటువుగా మాట్లాడుతోందేంటి?" అనుకున్నాడు కనకలింగం.

"అద్సరే... ఇప్పుడు తమరెందుకు దయ చేసినట్టు?" ప్రహేళికే అంది మళ్లీ.

"పొద్దున్న మీ డాడీగారు మా రూమ్‌కొచ్చినప్పుడు నేనూ అక్కడే ఉన్నానండీ! మా వెధవకి స్పీడెక్కువ. మీ ఫాదర్‌తో వాడు కాస్త దురుసుగానే మాట్లాడాడు. అందుకే వాడి తరఫున మీ ఫాదర్ని క్షమాపణ వేడుకుందామని వచ్చాను'' చేతులు నలుపుకుంటూ అన్నాడు కనకలింగం.

"నన్నూ మా డాడీని అవమానించింది అతనైతే మీరు క్షమాపణ చెప్పడం వల్ల లాభమేంటి?" అంది ప్రహేళిక నుదురు చిట్లిస్తూ.

"లాభం మీక్కాదండీ! వాడికే! పొద్దున్న మీ ఫాదరు 'సరే చూస్తా నీ సంగతేంటో' అన్నట్టుగా మాట్లాడి వెళ్లారు. దాన్నిబట్టి మీ డాడీ వాణ్ణి రౌడీల చేత తన్నించిపారేస్తారేమోననిపించింది. అందుకే- అలా చెయ్యొద్దని బ్రతిమాలుకోవడానికి వచ్చాను! ఎంతైనా వాడు నా రూమ్మేట్ కదండీ..."

"అంతేనా లేక ఆ భయం అతనికే కలిగి మిమ్మల్నిలా కాళ్లబేరానికి పంపాడా?"

ఆమె మాటల్లోని ఎగతాళికి సహజంగానే కాస్త హర్టయ్యాడు కనకలింగం.

అయినా కలవారమ్మాయిమీద కోపగించుకోవడం అంత మంచిది కాదని తెలిసినవాడు కాబట్టి ఎలాగో తమాయించుకున్నాడు.

"అబ్బే వాడు పంపించలేదండీ! వాడి శ్రేయోభిలాషిగా నేనే ఇలా చొరవ తీసుకుని

వచ్చాను. అయినా నాకు తెలియకడుగుతానూ, వాడేదో ఆ దిక్కుమాలిన పాంప్లెట్ వేయిస్తే ఇంతందం, ఐశ్వర్యం వున్న, మీరు ఆ బోడిగాడి దగ్గరికి రావడం ఏంటండి?" అన్నాడు శాంతంగానే.

"నాకు మొదట్నుంచీ విచిత్రమైన వస్తువులన్నా, విచిత్రమైన మనుషులన్నా..." అంటూ ప్రారంభించి, తన విచిత్ర మనస్తత్వాన్ని కనకలింగానికి వివరించి ఏ కారణం వల్ల తను సూరిబాబునలా వెతుక్కుంటూ వచ్చిందో అతనికి ఎక్స్‌ప్లెయిన్ చేసి "అదండీ సంగతి'' అంటూ ముగించింది ప్రహేళిక.

"చూచాయగా మా సూరిగాడు కూడా ఈ విషయాన్నింతకు ముందే చెప్పాళ్లెండి. అయితే మీరు విచిత్రమైన వ్యక్తుల్ని బాగా లైక్ చేస్తారన్నమాట" అన్నాడు కనకలింగం నుదురుమీద గీరుకుంటూ.

"అవును. చెప్పాగా? నేనసలు మీ రూమ్ కొచ్చిందే అందుకని?" అంది ప్రహేళిక.

"ఆ ఆс... చెప్పారు చెప్పారు. కానీ నాదొక చిన్న సందేహం..." అన్నాడు కనకలింగం.

"ఏంటది?"

"మీరు విచిత్రమైన ప్రతివ్యక్తినీ లైక్ చేస్తారా?"

"అంటే?"

"ఏంలేదండీ! నిజం చెప్పాలంటే నేను వాడికన్నా విచిత్రమైన వ్యక్తిని. అందుకనే అలా అడిగా'' అన్నాడు కనకలింగం. తన చూపునామె ముఖంమీంచి రూఫ్ మీదకు మళ్లించేస్తూ.

అర్థమైపోయింది ప్రహేళికకి అతగాడి అత్యాశేవిటో.

అయినా అతగాడేమంటాడో చూద్దామని, "నిజమా? నిజంగా మీరు కూడా విచిత్రమైన వ్యక్తేనా?" అంది ఆశ్చర్యాన్ని అభినయిస్తూ.

"కాస్త కూస్త కాదండీబాబూ! చాలా చాలా విచిత్రమైన వ్యక్తిని'' అన్నాడు కనకలింగం ఈ అవకాశాన్నెలాగైనా సద్వినియోగం చేసుకోవాలని మనసులో అనుకుంటూ.

నిజానికక్కడి కొచ్చేటప్పుడు అతన్లో ఎలాంటి దురుద్దేశ్యమూ లేదు. కేవలం మిత్రుణ్ణి ఆపదలో పడకుండా కాపాడ్డానికి ఆత్మాభిమానాన్ని చంపుకుని తానే ఆ భానుప్రకాశ్‌గార్ని బ్రతిమాలుకుంటే పోలా అన్న సదుద్దేశ్యంతోనే వచ్చాడు.

కానీ కళ్లు చెదిరే ఆమె అందాన్ని చూశాక కళ్లతోపాటు మనసు కూడా చెదరడంవల్ల అతన్లో ఇపుడా అత్యాశ ప్రవేశించింది.

"అలాగా?" ప్రహేళిక అందంగా నవ్వింది.

"మీరు చేసే విచిత్రమైన పనులెలా ఉంటాయో కాస్త శెలవిస్తారా?" అడిగింది, విచిత్రంగా నవ్వడం అయ్యాక.

ఆమె మాటల్లోని వ్యంగ్యాన్ని గుర్తించకుండా "చెబితే మీరు నమ్మలేరండి బాబూ! అంత విచిత్రంగా ఉంటాయ్ నేను చేసే చేష్టలన్నీ'' అన్నాడు కనకలింగం. అదృష్టం ఆ సూరిగాణ్ణొదిలేసి నన్ను వరించబోతున్నట్టుందని సంబరపడిపోతూ.

"విచిత్రాల మీదున్న విచిత్రమైన ఆసక్తిత్తో ద్దీ నేనెందరో విచిత్రమైన వ్యక్తుల్ని చూసినదాన్ని కాబట్టి నేను నమ్మకపోవడం అనే ప్రశ్నేలేదు. చెప్పండి మీ విచిత్ర చేష్టలెలా వుంటాయో?" అంది ప్రహేళిక నమ్మపలుకుతూ.

'కనకలింగమొరేయ్ నీ రొట్టె విరిగి నేతిలో పడబోతోందిరా!' తనకితనే మనసులో చెప్పుకుని, "మీరు పళ్లు దేన్తో తోముకుంటారు?" అనడిగాడు కనకలింగం.

"టూత్ పేస్ట్‌తో' అంది ప్రహేళిక.

"మీరేకాదు సాధారణంగా ఎవరైనా సరే టూత్‌పేస్ట్‌తోనే తోముకుంటారు. బీదాబిక్కీ అయితే పళ్ళపొడి, బొగ్గుముక్క, వందంపుల్ల, ఇలాంటివి కూడా వాడుతుంటారు. కానీ

నేను దేన్తో తోంకుంటానో తెలుసా?"

"దేన్తో?"

"షేవింగ్ క్రీమ్‌తో తోంకుంటాను. నురుగు బాగా వస్తుందికదాని- ఇంతకన్నా విచిత్రం ఇంకేవన్నా ఉంటుందా?" గర్వంగా కళ్లెగరేశాడు కనకలింగం.

కానీ అతనూహించినట్టు "ఆc!" అంటూ విస్తుపోలేదు ప్రహేళిక.

"దాందేముందిలెండి. పళ్లు తెల్లగా మెరవాలని మా ఫ్రెండొకామె ఏరియల్ వాషింగ్ పౌడర్‌తో తోంకుంటుంది'' అనేసింది తేలిగ్గా.

"ఏరియల్‌తో పళ్లు తోంకునే ఏబ్రాసి మొహాలు కూడా వుంటాయన్నమాట ఈ లోకంలో?" అనుకున్న కనకలింగం-

"పోనీ ఇంకో విచిత్రమైన విషయం చెప్పనా?" అన్నాడు నిరుత్సాహపడిపోకుండా.

"చెప్పండి'' అంది ప్రహేళిక.

"అందరూ తలకి కొబ్బరినూనెగానీ, హేరాయిల్‌గానీ రాస్కుంటారుకదా! కానీ నేనేం రాసుకుంటానో తెలుసా? కిరోసిన్ రాసుకుంటాను. పేలూగట్రా పట్టకుండా వుండటానికి'' అన్నాడు గొప్పగా.

'ఆమె తననొక వింత మానవుడిగా ఎంచడానికి ఇంతకన్నా వింతకారణం ఇంకేం కావాలి?' అనుకున్నాడు మనసులో.

కానీ అతని ఆశ అడియాసే అయ్యింది.

ఈసారి కూడా "దాన్దేముందీ?" అంటూ పెదవి విరిచేసింది ప్రహేళిక. "మా ఫ్రెండొకామె తారుని కరిగించి తలకి పూస్కుంటుంది. వెంట్రుకలు ఎప్పటికీ తెల్లబడకుండా వుండాలని. మీరు చేస్తున్నది అంతకన్నా విచిత్రమైతే కాదుగదా?"

ఆమె అలా అనేసరికి నిరుత్సాహం వచ్చేసింది కనకలింగానికి.

'ఇంత మంచమ్మాయికి అంత వికారమైన ఫ్రెండ్స్ ఉండటం ఏంటి?' అనుకున్నాడాశ్చర్యంగా.

అయినప్పటికీ మళ్ళీ ఎలాగో ఉత్సాహాన్ని పుంజుకుంటూ-"పోనీ ఇది వినండి'' అన్నాడు.

ప్రహేళిక చెప్పమన్నట్టుగా చూసింది.

"మీరు స్నానం దేన్తో చేస్తారు?"

"సబ్బుతో'

"కానీ నేను దేన్తో చేస్తానో తెలుసా?"

"బహుశా ఉత్త పీచుతో రుద్దుకుంటారేమో! అంతేనా?"

"కాదండీబాబూ, వేపాకుల్ని ముద్దగా నూరి ఆ ముద్దతో చేస్తుంటాను. చర్మవ్యాధులు రాకుండా ఉంటాయని బహుశా నా అంత విచిత్రమైన వ్యక్తిని మీరెప్పుడూ చూసుండరు. అవునా?" అన్నాడు కనకలింగం ఆశగా. అంటే అవున్నిజమేనని ఆమె ఒప్పేసుకుంటుందన్న ఆశతో.

కానీ ప్రహేళిక ఒప్పుకోలేదు.

"మీకన్నా విచిత్రమైన మనుషుల్ని చాలామందిని చూశానండీ బాబూ! మా ఫ్రెండొకామె కాకరకాయల ముద్దలో గంధకం కలిపి దాన్తో స్నానం చేస్తుంటుంది'' అంటూ నవ్వేసింది.

దాన్తో అప్పుడర్థమైంది కనకలింగానికి ఆమె తనని ఆటపట్టిస్తోందని.

"మీరు నన్నేడిపించాలని చూస్తున్నారుకదూ?" అన్నాడు బాధగా.

"కాదు. మీలోని అత్యాశని ఆటపట్టిస్తున్నాను. లేకపోతే ఏంటి? మీ పిచ్చిమాటలకి పడిపోయి, మిమ్మల్నొక విచిత్రమైన వ్యక్తిగా భావించేసి మీపట్ల ఆకర్షితురాల్నైపోతాననుకుంటున్నారా? నేను మరీ అంత పిచ్చిదాన్నేం కాదు మీ మాటలు నమ్మేయడానికి. ఆ సూరిబాబంటే చాలా విచిత్రంగా అలాంటి పాంప్లెంట్ రిలీజ్ చేశాడు కాబట్టి నాకతని మీద ఆసక్తి ఏర్పడింది. చిత్రవిచిత్రంగా అతను నన్ను తిరస్కరించాడు కాబట్టి, ఎంత డబ్బిచ్చినా సరే నాకు సారీ చెప్పనని మా డాడీని సైతం ధిక్కరించాడు కాబట్టి అతని మీద నాకింత ఇంట్రస్ట్ ఏర్పడింది. నేను





పంతానిగ్గనకపోతే పీకైనా తెగ్గోసుకునే మనిషిని. మీ నక్కాశని పక్కకు పెట్టి అసలు విషయంలోకొస్తే అతగాణ్ణి నేనింక వదిలిపెట్టనన్నది తిరుగులేని నిజం!" అంది ప్రహేళిక పిడికిళ్లు బిగిస్తూ.

ఆమె దవడ కండరం ఒకటి బిగుసుకోవడం కనకలింగం కూడా గుర్తించాడు.

ఆమె వద్ద ఇంక తన పప్పులేమీ ఉడకవని అర్థమైపోవడంతో "అంటే వాడికి దేహశుద్ధి తప్పదన్నమాట-అంతేనా?" అన్నాడు బాధగా.

ప్రహేళిక అడ్డంగా తలాడించింది.

"ముందైతే నేనూ అలాగే అనుకున్నాను. నలుగురో అయిదుగురో రౌడీలను మాట్లాడి అతన్ని తుక్కుతుక్కుగా తన్నించాలనుకున్నాను. కానీ మా డాడీ నన్ను వద్దని వారించి అతన్తో నాకపాలజీ చెప్పిస్తానంటూ వెళ్ళి తనూ భంగపడి వచ్చాడు. అందుకే నేనిప్పుడొక స్ట్రాంగ్ డిటర్‌మినేషన్ కొచ్చేశాను. నన్ను తిరస్కరించిన మీ ఫ్రెండు వేరొకమ్మాయిని ప్రేమించడానికి వీల్లేదుగాక వీల్లేదు. ఎలాగైనా వాళ్లిద్దర్నీ విడగొట్టి మీ ఫ్రెండుని నా వాణ్ణి చేసుకుంటాను''

"అయితే వాడి అజ్ఞానం, తెలివి తక్కువతనం, పొగరు ఇవన్నీ కూడా మీకు విచిత్రంగానే అనిపించాయన్నమాట? మొత్తానికి వాడదృష్టవంతుడు. వాడు మిమ్మల్నొకసారి తిరస్కరించాక్కూడా మీరంత గట్టి నిర్ణయానికొచ్చారంటే రియల్లీ హి ఈజ్ ఎ వెరీ లక్కీగై! మీరు నమ్ముతారో లేదోగానీ ఆ సుజీవనతో పోటీపడుతూ మీరు కూడా వచ్చారని వాడు చెప్పగానే నేను కూడా వాడికెంతగానో చెప్పి చూశాను. 'ఆ దిక్కుమాలిన సుజీవన సంగతొదిలేసి, ఆ ప్రహేళిక గారి చేతినే అంది పుచ్చుకోరా' అని. కానీ తల బిరుసు వెధవ, నా మాట వినిపించుకోలేదు. నిన్న మీ డాడీగారొచ్చినప్పుడు కూడా. అంత పెద్దాయన ఇంతిదిగా అడుగుతున్నారు. పోనీ వెళ్ళి ఆ అమ్మాయికి క్షమాపణ చెప్పి రారా అని నేనెంత బతిమాలాను. కానీ చెయ్యని నేరానికి నేనెందుకు క్షమాపణ చెప్పాలంటూ నిక్కుపోయాడు. ఏదేమైనప్పటికీ వాడి ఫ్రెండ్‌గా, వెల్‌విషర్‌గా మీ పంతం నెరవేరాలని నేనూ కోరుకుంటున్నాను. వాళ్లిద్దరి ప్రేమా చెడగొట్టడానికి ఈ విషయంలో నేను కూడా మీకు నా వంతు సహకారం అందజేస్తాను. సో నానుండి మీకెలాంటి హెల్ప్ కావాల్సొచ్చినా నిరభ్యంతరంగా అగడండి''

అంత గొప్పింటతివ అంత పంతం పట్టాక అదెలాగూ నెరవేరుతుందని తెలుసు కాబట్టి అదృష్టం తనవేపు మళ్లే సూచనలింకెలాగూ లేవు కాబట్టి మిత్రుడి క్షేమాన్ని నిండుమనసుతో కాంక్షించినవాడై శత్రువుతో అలా చేతులు కలిపాడు కనకలింగం.

ఈ పరిణామం ప్రహేళికకు చాలా ఆనందాన్ని కలిగించింది.

"అలాగన్నారు బావుంది. ఇవ్వాళ్టినుంచి మనిద్దరం ఫ్రెండ్స్! మనిద్దరి ధ్యేయం ఒక్కటే! ఎలాగైనాసరే వాళ్ళ ప్రేమని చెడగొట్టాలి ఓ.కే?" అంది నవ్వుతూ.

"డన్" అన్నాడు కనకలింగం.

"థాంక్స్'' అంది ప్రహేళిక.

దరిమిలా ఆమె కనకలింగాన్ని సుజీవన చిరునామా గురించి అడగ్గా...

"అడ్రసైతే నాకూ తెలీదండీ! కానీ ఇవ్వాళ సాయంత్రం అయిదింటికి వాళ్లిద్దరూ టాంక్ బండ్‌మీద కాటన్‌దొర విగ్రహం దగ్గర కలుసుకోబోతున్నారు'' అన్నాడు కనకలింగం.

"చాలు లింగంగారూ! ఆపాటి ఇన్‌ఫర్మేషన్ చాలు. మిగతా వ్యవహారం నేన్నడిపిస్తాగా'' ఆడవిలన్‌లా వికటాట్టహాసం అయితే చెయ్యలేదుగానీ పట్టరాని సంతోషంతో గట్టిగా చప్పట్లు మాత్రం కొట్టింది ప్రహేళిక.

"మరి నేనిహ వెళ్ళిరానా?" లేస్తూ అడిగాడు కనకలింగం. "సరే లింగంగారూ! అప్పుడప్పుడూ వచ్చి కనబడుతూ వుండండి''

అంది ప్రహేళిక.



కనకలింగం గేటుదాటి వచ్చేస్తుంటే-

"లింగంగారూ లింగంగారూ'' అంటూ వెనకనుంచి పరుగు పరుగున వచ్చి అతన్ని సమీపించింది ప్రహేళిక.

"ఏంటండీ?" అన్నాడు కనకలింగం వెళ్ళిపోతున్నవాడల్లా ఆగిపోయి.

"నాకో చిన్న హెల్ప్ చెయ్యాలి''

"చెప్పండి'' కుతూహలంగా చూశాడు.

"ఇప్పుడు టైమెంత?"

"త్రీ థర్టీ'' చెప్పాడు కనకలింగం తన రిస్ట్‌వాచ్‌లోకి చూసి.

"మీరు అర్జంట్‌గా మీ రూంకెళ్ళిపోయి, మీ సూరిబాబుని టాంక్‌బండ్‌కి ఓ అరగంట ఆలస్యంగా వెళ్ళేలా చూడాలి'' అంది ప్రహేళిక పమిట చెంగుని నడుం చుట్టూ ఓ తిప్పు తిప్పి బొడ్లో దోపుకుంటూ.

'దేనికి?' అన్నట్టుగా చూశాడు కనకలింగం.

అతనికి బాగా చేరువలోకొచ్చి దాదాపు చెవిలో గుసగుసలాడినంత మెల్లగా చెప్పింది ప్రహేళిక. "ఏంలేదు లింగంగారూ! అయిదింటికల్లా తను కాటన్‌దొర విగ్రహం దగ్గరికొచ్చేస్తుందికదా? ఆమె అక్కడికి వచ్చీరావడంతోనే రౌడీలచేత బెదిరించే ఏర్పాటేదో నేను చేస్తాను. ఎంతయినా ఆడపిల్లకదా వెంటనే బెదిరిపోయి వెళ్లిపోతుంది. నేను చెప్పినట్టు మీరు సూరిబాబుని కాస్త ఆలస్యంగా వచ్చేట్టు మానేజ్ చెయ్యగలిగితే అతనొచ్చేసరికే ఆమె అక్కడుండదు. దాంతో ఆమె మొదటిరోజే తనకి హేండిచ్చిందనుకుని మీ సూరిబాబు బేర్‌మంటాడు. మనక్కావలసింది అదేగా?"

"ఇదేదో బానే వున్నట్టుంది. వాణ్ణో అరగంట ఆలస్యంగా వచ్చేలా చెయ్యాలంతేగా? ఆ సంగతి నా కొదిలేయండి'' అన్నాడు కనకలింగం హామీ ఇస్తూ.

"దట్స్ గుడ్! మీరింక వెళ్లిరండి'' అంది ప్రహేళిక.

★ ★ ★

ఎందుకైనా మంచిదని ఆటోలో వచ్చేయడంవల్ల త్రీ ఫార్టీఫైవ్ కల్లా రూముకు చేరుకున్నాడు కనకలింగం.

అతనొచ్చేసరికి ట్రిమ్‌గా తయారై స్ప్రే చల్లుకుంటూ అద్దంముందు నిలబడున్నాడు సూరిబాబు.

మిత్రుడి ఆకస్మికాగమనానికి విస్తుపోతూ, "అదేంట్రా అప్పుడే వచ్చేశావ్? నువ్వీరోజు ఆఫీసుకి పోలేదా?" అన్నాడు గాభరాగా.

"పోయాన్రా! సడన్‌గా కడుపునొప్పొచ్చేసరికి మధ్యలో పర్మిషన్ తీసుకుని వచ్చేశాను. అసలు పొద్దున్నిక్కడ బయలుదేరినప్పుడే సన్నగా ప్రారంభమైంది నొప్పి. కానీ అదేం చేస్తుందిలే అని మొండికెత్తి వెళ్ళిపోయాను. మధ్యాహ్నం పన్నెండూ ఒంటిగంటకల్లా బాగా ఎక్కువైపోయింది. అయినా ఇంకో రెండు గంటలు ఎలాగో ఉగ్గబట్టుకున్నాను. కానీ మూడింటికల్లా మరీ ఎక్కువైపోవడంతో ఇంకుండలేక వచ్చేశాను'' అన్నాడు కడుపు చేతబట్టుకుంటూ.

ఇదంతా అతగాడు ఆటోలో వస్తున్నప్పు

డు ప్లాన్ చేసుకున్నదే.

"అరెరె అలాగా? కారణం ఏమయ్యుంటుందంటావ్??" స్ప్రే డబ్బాని పక్కన పడేసి అతని దగ్గరికొస్తూ అడిగాడు సూరిబాబు.

"అదే నాకూ అర్థం కావట్లేదురా! ఇంతకు ముందెప్పుడూ జరగలేదిలా!" సోఫాలో కూలబడిపోతూ పొట్ట పట్టుకుని మరింతగా మెలికలు తిరిగిపోతూ అన్నాడు కనకలింగం.

"కడుపులో పాములు చేరాయేమోరా! కడుపులో పాములుంటే కడుపు నొప్పి రావడానికి ఆస్కారం ఉంది'' మిత్రుని దిక్కు జాలిగా చూస్తూ అన్నాడు సూరిబాబు.

"నా బొంద. కడుపులో పాములు చేరడానికి నా కడుపేవన్నా చీమలపుట్టా? ఇదేదో అపెండిసైటిస్‌లాంటిదని నాకనుమానంగా ఉంది. ఆర్డినరీ కడుపునొప్పైతే మరీ ఇంత ఉధృతంగా రాదు'' మెలికలు తిరిగిపోవడాన్ని మల్టిప్లై చేస్తూ అన్నాడు కనకలింగం.

వచ్చి చచ్చింది నిజమైన కడుపునొప్పైతేగా? అందుకే మెలికలైతే యమజోరుగా తిరిగిపోగలిగాడుగాని బాధగా అరుపులైతే అరవలేకపోయాడు.

"గాడిదగుడ్డు. అపెండిసైటిస్ అయితే ఆ బాధ ఇంకా ఇంకా ఉధృతంగా ఉంటుంది. ఆ బాధని తట్టుకోలేక ఎంతటివారైనా గట్టిగట్టిగా అరుస్తారు. మా వూళ్లో వెంగళ్రావ్ అనే అతనికి అపెండిసైటిస్ వచ్చినప్పుడు నేచూశాగా. ఆ బాధని తట్టుకోలేక పెంకులెగిరిపోయేలా అరిచాడు. నువ్ జస్ట్ మెలికలు తిరుగుతున్నావే తప్ప అరవటంలేదంటే ఇదపెండిసైటిస్ కావటానికి వీల్లేదు. అజీర్తి కడుపునొప్పయ్యుంటుందంతే''

సూరిబాబు స్టేట్‌మెంట్ కనకలింగంలో జ్ఞానోదయాన్ని కలిగించింది. దాంతో "అమ్మో... అబ్బో... ఉస్సో... అస్సో'' అంటూ మెలికల్తో పాటు అరుపులు కూడా ప్రారంభించాడు.

కావాలని అరుస్తున్న అరుపులు బాధాపూరితంగా వుండమంటే ఎలా వుంటాయి?

అందుకే సూరిబాబు ఆ అరుపుల్నేవంతగా పట్టించుకోలేదు.

పైగా "శుభమా అంటూ తొలిసారిగా ఫియాన్సీ దగ్గరకెళ్తుంటే ఈ పాడు న్యూసెన్సేంటి?" అని విసుక్కున్నాడు మనసులో.

"కాస్త కడుపునొప్పికే అలా అరుస్తావేంట్రా? దేనికైనా ఓర్చుకునే మనస్తత్వం ఉండాలి. కాసేపు నెమ్మదిగా వుండు. అదే తగ్గిపోతుందిలే' అని మందలించాడు కూడా.

ఎక్కడికైనా పరిగెత్తి మందులు తేవాల్సింది పోయి మిత్రుడలా మందలించేసరికి కనకలింగానికి కొంచెం కష్టంగా అనిపించింది.

"అరవకపోతేనేమో అపెండిసైటిస్ కాదన్నావ్! తీరా అరుస్తుంటేనేమో కాస్త కడుపునొప్పికే అరుపులేంటంటున్నావ్? నాది కాస్తా కూస్తా కడుపునొప్పా? ఈ నొప్పి నీకొస్తే తెలుస్తుంది'' అన్నాడుక్రోషంగా.

"ఇది మరీ బాగుందిరా! నేనరవమన్నాక దాని అరుస్తున్నట్టుగా మాట్లాడుతున్నావే! అపెండిసైటిస్ అంటే అల్లాటప్పా అనుకుంటున్నావా? ఇరవై నాలుగ్గంటల్లోగా ఆపరేషన్ చెయ్యకపోతే చచ్చూరుకుంటారు. నా ఆప్తమిత్రుడివైన నీకలాంటి ఘోరమైన జబ్బు రాకూడదని నేను అంటుంటే దానికి బాధపడతావేం? సరే ఇంతకీ ఇపుడు నన్నేం చెయ్యమంటావో చెప్పు" ఫియాన్సీ దగ్గరికెళ్ళాల్సిన టైం కావస్తోందన్న బాధ మనసుని తొలుస్తూవున్నా, పైకిమాత్రం సాధ్యమైనంత శాంతంగానే అన్నాడు సూరిబాబు.

"నువ్వన్నట్టు ఇది అజీర్తి కడుపునొప్పే గనకైతే మాదీఫల రసాయనం తాగితే తగ్గిపోతుంది. ఇంపీరియల్ హెూటల్ పక్క సందులో ఆయుర్వేదిక్ మెడికల్ షాపుంది. అక్కడికెళ్ళి ఓ బాటిల్ పట్రా'' అన్నాడు

కనకలింగం.

నిన్నగాక మొన్న జడుపు జ్వరంతో తాను హాస్పిటల్‌లో పడితే తనకి సకలోపచారాలూ చేసిన మిత్రుడికి కడుపునొప్పితో అల్లాడిపోతున్న సమయంలో మాదీఫలరసాయనం తెచ్చివ్వకపోవడం బావుండదనిపించి "సర్లే సర్లే అలాగే అలాగే'' అంటూనే వీధిలోకి పరుగుతీశాడు సూరిబాబు.

తీరా అక్కడికెళ్తే కారణం ఏమిటోగాని ఆ షాపు కాస్తా మూసేసుంది.

ఆ పక్కనే వున్న ఓ కిళ్ళీకొట్టు వాణ్ణడిగితే, "ఏమోనండీ, ఎందుకో మరి పొద్దుట్నుంచీ తెరవలేదు. మీక్కావాలంటే దీని వెనగ్గల్లీలో 'టీడెన్' పక్కనే ఇంకో ఆయుర్వేదం మెడికల్ షాపుంది. అక్కడికెళ్ళండి'' అంటూ ఓ ఉచిత సలహా ఇచ్చాడాషాపువాడు.

సరే లెమ్మని పడుతూలేస్తూ అక్కణ్ణుంచి ఆ షాపుకెళ్ళి ఓ మాదీఫలరసాయనం బాటిల్ కొనుక్కుని తిరిగి రూముకు చేరుకునేసరికి టైం నాలుగున్నరైంది.

సూరిబాబుని చూస్తూనే అప్పటిదాకా బాగానే వున్న కనకలింగం మళ్ళీ మెలికలు తిరిగిపోతూ "అమ్మో-అబ్బో- అస్సో-ఉస్సో'' అనడం ప్రారంభించాడు.

"ఇదుగోరా నువ్వడిగిన మాదీఫలరసాయనం. దీన్ని మింగి నీ కడుపునొప్పి తగ్గించుకో. అవతల నాకోసం నా ఫియాన్సీ ఎదురు చూస్తూంటుంది. నేనర్జంట్‌గా వెళ్ళాలి'' అంటూ సూరిబాబు ఆ బాటిల్ని మిత్రుడి కందించబోయాడు.

అసలే మెలికలు తిరుగుతూ ఉన్న కనకలింగం దాన్ని సరిగ్గా అందుకోలేకపోయాడు.

తత్ఫలితంగా అది కాస్తా అతని చెయ్యి జారి కిందపడి భళ్ళున బద్దలైపోయింది.

"అయ్యో-అబ్బో-అస్సో-ఉస్సో- నేనీబాధని తట్టుకోలేకపోతున్నాన్రా! అర్జంట్‌గా వెళ్ళి ఇంకో బాటిల్ పట్రారా!" అన్నాడు కనకలింగం బాధాపూరిత కేకలు వేస్తూ.

ఇందాకటి కన్నా అతనిపుడా బాధాపూరిత కేకల్ని చాలా బాగా వెయ్యగలిగాడు మిత్రుడా యుర్వేదిక్ మెడికల్ షాపుకెళ్ళినప్పుడు రూమ్‌లో కూర్చుని బాగా ప్రాక్టీస్ చెయ్యడం మూలాన్న!

అందుకే అతనిపుడా బాధాపూరిత కేకల్ని అంత పెరఫెక్ట్‌గా వెయ్యగలిగాడు.

దాంతో సూరిబాబు మిత్రుడిది దొంగ కడుపునొప్పని తెలుసుకోలేకపోయాడు.

ఇంత పెరఫెక్ట్‌గా బాధాపూరిత కేకలేస్తున్నాడూ అంటే వీడికి నొప్పి చాలా ఎక్కువగా ఉందన్నమాట!

కానీ అవతల సుజీవన తనకోసం ఎదురు చూస్తుంటుంది గదా?

ఇప్పుడెలా?

మొదటిరోజే టైం మెయిన్‌టెయిన్ చెయ్యలేకపోతే ఆమె తనని గురించి ఏమనుకుంటుంది?

బద్దలైన మాదీఫలరసాయనం సీసా తాలూకు పెంకులకేసి చూస్తూ అతనలా డైలమాలో పడిపోగా,

"అమ్మో-అబ్బో-అస్సో-ఉస్సో ఒకపక్క నేనిలా నొప్పితో గిజగిజలాడిపోతుంటే అస్సో-ఉస్సో నువ్విలా దిష్టిబొమ్మలా నిలబడిపోయావేంట్రా?! నొప్పి తగ్గాక ఆ పెంకుల్ని నేనేరి అదంతా క్లీన్ చేస్తాలేగానీ ముందు నువ్ పరిగెత్తు'' అన్నాడు మరింత పెర్‌ఫెక్ట్‌గా బాధాపూరిత కేకలేస్తూ కనకలింగం. మెలికలు తిరిగిపోవడంలో కూడా అతగాడీసారి మరింత మెళుకువని ప్రదర్శించాడు.

దాంతో ఉపేక్షిస్తే వీడి ప్రాణాలు పోతాయేమోననిపించి మాదీఫల రసాయనం కోసం మళ్ళీ వీధిలోకి పరుగుతీశాడు సూరిబాబు.

★ ★ ★

నాలుగూ యాభయ్యయిదుకే కాటన్‌దొర విగ్రహం దగ్గరకు చేరుకున్న సుజీవనకి అయిదూ అయిదైనా సూరిబాబు రాకపోవడంతో చాలా చిరాకేసిపోయింది.




ప్రేమార్తన్నాడు. అదన్నాడు. ఇదన్నాడు. తనకోసం ఓ కోటీశ్వరుడి కూతుర్ని సైతం కాలదన్ని పంపించేశాడు. ఇచ్చిన మాట కోసం వలచి వచ్చిన అదృష్టాన్నే వద్దు పొమ్మనేశాడు.

అలాంటివాడు చెప్పిన టైంకి రాకపోవడం ఏంటి?

కొంపదీసి తానొచ్చేశాక అతని మనసు గాని మారిపోయిందా? ఆ ప్రహేళిక అందం గుర్తొచ్చి అతగాడు తనడెందాన్ని గాని మార్చేసుకున్నాడా?

ఛ...ఛ! అలాంటివాడైతే నిన్నా ప్రహేళికనంతిదిగా రిజక్ట్ చేసుండేవాడేకాదు.

ఆమె వెళ్లిపోయాక్కూడా నిన్న ఆమె ఐశ్వర్యాహంకారాన్ని ఈసడించుకుంటూ ఎన్నిమాటలన్నాడు?

హేట్రెడ్ ఎట్ ఫస్ట్ సైట్! అలాంటిదేదో కలిగిపోయింది అతగాడికా ప్రహేళికని చూడగానే.

సో- అతను మళ్ళీ మనసు మార్చుకుని ఆమెవైపు డైవర్ట్ కావడం అనేది జరగదు గాక జరగదు.

మరైతే ఎందుకని ఇంకా రాలేదు?

ఆమె అలా ఆలోచిస్తుండగా మరో అయిదు నిముషాలు గడిచిపోయాయి.

అంతలో ఓ కాంటెస్సా కారొచ్చి ఆగింది ఆమెకు చేరువలో.

ఆ కారుని చూస్తూనే గుర్తుపట్టేసింది సుజీవన అది నిన్న సూరిబాబింటికి ప్రహేళిక వేస్కొచ్చిన కారేనని.

ఎందుకంటే ఒకసారాకారుని చూసినవాళ్ళెవరూ జీవితంలో ఇంక దాన్ని మర్చిపోలేరు. అంత విచిత్రంగా వుంటుందా కారు రంగు. రంగంటే రంగుకాదు రంగులు. రైన్‌బో కలర్స్ అన్నీ బద్దలు బద్దలుగా ఉంటాయ్ ఆ కారుమీద.

భలేకారనుకుంటూ సుజీవన దానికేసి చూస్తుండగానే ప్రహేళిక ఆ కారులోంచి కిందకు దిగింది.

ఆమె వెనుక ఓ ఇద్దరు వస్తాదుల్లాంటి వ్యక్తులు కూడా కిందకు దిగారు.

"కమాన్ ఫాలోమీ'' అన్నట్టుగా వాళ్ళిద్దరికీ చెయ్యూపి నడచివస్తున్న అహంకారంలా ప్రహేళిక నింపాదిగా ఒక్కో అడుగే వేస్తూ సుజీవనను సమీపించింది.

"మీరు ప్రహేళికగారు కదూ?" ఆమె తన దగ్గరకు రాగానే ఆశ్చర్యంగా అడిగింది సుజీవన.

"డౌటెందుకూ? నిన్నేగా చూశావ్. అప్పుడే మర్చిపోయావా?" ప్రహేళిక ఆమెకేసి మింగేసేలా చూస్తూ అంది.

"ఛ...ఛ లేదండి. మిమ్మల్ని ఒక్కసారి చూసినవాళ్ళు ఇంకెప్పుడూ మర్చిపోలేరు అంతగొప్ప అందంమీది'' అంది సుజీవన మనస్ఫూర్తిగా ఆమె అందాన్ని మెచ్చుకుంటూ.

ప్రహేళిక ఆ మాటలకి సహజంగానే కాస్త గర్వంగా తలెగరేసింది.

"ఎవరికోసం ఎదురుచూస్తున్నావ్? ఆ తిక్కవెధవ సూరిబాబు కోసమేనా?" కర్కశంగా అడిగింది.

తానామెను 'మీరు' అని మన్నిస్తుంటే ఆమె తనని 'నువ్వు' అనడం సుజీవనకు బాధ కలిగించింది.

అయినా పోనీలెమ్మని సరిపెట్టుకుంది.

డబ్బున్నమ్మాయి కదా. ఆ పాటి పొగరుండటం సహజమేలే అనుకుంది.

"అవునండీ! సూరిబాబుగారి కోసమే ఎదురుచూస్తున్నా'' అంటూ తను మాత్రం వినయంగానే జవాబిచ్చింది.

ప్రహేళిక వెనుక చేతులు కట్టుకు నిలబడున్న వస్తాదుల్లాంటి వాళ్ళిద్దర్నీ ఆమె బాడీగార్డ్సుగా భావించిందే తప్ప వాళ్ళు కిరాయి రౌడీలనీ, తనని బెదిరించడానికే ఆమె వాళ్ళనిలా తీసుకొచ్చిందని సుజీవన ఊహించలేక

పోయింది.

అందుకే వాళ్ళని చూసి ఆమె ఏమాత్రం భయపడలేదు.

"సూరిబాబుకోసం ఎదురుచూస్తున్నావా?" అని ఆడవిలన్‌లా నవ్వేందుకు ప్రయత్నించింది ప్రహేళిక. కానీ అంతకుముందు ప్రాక్టీస్ లేకపోవడంవల్ల ఆ నవ్వు మామూలు నవ్వులాగే అనిపించింది సుజీవనకి.

"అవునండీ'' అంది బుద్ధిగా తలాడిస్తూ.

"తింగరి వెధవ. ఇవుడిక్కడికి వస్తాడనుకుంటున్నావా?" మనసులో ఏదో ఐడియా ఫ్లాష్ అవ్వడంతో అదోలా తలెగరేస్తూ అంది ప్రహేళిక 'ఓసి పిచ్చిదానా?' అన్నట్టుగా!

పవిత్రమైన ప్రేమార్తి హృదయం కలిగిన తన సూరిబాబుని, తన భావి పతిదేవుణ్ణి ప్రహేళిక అలా తింగరివెధవ అనడం మింగ జాలని పదార్థమేదో గొంతుకడ్డం పడినంత బాధని కలిగించింది సుజీవనకు.

అయినప్పటికీ పేదరాలికోపం పెదవికి చేటన్న విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని ఆ బాధని దిగమింగేసుకుంది.

"ఎందుకు రారండీ? తప్పకుండా వస్తారు. ఈరోజు సాయంత్రం అయిదింటికి ఇక్కడ కలుసుకోవాలని నిన్ననే మేం డిసైడ్ చేస్కున్నాం. సో... తప్పకుండా వస్తారు''

"అలాగా? మరి ఐదుంబావవుతున్నా ఇంకా రాలేదేం?"

"దాందేముంది. సమయానికి సిటీబస్ అందక లేటయ్యుండొచ్చు వచ్చేస్తారు కాసేపటికి'' అంది సుజీవన.

"ఏం రాడు'' అంది ప్రహేళిక వికృతంగా నవ్వడానికి ప్రయత్నిస్తూ.

అందమైన అమ్మాయి వికృతంగా నవ్వినా అందంగానే ఉంటుంది కాబట్టి ఆ నవ్వుని కూడా మామూలు నవ్వుగానే భావించి "లేదండీ. తప్పకుండా వస్తారు'' అంది సుజీవన.

ఇప్పటికే చాలా ఆలశ్యమైందనుకున్న ప్రహేళిక "నీ మొహం! ఎలా వస్తాడు? రావడానికతని కాలూ, చెయ్యీ తిన్నగా ఉంటేకదా?" అంటూ తాను పేల్చదల్చుకున్న బాంబుని పేల్చేసింది.

"అంటే?... అంటే?!!" గాబరాగా అంది సుజీవన.

ప్రహేళిక బందిపోటురాణిలా నడుంమీద చేతులుంచుకుని "నా వెనకెవరున్నారో చూశావా?" అంది.

"మీ బాడీగార్డ్స్ అయ్యుంటారు. అంతేకదూ?" అంది సుజీవన కాస్త భయంగానే.

"వీళ్ళు నా బాడీగార్డ్స్ కాదు. ఎంతటి మొనగాణ్ణైనా ఒకే ఒక్క దెబ్బతో మట్టి కరిపించేయగల కిరాయిరౌడీలు! ఆ సూరిబాబుగాడి భరతం పట్టిరమ్మని ఇలాంటివాళ్ళనే ఇంకో ఇద్దర్నక్కడికి పంపించి నీ అంతు తేల్చడానికి వీళ్లనిక్కడికి తీస్కొచ్చాను. వాళ్ళిద్దరూ ఈపాటికా సూరిబాబుగాడి కాలో, చెయ్యో విరిచేసే ఉంటారు'' అంటూ ప్రయత్నపూర్వకంగా ఈసారి కాస్త బాగానే వికటాట్టహాసం చెయ్యగలిగింది ప్రహేళిక.

"ప్రహేళికగారూ?" భయంగా అంది సుజీవన.

ఆ వెంటనే "మీకిది న్యాయంకాదు ప్రహేళికగారూ! మిమ్మల్ని తిరస్కరించారన్న కసితో అమాయకులైన ఆ సూరిబాబుగార్ని మీరిలా రౌడీలతో తన్నించడం చాలాచాలా అన్యాయం" అంది ఎలాగో ధైర్యాన్ని తెచ్చుకుంటూ.

"నువ్ నాకేం నీతులు చెప్పక్కర్లేదు. ఐ నో వాటీజ్ వాట్! ఎక్కువ తక్కువ మాట్లాడేవంటే నీక్కూడా ఆ సూరిబాబుకి పట్టిన గతే పడుతుంది. జాగ్రత్త! చూస్తున్నావ్‌గా నా వెనక ఎలాంటి రౌడీలున్నారో? నేను 'ఊఁ' అంటే చాలు వాళ్ళు క్షణాల్లో నీ ఊపిరి తీసేస్తారు. కాని సాటి ఆడదానివికదాన్న జాలికొద్దీ ఇలా మర్యాదగా మాటల్లో చెప్తున్నానంతే. నువ్ మర్యాదగా ఆ సూరిబాబుగాణ్ణి




మర్చిపో. ఇంకోసారి గనక అతన్ని కలుసుకోవడానికి ప్రయత్నించావో నువ్ ప్రాణాల్తో మిగలవ్ జాగ్రత్త!"

ప్రహేళిక ఆడపులిలా గాండ్రిస్తూ అలా అంటుంటే ఆమె వెనకున్న ఆ రౌడీలిద్దరూ 'మీరు ఊఁ అనండి మేడమ్' అన్నట్టుగా ఆమెకేసి చూస్తుంటే సహజంగానే సుజీవన గజగజా వణికిపోయింది.

ఒకట్రెండు క్షణాలతర్వాత "ఎందుకు మీరు మా ఇద్దర్నీ ఇలా విడదియ్యాలని చూస్తున్నారు?" అంది ఎలాగో ధైర్యాన్ని పుంజుకుంటూ.

"నాలాంటి బ్యూటీని తిరస్కరించిన ఆ కోతివెధవ కోరుకున్న ఆడదానితో సుఖంగా ఉండటం నేను సహించలేను. నాకు దక్కని వస్తువుగానీ, మనిషి కానీ మరొకరికి దక్కడం నేను సహించలేను. అయినా ఈ అధిక ప్రసంగాలన్నీ దేనికి నీకు? ప్రాణాల మీద ఏమాత్రం ఆశున్నా తక్షణం ఇక్కణ్ణుంచి వెళ్ళిపో. లేదంటే నేను వీళ్ళిద్దరికేసి తిరిగి 'ఊఁ' అనేయాల్సొస్తుంది'' అంది ప్రహేళిక ఈసారి ఆడసింహంలా గర్జిస్తూ.

అనేకానేక తెలుగు సినిమాల్లో ఇలాంటి డైలాగ్స్ చాలాసార్లే విసున్నప్పటికీ సూరిబాబు ఎక్కణ్ణుంచో హఠాత్తుగా వచ్చి కాపాడటానికి ఇదేమీ తెలుగు సినిమా కాదని తెలుసు! కాబట్టి "అ...అ... అలాగేనండీ'' అంది సుజీవన ప్రాణభయంతో వణికిపోతూ.

ప్రేమదేముందీ?

ఇవ్వాళ కాకుంటే రేపయినా ప్రేమించుకోవచ్చు.

కానీ ప్రాణాలనేవి ఒకసారి పోతే తిరిగిరావుగదా?

"మరైతే ఇంకా ఇక్కడే నిలబడ్డావేం? వెంటనే ఏదైనా ఆటో ఎక్కి వెళ్ళిపో' అంటూ హుంకరించింది ప్రహేళిక.

బతికుంటే బలుసాకైనా తినొచ్చనుకున్న సుజీవన, వెంటనే "ఏయ్ ఆటో..." అంటూ అటుగా వస్తోన్న ఓ ఖాళీ ఆటోని కేకేసి అందులో ఎక్కి కూర్చుంది.

ఆటో అక్కణ్ణుంచి కదిలి వెళ్ళిపోతుంటే "గ్రాండ్ సక్సెస్'' అనుకుంది ప్రహేళిక ఆనందంగా.

"ఏంటి పాపగారూ ఇది?" అన్నాడు వెంటవచ్చిన రౌడీల్లో ఒకడు.

"ఏంటమ్మాయిగోరూ ఇదంతా?" అన్నాడు రెండోవాడు.

నిజానికి వాళ్ళిద్దరూ రౌడీలు కాదు.

మొదటివాడు వాళ్ళ వంటవాడు. రెండవవాడేమో తోటమాలి. వాళ్ళిద్దరూ భానుప్రకాష్ వాళ్ళ ఇంట్లోనే వుంటూ ముప్పొద్దులా మాంచి భోజనం తింటుంటారేమో సహజంగానే వాళ్ళలా వస్తాదుల్లా తయారయ్యారు.

కనకలింగం తమ ఇంటికొచ్చివెళ్ళాక అప్పటికప్పుడు కిరాయి రౌడీల్ని కాంటాక్ట్‌చేసే సమయం లేకపోవడంవల్ల అదీగాక అసలైన కిరాయిరౌడీ లెక్కడుంటారో కూడా ఆమెకు తెలియకపోవడంవల్ల ఈ పన్నాగం పన్నింది.

వాళ్ళు కిరాయి రౌడీలు కాకపోతేనేం?

మొత్తానికి ప్లానైతే ఫలించింది!

"అదంతా మీకెందుకూ? చెప్పినప్రకారం చక్కగా నటించారు కాబట్టి అన్నప్రకారం ఇంటికెళ్ళగానే మీ ఇద్దరికీ చెరో రెండొందలూ ఇస్తాను. ఊఁ పదండి, నడవండి'' అంటూ ముందుగా తానే కారువైపు దారితీసింది ప్రహేళిక.

వాళ్ళిద్దరూ మౌనంగా ఆమెననుసరించారు.

★ ★ ★

పడుతూ లేస్తూ అయిదూ ముప్పైతొమ్మిది నిముషాలకల్లా టాంక్‌బండ్ చేరుకుని కాటన్‌దొర విగ్రహం దగ్గరకి ఎంతో ఆత్రంగా వచ్చిన సూరిబాబుకి అక్కడ సుజీవన కనిపించకపోవడంతో నిలువునా నీరసం కమ్ముకొచ్చేసింది.



వాటీజ్ దిస్?

జస్ట్ ఫార్టీ మినిట్స్‌గా లేటయ్యింది?

అట్టే మాట్టాడితే ఫార్టీ కూడా కాదు. థర్టీ నైన్ మినిట్స్...

ప్రియుడికోసం ఓ ఫార్టీ మినిట్స్ కూడా వెయిట్ చెయ్యలేని ఆమె కూడా ఓ ఫియాన్సీ నా?!

అసలు ప్రేమంటే ఏంటి? ఒకరికోసం ఒకరు యుగాల తరబడి కూడా వెయిట్ చెయ్యగలిగేటంత గొప్ప 'ఇది' ప్రేమంటే.

అలాంటిది సుజీవన తనకోసం జస్ట్ ఓ థర్టీ నైన్ మినిట్స్ కూడా వెయిట్ చెయ్యలేక పోయిందంటే ఏమనుకోవాలామెని?

ఇది ఉత్తమ ప్రేమికురాలికుండాల్సిన లక్ష ణంకాదు. ఆమేగనక ఉత్తమ ప్రేమికురాల య్యుంటే తనకోసం కనీసం ఓ గంటైనా వెయిట్ చెయ్యకుండా ఎందుకు వెళ్ళిపో తుంది?

అసలింతకీ ఆమె వచ్చి వెళ్ళిపోయినట్టా? లేక అసలే రానట్టా?!

అసలే కొత్తప్రేమికుడేమో అలా తెగబోలె డు కన్‌ఫ్యూజ్ అయిపోయాడు సూరిబాబు.

ఒకవేళ తనలాగే అనివార్య కారణాలవల్ల ఆమెక్కూడా లేటయ్యుండొచ్చుగా? ఆమె కూడా ఇంకా రాకపోయి వుండొచ్చుగా?

అలా అనుకున్నాక గుండె కాస్త కుదుటప డినట్టుగా అనిపించి అక్కడే గడ్డిలో కాస్త శుభ్రంగా వున్న స్థలం చూసుకుని సెటిలైపో యాడు సూరిబాబు.

ఓ పది నిముషాలపాటు వచ్చేపోయే వాహనాల్నీ, దారెంటపోయే మనుషుల్ని చూ స్తూ విసుగు లేకుండానే గడిపేశాడు.

అయినా సుజీవన రాలేదు.

ఏదో బలీయమైన కారణంవల్ల లేట య్యుంటుంది. తప్పకుండా వచ్చేస్తుందిలే ఇంకో పదినిముషాల్లో అని సరిపెట్టుకుని

ఈసారి రోడ్డుమీంచి దృష్టి మరల్చి హు స్సేన్‌సాగర్‌కి అభిముఖంగా తిరిగి కమ్మీలు పట్టుకుని సాగర్‌లోకి చూస్తున్నవాళ్ళనీ, సిమెంట్ బెంచీలమీద కూర్చుని బుద్ధుని విగ్రహంకేసి చూస్తున్నవాళ్ళనీ, తనకుమల్లే గడ్డిలో కూర్చున్నవాళ్ళనీ చూస్తూ ఇంకో పదినిముషాలు కూడా ఏమంత విసుగు లేకుండానే గడిపేశాడు సూరిబాబు.

కానీ ఆ తర్వాతనుంచి మాత్రం అతనికి క్షణమొక యుగంలా అనిపించసాగింది.

అంటే అతన్లో విసుగు ప్రారంభమైందన్న మాట!

ఎంత ఫియాన్సీ కోసమైతే మాత్రం? విసుక్కోకుండా ఎదురుతెన్నుల్తో ఎంతసే పని వుండగలరు ఎవరైనా?

'ఆరు దాటినా ఇంకా రాలేదేంటి చెప్మా?'

'ఏమైందో ఈ మహాతల్లికి?' అనుకున్నా డు కోపంగా.

కానీ అంతలోనే ఆ కోపాన్ని తగ్గించేసుకు న్నాడు.

ఆమె ఇంకా రాలేదనే ఎందుకనుకోవాలి?

ఒకవేళ వచ్చి వెళ్లిపోయిందేమో?

ట్వంటీ మినిట్స్ వెయిట్ చేసేసరికి తనకే ఇంత చిర్రెత్తుకొస్తోందే, అలాంటిది ఫార్టీ మినిట్స్ ఆమె మాత్రం ఎలా వెయిట్ చెయ్య గలదు?

అందుకే వచ్చి ఓ అరగంట చూసి వెళ్ళిపోయిందేమో!

అలా అనుకుంటూంటే ఈసారతని కోపం కనకలింగం మీదకు మళ్ళింది.

వెధవకి ఆ కడుపునొప్పి సరిగ్గా అప్పుడే రావాలా?

వచ్చెను పో మాదీఫల రసాయనమో అంటూ అలా మెలికలు తిరిగిపోవడం దేని కి?

తిరిగెను ఫో... తీరా తెచ్చాక దాన్ని కాస్తా నేలపాలు చెయ్యడమేంటి?

ఆ దిక్కుమాలిన రసాయనం కోసం రెండోసారెళ్ళబట్టే ఇంత లేటైంది తనకి.





లేకపోతే తను సరిగ్గా టైం కొచ్చేసుండేవాడే!

అపుడీ కన్‌ఫ్యూజనంతా వుండేది కాదుగా?

లోలోన కనకలింగాన్ని బండబూతులు తిట్టుకుంటూ అతనింక లేవడానికుద్యుక్తుడౌతుండగా...

అటుగా వచ్చాడు "పల్లీలు సార్. పల్లీలు'' అంటూ ఓ పన్నెండేళ్ళ కుర్రాడు.

"ఏయ్ పల్లీలూ'' అన్నాడు సూరిబాబు ఆ కుర్రాడిని ఉద్దేశించి.

దాంతో వాడు సంతోషంగా బుట్టూపుకుంటూ చెంతకొచ్చి నిలబడ్డాడు.

"ఎన్నివ్వమంటారు సార్?"

"రెండ్రూపాయిలకివ్వు'' అంటూ వాడికోటూ రూపీస్ కాయినందించి వాడుపల్లీలు కొలిచి తన దోసిట్లో పోస్తుంటే "చూడు బాబూ'' అన్నాడు సూరిబాబు.

చూశాడు వాడు "ఏంటి సార్?" అంటూ.

"నువ్విక్కడ చాలా సేపట్నుంచి పల్లీలమ్ముతున్నావా?"

"అవున్సార్! మూడింటినుంచి అమ్ముతున్నాను''

"ఇంతకుముందు అంటే నేన్రాకముందు ఎవరైనా ఒకమ్మాయి ఇక్కడ చాలా సేపు వెయిట్ చేసి వెళ్ళిందా?"

పల్లీల పిల్లాడు బుర్ర గోక్కున్నాడు సూరిబాబు ప్రశ్నకి.

"ఆc... ఆc... గుర్తొచ్చింది సార్' అన్నాడు గోక్కోవడం అయ్యాక.

"ఏంటి?" సూరిబాబు కుతూహలంగా చూశాడు వాడివంక.

"ఒకమ్మాయొచ్చి ఇక్కడ కొంచెంసేపు కూర్చుంది సార్! ఆ అమ్మాయలా కాసేపు కూర్చున్నాక ఒక రంగురంగుల కారొచ్చి ఆగింది సార్! ఆ కార్లోంచి చెప్పలేనంత అందంగా వున్న ఇంకొకమ్మాయి దిగింది సార్! ఆ అమ్మాయెనక గళ్ళలుంగీలు కట్టుకుని సినిమాల్లో చూపిస్తారే అలాంటిద్దరు గూండాలు కూడా దిగేర్సార్! వాళ్లు ముగ్గురూ వెళ్ళి మొదటమ్మాయ్‌తో ఏదో మాట్లాడార్సార్! నేను పూర్తిగా విన్లేదు గానీ రెండో అమ్మాయి మొదటమ్మాయిని దేనికో భయపెట్టింది సార్! నీ ప్రాణాలు దక్కవ్ అదీ, ఇదీ అనింది సార్. అపుడా మొదటమ్మాయ్ ఒక ఆటోఎక్కి వెళ్లిపోయింది సార్! ఆ తర్వాత వాళ్ళు కూడా కార్లో ఎక్కి వెళ్లిపోయారు సార్' అంటూ కొద్దిసేపటిక్రితం తానక్కడ చూసిన దృశ్యాన్ని చెప్పగలిగినంత వివరంగా చెప్పాడు వాడు.

చాలా ఆశ్చర్యంగానూ, శ్రద్ధగానూ అదంతా ఆలకించిన సూరిబాబుకి ఆ మొదటమ్మాయి సుజీవననీ, ఆ రెండో అమ్మాయి ప్రహేళికనీ చాలా గట్టిగా అనిపించింది.

రెండో అమ్మాయి 'చెప్పలేనంత అందంగా వుందనీ, ఆమె రంగురంగుల కార్లోంచి దిగిందనీ అంటున్నాడు కాబట్టి సందేహం అక్కర్లేదు. ఆమె ఖచ్చితంగా ప్రహేళికే.

ఆమె మొదటమ్మాయిని బెదిరించిందని చెబుతున్నాడు కాబట్టి, ఆ మొదటమ్మాయి సుజీవనే అయ్యుండటానికి ఎంతైనా అవకాశం ఉంది.

కానీ ఆమె నిజంగానే సుజీవనో కాదో నిర్ధారించుకోవడం ఎలా?

సుజీవనకున్న ఏకైక కొండగుర్తు...?

గుర్తొచ్చింది సూరిబాబుకి.

దాంతో "ఆ మొదటమ్మాయికి పొడవాటి వాల్జడుందా? అంటే బాగా పొడుగ్గా వుండే జడన్నమాట- బాగా గుర్తుచేసుకుని చెప్పు" అనడిగాడు పల్లీల పిల్లాణ్ణి.

"ఆc ఆc అవున్సార్! ఆ అమ్మాయికి చాలా పొడుగు జడుంది. అచ్చొసి నేను రెండో మూడో సవరాలేసుకుందేమో అనుకున్నా కూడా! ఎందుకంటే మా అమ్మానాన్నా సవరాలల్లే పనేగదా చేస్తారు? అందుకే ఆ

అమ్మాయి జడ చూడగానే నాకు సవరాలు గుర్తొచ్చాయ్'' ఆమె జడని మనసులోకి తెచ్చుకుంటూ చాలా స్పష్టంగా చెప్పాడు వాడు.

దాంతో ఆమె సుజీవనే అని కన్‌ఫర్మ్ చేసేసుకున్నాడు సూరిబాబు. రంగురంగుల కార్లో వచ్చిన ఆ చెప్పలేనంత అందమైన అమ్మాయి ప్రహేళికేనని కూడా కన్‌ఫర్మ్ చేసేసుకున్నాడు.

ఇదేంటిలా జరిగింది?

ఆ భానుప్రకాశ్‌గారో, ప్రహేళికో రౌడీల చేత తనని తన్నిస్తారని కదా తామెక్స్‌పెక్ట్ చేస్తా? అలాంటి కథ ఇలాంటి మలుపు తిరిగిందేంటి?

అలా తెగ కన్‌ఫ్యూజైపోతూ మరో పదిని ముషాలక్కడే గడిపి పల్లీలన్నీ తినేయడం అయిపోయాక తానింకా అక్కడే ఉండటం చాలా సిల్లీగా వుందనిపించి మెల్లగా లేచి భారంగా ఓ నిట్టూర్పు విడిచి ఆ మీదట రూమోన్ముఖుడయ్యాడు సూరిబాబు.

★ ★ ★

బెదిరింపుకి భయపడిపోయి అదురుతున్న గుండెల్తో ఇల్లు చేరుకున్న సుజీవన...

ముందరి గదిలో వున్న పరమేశ్వరశాస్త్రిని చూసి 'ఎందుకు స్వామీ పదేపదే వచ్చి ఇలా ప్రాణాల్తీస్తావు?' అనుకుంది మనసులో

అతనొక ప్రొఫెషనల్ పెళ్ళిళ్ళ పేరయ్య.

అథమపక్షం నెలకి నాలుగైదు సార్లైనా వచ్చిపోతుంటాడు వీళ్ళింటికి. అదుగో అక్కడా సంబంధముంది, ఇక్కడీ సంబంధముందని చెప్పి సుజీవన అమ్మా నాన్నల్లో ఆశలు రేపుతూ ఉంటాడు.

వాళ్ళ దృష్టిలో సుజీవన తమ గుండెల మీదున్న ఓ పెద్ద కుంపటి. మిగతా నలుగురమ్మాయిలూ చిన్నకుంపట్లు.

ఎంత పేదవారికైనా ఎదిగిన ఆడపిల్లకి తమ కున్నంతలో ఏదో ఒక సంబంధం చూసి పెళ్లిచేసి పంపించేయాలనే ఉంటుంది కదా?

అందుకే పరమేశ్వరశాస్త్రి వచ్చినప్పుడల్లా ఇంటికెవరో ఆత్మీయుడొచ్చినట్టే సంబరపడిపోతుంటారు వాళ్ళిద్దరూ.

ఉన్నంతలో అతనికి మంచి కాఫీ టిఫినిచ్చి "ఊఁ చెప్పండి చెప్పం"డంటారు ఉత్సాహంగా.

పరమేశ్వరశాస్త్రి 'బ్రేవ్' మని తేన్చి చెబుతాడేదో ఓ సంబంధం గురించి.

"వాళ్ళెంతలో వున్నారు?" అనడుగుతాడు సుజీవన తండ్రి పెంచలయ్య.

"ఇంతలో' అని ఎంతోకొంత అమౌంట్ చెపుతాడు పరమేశ్వరశాస్త్రి.

"అబ్బో అంతా? అంతైతే నేనిచ్చుకోలేనండీ'' అంటాడు పెంచలయ్య. పరమేశ్వరశాస్త్రి చెప్పే అమౌంట్ ఎంతయినప్పటికీ మరీ తక్కువైనప్పటికీ కూడా పెంచలయ్య రివాజుగా అనేమాటమాత్రం ఇదే.

"మరెంతలో చూడమంటారు??" అంటాడు పరమేశ్వరశాస్త్రి.

'ఇంతలో' అని చెప్పడానికి అసలెంతో కొంత అమౌంట్ అంటూ ఉంటేకదా? ఉంటున్న ఇల్లమ్మేసి ఎంతో కొంతొస్తే దాన్నైదు వాటాలుగా విభజించి ఒక్కోవాటాతో ఒక్కో ఆడపిల్లకీ వరసగా పెళ్ళిళ్ళు చేసిపారెయ్యాలని అనుకుంటూ ఉంటాడు పెంచలయ్య.

కానీ ఒక్కోవాటాకీ ఎంతొస్తుందో తెలిసేది ఆ ఆలోచన్ని కార్యరూపంలో పెట్టినప్పుడు గదా?

పాతకాలపు పెంకుటిల్లు. అవసరం తమది గనక అమ్మడం అంటూ జరిగితే చెడే అమ్మాలి. మహా అయితే లక్షొచ్చేను. లేదా లక్షంబాతికొచ్చేను. ఈ రోజుల్లో ఆ అమౌంట్‌తో అయిదుగురాడపిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యడం అంటే జరిగేపనేనా?

అలాగని చేతులు ముడుచుక్కూర్చోలేడు గదా?

అందుకే తన ప్రయత్నాలేవో తాను చేస్తూనే ఉంటాడు పెంచలయ్య.





"ఇల్లమ్ముతాను. మంచి బేరమేదైనా ఉంటే చూసిపెట్టండి'' అని కనిపించిన వాళ్ళందరితోనూ చెబుతూ ఉంటాడు.

వాళ్ళల్లో కొందరు ఎవరో ఒకర్ని తీసుకొస్తూ వుంటారు.

అరవైవేల్తో స్టార్ట్ చేసి లక్షదగ్గర ఆగిపోతూ వుంటారందరూ- ఆ గీత దాటడం మహాపాపమన్నట్టు.

"ఎందుకయ్యా తొందరపడతావు? నియర్ ఫ్యూచర్‌లో ఇక్కడ నాలుగైదు ఫ్యాక్టరీలు పడబోతున్నాయ్. అప్పుడీ ఏరియా అంతా బాగా డెవలప్ అవుద్ది. సిటీ రోజురోజుకీ ఎలా పెరిగిపోతోందో చూస్తూనే ఉన్నావ్‌గా? శివార్లు శివార్లుగా మిగిలిపోవడంలేదు. సిటీలో కలిసిపోతున్నాయి. కొన్నాళ్లోపిక పట్టు. లక్షేంఖర్మ, కళ్లకద్దుకుని మరీ అయిదారు లక్షలిస్తారెవరైనా'' అంటూ వారిస్తూ వుంటారు అతని శ్రేయోభిలాషులందరూ.

దాంతో ఇల్లమ్మే కార్యక్రమాన్ని ఎప్పటికప్పుడు వాయిదా వేసేస్తూంటాడు పెంచలయ్య.

అందుకే పరమేశ్వరశాస్త్రి అలా అడిగితే "ఫలానా అంతలో'' అని ఏనాడూ స్పష్టంగా చెప్పడు పెంచలయ్య.

"కాస్త తక్కువలో చూడండి. నా పరిస్థితి మీకు తెలుసుగా?" అని నసిగేస్తుంటాడు.

దాంతో పరమేశ్వరశాస్త్రి "సరేలెండి. కాస్త తక్కువలో ఇంకో సంబంధమేదైనా తటస్థపడితే మళ్ళీ వచ్చి కలుస్తాను'' అనేసి వెళ్ళిపోతుంటాడు.

వెళ్ళిన వారానికో, పదిరోజులకో అతను మళ్లీ ప్రత్యక్షమవుతాడు.

కానీ అప్పుడు కూడా మళ్ళీ జరిగేదిదే!

అందుకే పరమేశ్వరశాస్త్రిని చూసినప్పుడల్లా ఒళ్లు చిరచిరలాడిపోతూ వుంటుంది సుజీవనకి.

అతగాడు తెచ్చే సంబంధాలు కుదిరేవా? చచ్చేవా? ఆపాటిదానికి నెలకి నాలుగైదు సార్లొచ్చి ఆ కాఫీ, టిఫిన్లు మెక్కి పోవడందేనికి?

అసలు అతగాడు వచ్చేది ఆ కాఫీ, టిఫిన్లు కోసమేనేమోనని ఆమెకు లోలోపల ఓ చిన్న అనుమానం.

అందుకే 'వచ్చావా నాయనా మెక్కటానికి?' అన్నట్టుగా పరమేశ్వరశాస్త్రికేసి ఓ చూపు చూసి సుజీవన విసురుగా లోపలికెళ్ళిపోయింది.

"అమ్మాయి ఎక్కణ్ణుంచొస్తోంది?" పరమేశ్వరశాస్త్రి పెంచలయ్యనడిగాడు.

"టైలరింగ్ సెంటర్నుండి అనుకుంటా'' చెప్పి 'ఏమే అంతే కదూ?' అన్నట్టుగా భార్య భారతికేసి చూశాడు పెంచలయ్య.

"అవునండీ టైలరింగ్ సెంటర్ నుంచే! ఇంట్లో వుంటే తోచుబాటవ్వదని సాయంత్రం పూటలా వెళ్లొస్తుంటుంది. అన్నట్టమ్మాయికి కుట్టుపనంతా బాగా వచ్చేసింది. ఈసారేదయినా సంబంధం చూసినప్పుడు ఈ విషయాన్ని కూడా దృష్టిలో పెట్టుకోండి'' అంది భారతి.

"అంటే టైలర్ సంబంధం చూడమనా ఏంటమ్మా నీ ఉద్దేశం?" అంటూ జోక్ చేశాడు పరమేశ్వరశాస్త్రి.

"టైలరైతే మాత్రం తప్పేమిటండీ! భార్యని పోషించగలిగేవాడయ్యుండాలే గానీ ఎవరైనా ఒకటే'' అంది భారతి.

లోపల్నుంచి ఈ సంభాషణంతా ఆలకిస్తూ వున్న సుజీవన "అలాగైతే బిచ్చగాడు కూడా ఎలాగోలా తన భార్యని పోషించుకోగలుగుతాడు. అలాగని నన్నే బిచ్చగాడికో అంటగట్టేస్తారా ఏమిటి?" అనుకుంది మనసులో కోపంగా.

పరమేశ్వరశాస్త్రి సంబంధం చూడ్డం- వాళ్లడిగే కట్నం తండ్రికి ఒప్పుకోబుల్‌గా అనిపించడం, దరిమిలా ఆయన ఇల్లు అమ్మి తనకి పెళ్లిచెయ్యడం ఇవన్నీ ఇప్పట్లో జరిగే పనులు కావని తెలుసు కాబట్టే...

అసలెప్పటికీ జరగవేమోనని అనిపించ

బట్టే...

ఆమె అలా సూరిబాబు కరపత్రానికి రెస్పాండై కథానాయకిగా మారిపోయి కూర్చుంది.

కానీ దరిద్రుడి పెళ్లికి వడగళ్ల వాన అన్నట్టు మధ్యలో ఈ ఆడవిలనొకర్తి దాపురించిందే?

ముందరిగదిలో అమ్మా నాన్నలింకా ఆ పరమేశ్వరశాస్త్రితో కబుర్లాడుతూ కూర్చుంటే సుజీవన మట్టుకు తాను డ్రెస్ ఛేంజ్ చేసుకుని మంచమెక్కేసి ప్రహేళిక గురించే ఆలోచిస్తూ ఉండిపోయింది.

తగుదునమ్మా అంటూ ఆ పిల్ల అలా కిరాయిగూండాల్ని వెంటేసుక్కొచ్చిందీ అంటే ఆ అమ్మాయిని తక్కువగా అంచనా వెయ్యడానికి వీల్లేదు.

కోటీశ్వరుడి కూతురు కాబట్టి నడిబజార్లో హత్య చేయించినా కూడా లేదూ స్వయంగా తానే చేసినా కూడా చట్టం చేతిలో చిక్కకుండా తప్పించుకోగలుగుతుంది.

ఎన్ని సినిమాల్లో చూడ్డంలేదు? ఎన్ని నవలల్లో చదవడంలేదు? డబ్బున్నవాళ్ళు ఏమైనా చెయ్యగలరీ సమాజంలో.

"మరోసారి గనక ఆ సూరిబాబుని కలిసే ప్రయత్నం చేస్తే నీ ప్రాణాలు దక్కవ్' అని అంత ఇదిగా బెదిరించిందీ అంటే దాన్నిబట్టే తెలిసిపోతూ వుంది, ఆమె ఎంత తెగించిన మనిషో.

అలాంటి మనిషితో విరోధం పెట్టుకోవడం అంటే కొండని ఢీ కొట్టడంతో సమానం.

కొండతో ఢీకొంటే ఎంతవారికైనా తల పగుల్తుందే తప్ప అంతకన్నా ఏం ఒరుగుతుంది?

బతికి బాగా వుంటే ఆ సూరిబాబు కాకుంటే ఇంకో హరిబాబు లేదా గిరిబాబు. ఎవడో ఒకడైతే దొరక్కపోడుగదా?





ప్రాణభయంతో తీరా అలా అనేసుకున్నాక అప్పుడనిపించింది సుజీవనకు, తన ఆలోచన చాలా ఘోరంగా ఉందని.

పాపమా సూరిబాబు ఇచ్చిన మాటకు కట్టుబడి తన కోసం ఆ ప్రహేళికని వదిలేసుకున్నాడు. మెండుగా డబ్బున్న దండిగా అందం వున్న ఆమెని కాదని నిండుమనసుతో తననే ప్రేమించడానికి సిద్ధపడ్డాడు. అంతేకాకుండా కేవలం తన కారణంగా ఆ గూండాలచేతిలో తన్నులు తిని ప్రస్తుతం ఏ హాస్పిటల్లో వున్నాడో ఏమో?

అలాంటి ప్రేమమూర్తి కలిగిన యువకుడి కోసం ప్రాణాలర్పిస్తే మాత్రం తప్పేంటి?

ఆఫ్టరాల్ ఈ అల్పప్రాణాలు ఇవ్వాళుండి రేపు పోతాయ్. అలాంటివాటి కోసం సూరిబాబుకి వెన్నలాంటి మనసున్న సూరిబాబుకి, వెన్నెల్లాంటి మనసున్న సూరిబాబుకి దూరమైపోవాలనుకోవడం ఎంత అర్థరహితం?

సో అలా జరగటానికి వీల్లేదు.

ఆరునూరైనా నూరారైనా సూరిబాబుని తానొదులుకోకూడదు.

కోటి రూపాయలిచ్చినా సరే అతని హృదయాన్ని నీకివ్వనని ప్రహేళికతో ఛాలెంజ్ చేసిన తను ఓటి కుండలాంటి ప్రాణం కోసం అతన్నొదిలేసుకోవాలనుకోవడం హవ్వ ఎంత సిగ్గుచేటు?

ఎంత డబ్బుంటే మాత్రం ఆ ప్రహేళిక కూడా తనలా ఓ ఆడదే!

సాటి ఆడదాని బెదిరింపుకు జడిసిపోయి మేటి ప్రేమికుణ్ణి వదిలేసుకోవడం అంటే అంతకన్నా పిరికితనం ఇంకేవన్నా వుంటుందా?

ఆలోచనలలా సక్రమపంథాలోకి మళ్ళడంతో ఆమె మనసులో సూరిబాబు రూపం మెదిలింది.

అంటే నిన్న చూసిన సూరిబాబు రూపం కాదు.

ఒక కన్ను ఉబ్బిపోయి ముక్కు వాచిపోయి ముఖంనిండా ప్లాస్టర్ అంటించుకుని

ఒక కాలికీ చేతికీ సిమెంట్ కట్లతో హాస్పిటల్లో మంచంమీద మూలుగుతూ ఉన్న సూరిబాబు రూపం.

ఇందాక ప్రహేళిక అన్న మాటల్ని బట్టి ప్రస్తుతం అతగాడి పరిస్థితి అలా ఉండుంటుందని అనిపించిందామెకు.

ప్రియుణ్ణి అలాంటి ఘోరమైనస్థితిలో ఊహించుకున్నప్పుడు ఏ ప్రేయసి హృదయం మాత్రం కలత చెందకుండా వుంటుంది?

సహజంగానే సుజీవన మనసు కూడా కలత చెందింది.

సూరిబాబెక్కడున్నాడో తెలుసుకుని అప్పటికప్పుడే వెళ్ళి అతన్ని అర్జంటుగా పరామర్శించి రావాలన్నంత ఆరాటం కలిగిందామె మనసులో.

కానీ అది సాధ్యంకాదని తెలుసు కాబట్టి, ఇంత పొద్దుపోయాక ఏ వంకతోనూ తాను బయటకు వెళ్లగలగడం అసాధ్యమేనని తెలుసు కాబట్టి ఎలాగో మనసు నదుపులో పెట్టుకుంది.

'రేపు మాత్రం ఆ ప్రహేళిక బోడి బెదిరింపుల్ని లెక్కచెయ్యకుండా ఎలాగైనా సరే అతన్ని కలిసి తీరాలి'

మనసులో ఆమె అలా అనుకుంటూ వుండగా "ఏంటే ఇవ్వాళ అదోలా వున్నావ్?" అంటూ ఆ గదిలో కొచ్చింది భారతి.

"ఏంలేదు'' అంటూ పెదవి విరిచేసి "పీకల మొయ్యా మెక్కి వెళ్ళిపోయాడా ఆ పేరయ్యగాడు?" అంటూ లేచి కూర్చుంది సుజీవన.

"చఛ... అవ్వేం మాటలే. అక్కడికాయనేదో తిండికి వాచిపోయి వస్తున్నట్టు?" మందలింపుగా అంది భారతి.

"ఎందుకొచ్చినా మనకి మాత్రం ఎంతో కొంత దండగేకదా?"

"ఏమిటే దండగ? పాపం మనం ఆయనకేమిస్తున్నామని ఏదో ఇంత కాఫీ, టిఫినూ అంతేగా? పాపమాయన మంచివాడు కాబట్టి, మన పరిస్థితి తెలిసున్నవాడు కాబట్టి ఎంతో ఓపిగ్గా అన్ని సంబంధాలు చూస్తున్నాడు'' తల్లి కాస్త కోపంగా అలా అంటుంటే.

"ఇకనుంచి ఆయనకా శ్రమక్కర్లేదులే' అనాలపించింది సుజీవనకు.

అయినా నాలుక నదుపులో పెట్టుకుంది.

సూరిబాబు సంగతి ఇప్పుడప్పుడే ఇంట్లో చెప్పడందేనికి? కథ ఇప్పుడేగా మొదలయ్యింది? అదీగాక సూరిబాబు అర్జంటుగా పెళ్ళి చేసేసుకునే ఆలోచనలో అయితే లేదు గదా?

కొన్నాళ్ళు ప్రేమించుకున్నాక ఆ తర్వాత పెళ్లి. అదికదా అతని కండిషను?

సో- ఇప్పుడప్పుడే అతన్ని గురించి చెప్పడం, కోరి కొరివితో తల గోక్కున్నట్టే అవుతుంది.

ఎవడా సూరిబాబు? ఏమా కథ? వాడికి మతి లేకపోతే నీకు లేదా?లాంటి సవాలక్ష ప్రశ్నల్ని ఎదుర్కోవాల్సివస్తుంది.

తానంటే అతని ప్రేమార్తిని అర్థం చేసుకోగలిగింది. కానీ అమ్మా నాన్నా అర్థం చేసుకోవాలనేముంది?

అందుకే "అవునవును పాపం చాలా మంచివారు పేరయ్యగారు'' అనేసి ఆ మీదట సైలెంటైపోయింది.

★ ★ ★

"ఎట్టెట్టా?" అన్నాడు కనకలింగం బోలెడంత ఆశ్చర్యంగా.

అదంతా తెచ్చుకోలు ఆశ్చర్యమని సూరిబాబుకేం తెలుసు?

"అవున్నా! ఆ పల్లీల కుర్రాడు చెప్పినదాన్ని బట్టి నాకు సీనంతా అర్థమైపోయింది. ఆ అహంకారి ఐమీన్ ఆ ప్రహేళిక నేను తనని కాదన్నానన్న కుళ్ళుకొద్దీ మా ప్రేమని నాశనం చెయ్యడానికి ఎంత ఎత్తువేసిందో చూశావా?" అన్నాడు అమాయకంగా.

"నా బొంద. వాళ్ళిద్దరూ సుజీవనా, ప్ర

హేళికలేనని ఎందుకనుకోవాలి? వేరే ఇంకె వరో అయ్యుండొచ్చుగా'' అన్నాడు కనక లింగం.

ప్రహేళికమీద సూరిబాబుకి మరింత చెడ్డ భిప్రాయం ఏర్పడకూడదన్నది అతగాడి తా పత్రయం. అందుకే మిత్రుడి మనసునలా డైవర్ట్ చెయ్యడానికి ప్రయత్నించాడు.

సుజీవనతో వ్యవహారం చెడిపోయి సూరి బాబు మనసు ప్రహేళికమీదకు మళ్లితే వాళ్ళి ద్దరూ ఒకటైతే అతని జీవితం బావుంటుంది కదా?

భానుప్రకాశ్‌గారిలాంటి కోటీశ్వరుడికి ఏకైక అల్లుడు కావడమంటే నిజంగా అది ఎంతదృష్టం?

సూరిబాబు మూర్ఖుడు కాబట్టి ఈ నగ్నస త్యం గ్రహించలేకపోతున్నాడంతే.

కనకలింగం ఓ స్నేహితుడిగా, శ్రేయోభిలా షిగా అలా అనుకొని అలా అన్నప్పటికీ...

అసలు సంగతి తెలియని సూరిబాబు "అబ్బే లేదురా. వాళ్ళిద్దరూ ఇంకెవరో అయ్యుండటానికి ఆస్కారమే లేదు. ఎందు కంటే ఆ పల్లీల కుర్రాడు చెప్పిన పోలికలన్నీ ఎగ్జాక్ట్‌గా వాళ్ళిద్దరికీ సరిపోయాయి. ఇదంతా ఆ ప్రహేళిక పన్నిన కుట్రే'' అన్నా డు మరింత అమాయకంగా.



"నా బొంద. పోనీ నువ్వన్నదే కరెక్ట్ అనుకుందాం. నీ ఫియాన్సీని ఆ ప్రహేళిక అలా రౌడీల్ని వెంటేసుకొచ్చి బెదిరించింద నుకుందాం. అంత మాత్రానికే ఆమె బెదిరి పోయి వెళ్ళిపోయిందంటే ఆమెకు నిజంగా నీమీద ప్రేమున్నట్లు కాదుగదా? ప్రియుడి కోసం ప్రాణాలైనా అర్పించగలిగేదే నిజమైన ప్రేయసి. అదే నిజమైన ప్రేమంటే. కాబట్టి ఏమర్థమవుతోంది? ఏదో పేదింటిపిల్ల కాబట్టి దీనివల్ల ఓ రాయి విసిరిచూద్దాం అన్నట్టుగా ఆమె నిన్నెప్రోచ్ అయ్యిందే తప్ప ఆమెకి నిజంగా ప్రేమించగలిగే హృదయం లేదన్న మాట! నువ్వేమో అజీర్తిలాంటి ప్రేమార్తితో బాధపడుతున్న ప్రేమమూర్తివికదా? అలాంటి మనసులేని మనిషిని ప్రేమించ టంవల్ల నీ ప్రేమదాహం ఎలా చల్లార్తుంది చెప్పు?" సుజీవన మీద మిత్రుడి మనసు విరిచేయడానికి ప్రయత్నిస్తూ అన్నాడు కనక లింగం.

కానీ అతనూహించినట్టు సూరిబాబు మనసేం విరిగిపోలేదు.

"అదేంమాట? ప్రాణభీతి అనేది ఎవరికై నా వుంటుంది. అందునా సుజీవన ఆడపిల్లా యె. ఈ రౌడీరాణిగారు ఇద్దరు గూండాలను వెంటేసుకువేళ్తే సుజీవనే అనేముందీ ఆమె స్థానంలో ఎవరున్నాసరే బెదిరిపోయి వెళ్ళి పోతారు. లేడీ అమితాబ్ విజయశాంతిలా 'డిష్యూం డిష్యూం' అని ఫైట్ చేసి ఎలాంటి గూండాలనైనా చితక తన్నేయటం సాధారణ ఆడపిల్లలవల్ల అయ్యేపనా? నువ్వన్నట్టు సు జీవనది ప్రేమించలేని హృదయమే అయితే కేవలం పేదరికం కారణంగానే నన్నెప్రోచ్ అయ్యుంటే ఆ ప్రహేళిక నా హృదయానికి వెలకట్టినప్పుడే ఎంతోకొంత అడిగి తీసుకుని వెళ్ళిపోయుండేదేగదా?" అంటూ ఆమెనే సపోర్ట్ చేస్తూ మాట్లాడాడు.

మోస్ట్ రీజనబుల్‌గా వున్న మిత్రుడి మాట ల్ని ఎలా ఖండించాలో కనకలింగానికి అర్థం కాలేదు.

అందుకే అనివార్యంగా అతను కొద్దిక్షణా లు గ్యాప్ తీసుకున్నాడు.

మనసులో మాటల్ని పేర్చుకోవడానికి వ్యవధి కావాలిగా మరి?

"నువ్వన్నది ఒకరకంగా రైటే. కానీ నువ్ కేవలం ఆ సుజీవన వైపునుండే ఆలోచిస్తు న్నావ్. ఒక్కసారి ప్రహేళికవైపునుండి కూడా ఆలోచించి చూడు. గూండాల్ని వెంటేసుక్కొ చ్చింది కదాని 'ఆడరౌడీ' అని చాలా తేలిగ్గా అనేశావ్. కానీ ఒక ఆడపిల్ల అంత సాహసా నికి ఒడిగట్టింది అంటే దాని వెనక ఎంత ప్రేమున్నట్టు? ఎలాగైనాసరే నిన్ను సొంతం చేసుకోవాలన్న తాపత్రయం ఆమెలోనూ వుండబట్టేగదా అంత దుస్సాహసానికి పూనుకుంట?" అన్నాడు మాటలు కూడగట్టు కోవడం అయ్యాక.

అయినా అతని ప్రయత్నం వృధానే అయ్యింది.

"నీ మొహం. దాన్ని ప్రేమనరు. పొగ రంటారు. అహంకారం అంటారు'' అనేశా డు సూరిబాబు అసహనంగా ముఖం చిట్లి స్తూ.

"అహంకారం పాలు కొంత వుండే వుండొ చ్చు. కానీ తను కూడా నిన్ను అమితంగా ఇష్టపడుతుండబట్టేగా అలా చేస్తే?" కనక లింగం నిరుత్సాహపడిపోకుండా మిత్రుడి మనసుని మౌల్డ్ చేయడానికి, అతనిలో ప్ర హేళికపట్ల సదభిప్రాయాన్ని కలిగించటానికి మరోసారి ప్రయత్నించాడు.

అయినా ఫలితం లేకపోయింది.

"నాన్సెన్స్'' అంటూ కొట్టిపారేశాడు సూ రిబాబు నిర్ద్వంద్వంగా.

ప్రహేళిక వేసింది నిజంగా రాంగ్‌స్టెప్పే కాబట్టి ఆ పరిస్థితిలో ఇంకేం చెప్పినా కూడా సూరిబాబు కన్విన్స్ అవ్వడనిపించి కనక లింగం మరేం మాట్లాడలేదు.

★ ★ ★

"ఎక్కడికే ఇంత పొద్దున్నే బయల్దేరావ్?"

ఉదయం ఎనిమిదింటికి సుజీవన ఎక్క




డికో వెళ్ళడానికి ఉద్యుక్తురాలవుతూండటం చూసి కాస్త ఆశ్చర్యంగా అడిగింది భారతి.

ఆ ప్రశ్న ఎదురవుతుందని తెలిసి ముందుగానే మనసులో ఓ ఆన్సర్‌ని సిద్ధం చేసి వుంచుకుంది సుజీవన.

అందుకే తడబడాల్సిన అవసరం ఆమెకు లేకపోయింది.

"మాలతీ వాళ్లింటికమ్మా'' అంది చెప్పుల్లో కాళ్లు దూరుస్తూ.

"ఇంత పొద్దున్నే?"

"ఇవ్వాళ సాయంత్రం వాళ్ళక్కయ్యకు పెళ్లిచూపులట. పిండివంటలూ అవీ చెయ్యాలి కాస్త సాయానికి రావే అని నిన్న సాయంత్రమే చెప్పింది'' సిద్ధంగా వున్న జవాబే కాబట్టి ఠక్కున చెప్పేసింది సుజీవన.

మాలతీ వాళ్ళ అక్కయ్యకి ఇవ్వాళ సాయంత్రం పెళ్లి చూపులన్నది నిజం. కానీ ఆమె ఈమెని సాయానికి రమ్మన్నది మాత్రం అబద్ధం.

ఒకానొక సూరిబాబుని చూడ్డానికి వెళ్తున్నానని తల్లితో ఎలా చెప్పగలదు?

అందుకే అలా అబద్ధమాడేసింది సుజీవన.

"అలాగా! అయినా పెళ్లి చూపులకు పిండి వంటలేంటే? కాస్త స్వీటూ, హాటూ బయట నుంచి తెప్పిస్తే పోయేదానికి?" అంది భారతి.

"ఏమో మరి..." అంటూ నవ్వేసి "మరి నేను వెళ్లి రానా? మధ్యాహ్నానికల్లా వచ్చేస్తాలే. ఒకవేళ రావడం కాస్త లేటయినా గాభరా పడకు. వాళ్లు భోంచేసి వెళ్లమని బలవంతం చేస్తారేమో'' ఎందుకైనా మంచిదని ఓ మాట ముందుగానే వేసింది సుజీవన.

సూరిబాబు ప్రస్తుతం ఎక్కడున్నాడో ఎలాంటి స్థితిలో వున్నాడో? తెలీదుగదా? ఒకవేళ ఏకారణం వల్లైనా అతన్ని కలుసుకోవడానికి లేటయితే అన్న ముందుచూపు ఆమెతో అలా మాట్లాడించింది.

మాలతి అనే అమ్మాయి టైలరింగ్ సెంటర్లో సుజీవనకు స్నేహితురాలన్నది మాత్రమే తెలుసు భారతికి.

వాళ్ల ఇల్లు ఫలానా చోట అనిగానీ, ఆమెకో అక్కయ్యుందనిగానీ ఇత్యాది ఇతర వివరాలేమీ తెలియవామెకు. అసలందుకే సుజీవన తల్లితో చెప్పేందుకు ఆ కారణాన్ని ఎన్నుకుంది.

సూరిబాబు వద్ద ఒకవేళ తను చాలా సేపు ఉండాల్సివస్తే మాలతివాళ్ల ఇల్లు తల్లికి తెలీదు కాబట్టి తనని వెతుక్కుంటూ రావడం అనే ప్రశ్న ఉండదుగదా!

తల్లికేకాదు, చెల్లెళ్లక్కూడా మాలతి వాళ్ల ఇల్లు తెలియదు. అందుచేత వాళ్లని పంపించడం అనేది కూడా జరగదు.

ఇల్లైతే తెలీదుగానీ మాలతి మాత్రం తమ ఇంట్లోని ప్రతి ఒక్కరికీ తెలుసు. రెండు మూడు సార్లు తనతోపాటు తమ ఇంటికొచ్చిందామె.

సుజీవన స్వతహాగా చాలా బుద్ధిమంతురాలు.

అంతకుముందెప్పుడూ ఆమె గాడితప్పి ప్రవర్తించిన సందర్భాలేంలేవు.

అందుకే ఆమెనిపుడు వారించాల్సినంత అవసరమేం కన్పించలేదు భారతికి.

"సరే వెళ్లిరా'' అనేసింది.

సుజీవన గడపదాటి పోతుండగా "అక్కా నేనూ వస్తానే'' అంటూ వెంటపడబోయింది మూడో చెల్లెలు మాధవి.

"నువ్వెందుకే... వాళ్లేమైనా అనుకుంటారు'' అని తల్లే మందలించడంతో ఆ అమ్మాయి ఆగిపోయింది.

సుజీవనేమో సూరిబాబుని వెతుక్కుంటూ సాగిపోయింది. ఏ హాస్పిటల్లో వున్నాడో?

ఏ స్థితిలో వున్నాడో?

మాట్లాడగలిగే స్థితిలో వున్నాడో లేదో?

కనీసం మనుషుల్ని గుర్తుపట్టగలిగే స్థితి లోనైనా వున్నాడో లేదో?

దారి పొడుగూతా అతన్ని గురించి ఇలా ఆందోళన చెందుతూనే సూరిబాబు రూమ్‌కి చేరుకుంది సుజీవన.

సూరిబాబు రూంలో వుంటాడని కాక అక్కడికి వెళ్తే అతనే హాస్పిటల్లో వున్నాడో తెలుస్తుంది కదాని వెళ్లిందామె.

కానీ తీరా ఆమె వెళ్లేసరికి సూరిబాబు సలక్షణంగా రూంలోనే వున్నాడు. బూట్లకి పాలిష్ చేస్తూ వున్నాడు.

"మీరా... సారీ నువ్వా సుజీవనా?" అన్నాడామెని చూస్తూనే ఆశ్చర్యంగా.

"అరెఁ మీకు దెబ్బలేం తగల్లేదా?" అంది సుజీవన లోపలికొస్తూ.

"నాకు... దెబ్బలా?"

"అవును ఆ ప్రహేళిక రౌడీల్ని పంపించిందికదా?" ఖాళీగా వున్న ఓ కుర్చీలో కూర్చుంటూ అంది సుజీవన.

సూరిబాబు ఆశ్చర్యంగా చూశాడామె దిక్కు.

"ఆమె నా మీదకు రౌడీల్ని పంపించిందా?"

"అవును సూరిగారూ... ఆ సంగతి ఆవిడే నాతో స్వయంగా చెప్పింది..." అని ప్రారంభించి అతనికి విషయమంతా విడమరిచి చెప్పింది సుజీవన.

"చాలా ప్రమాదకరమైన మనిషిలా ఉందే?" అన్నాడు సూరిబాబు.

అవునన్నట్లుగా తలాడించింది సుజీవన.

"సో... ఆమె మనిద్దర్నీ విడదియ్యటానికి తన శక్తి యుక్తులన్నిట్నీ ఒడ్డబోతోందన్న మాట! ఇక నుంచి మనం చాలా జాగ్రత్తగా వుండాలి'' అన్నాడు సూరిబాబు.

"అవునవు''నంటూ అతన్తో ఏకీభవించింది సుజీవన.

"ఇంతకీ నువ్విప్పుడేం చెయ్యాలనుకుంటున్నావు?"

"అంటే?"

"అదే. ఆమె చంపుతానని బెదిరించిందంటున్నావు కదా! నాతో ప్రేమ మానేస్తావా, కొనసాగిస్తావా?" అడిగేసిన తర్వాత అనిపించింది సూరిబాబుకి అలా అడక్కుండా ఉండాల్సిందని.

అతనూహించినట్టే ఆమె ముఖం వివర్ణమయ్యింది.

"నేనంత పిరికిదాన్నే అయితే మళ్లీ ఇలా ఎందుకొస్తాను?"

ఆమె తీక్షణంగా చూసేసరికి "సారీ'' అన్నాడు సూరిబాబు.

చప్పున "పర్లేదులెండి'' అంది సుజీవన సర్దుకుంటూ.

"ఏం చెయ్యాలో పాలుపోక, ఆమె దగ్గరికెళ్లి దులిపేద్దామా అన్న ఉద్దేశంతో బయల్దేరబోతున్నాను. ఇంతలో నువ్వే వచ్చావు'' అన్నాడు సూరిబాబు తళతళా మెరుస్తోన్న బూట్లని ఓ పక్కకి నెట్టేసి చేతులు దులుపుకుంటూ.

"ఆమెని దులిపేసి రావడం ఏంటి? అయితే నేను చెప్పకముందే మీకిదంతా తెలుసా?" అంది సుజీవన ఆశ్చర్యంగా.

"పూర్తిగా కాదుగానీ కొంత తెలుసు'' అంటూ పల్లీల కుర్రాడిద్వారా తాను విషయాన్ని రాబట్టిన వైనాన్ని ఆమెకు వివరించాడు సూరిబాబు. "ఆమె మన మీద పగబట్టిందని తెలిసిపోతోంది కాబట్టి ఇకనుంచి మనం బహిరంగంగా ప్రేమించుకోవటానికి కుదరదేమో'' అన్నాడు ఆ తర్వాత.

"అంటే?" అంది సుజీవన.

"ఐ మీన్ మనం బహిరంగ ప్రదేశాల్లో కలుసుకోవడానికి వీలవ్వకపోవచ్చు..."

"అయితే ఆమెకు భయపడి ప్రేమించుకోవటం మానెయ్యాలా?"

అనేశాక సిగ్గుముంచుకొచ్చింది సుజీవనకి.

ఎర్రబారిన ఆమె బుగ్గలకేసి ఆరాధనగా




చూస్తూ "అహ నా ఉద్దేశం అదికాదు. మన జాగ్రత్తలో మనముండాలంటున్నానంతే" అన్నాడు సూరిబాబు.

"మరైతే మనం ఎక్కడ ప్రేమించుకోవాలి?" అనాలోచితంగా అనేసింది సుజీవన.

'అసలు ప్రేమించుకోవడం అంటే ఏమిటి?' సూరిబాబు మనసులో మళ్లీ తలెత్తిందా ప్రశ్న.

"ఇలా అప్పుడప్పుడూ నువ్వే నా రూమ్ కొస్తూండు'' అన్నాడామె ప్రశ్నకు జవాబుగా

"వచ్చి?"

"ఏముందీ ఇలాగే కబుర్లు చెప్పుకుంటూ ఉందాం..."

"కబుర్లు చెప్పుకోవడమేనా ప్రేమంటే?"

సుజీవన ప్రశ్నకు సూరిబాబు ఇరకాటంలో పడ్డాడు.

'ఓరి దేవుడోయ్! ఇదేంటిది? ప్రేమార్తితో కొన్ని సంవత్సరాలపాటు అల్లాడిపోయిన తనకి ప్రేమించుకోవడం అంటే తెలీకపోవడం ఏంటి?'

"అహ... అహఁహఁ..." తెగబోలెడు కన్ఫ్యూజైపోతూ అన్నాడు.

"మరి?" అంటూ నవ్వింది సుజీవన.

"నువ్ నన్ను చాలా ఇబ్బంది పెట్టేస్తున్నావ్. సుజీవనా! ప్రేమించుకోవడం అంటే అప్పుడే ఏం తెలుస్తుంది? కొన్నాళ్లు ప్రేమించుకున్నాక అనుభవం మీద తెలుస్తుంది'' అన్నాడు అసలే కన్ఫ్యూజన్‌లో వున్న సూరిబాబు మరింత కన్ఫ్యూజైపోతూ.

"కొన్నాళ్లు ప్రేమించుకోవాలన్నా ముందసలు ప్రేమంటే ఏమిటో తెలియాలికదా?" నవ్వును కంటిన్యూ చేస్తూ అడిగింది సుజీవన.

దాంతో సూరిబాబు మరింత కన్ఫ్యూజై జుట్టు పీక్కున్నాడు.

సుజీవన ఫకాల్న నవ్వేసింది.

"ఒద్దులెండి... ప్రేమంటే ఏమిటో చెప్పమని అడగన్లెండి... ఇంక ఆపెయ్యండి''

ఆమె అలా అభయమిచ్చాక సూరిబాబు కాస్త కుదుటపడ్డాడు. దట్స్ గుడ్ అన్నట్టుగా నవ్వి, "ఏదైనా మాట్లాడు సుజీవనా'' అన్నాడు.

"మాటాడుతూనే ఉన్నాగా?" అంటూ కళ్లెగరేసింది సుజీవన.

'అవును మాట్లాడుతూనే ఉన్నదిగా?' అలా అనుకుంటుంటే 'అయ్యబాబోయ్ ప్రేమించటం అనేది చాలా కష్టమే!' అనిపించింది సూరిబాబుకి.

అంతలో సుజీవన అంది, "అప్పుడప్పుడు ఇలా మీ రూమ్‌కి రావటానికి నాకేం అభ్యంతరం లేదు. కానీ ఇంత చేసిన ఆ ప్రహేళిక ఇంతటితో వదిలేస్తుందంటారా? మన మీద నిఘా వేసే వుంచుతుంది. సో... నేనిక్కడికి రావటం కూడా ప్రమాదమే''

'అవునుస్మా!' అనుకున్నాడు సూరిబాబు.

"మరైతే ఎలా?" అన్నాడు గడ్డం కింద గీరుకుంటూ.

"మీరు నా మాట వింటానంటే ఓ సలహా చెబుతాను'' అంది సుజీవన.

"వింటాన్లే చెప్పు" అన్నాడు సూరిబాబు.

"ఆమెకు మన ప్రేమని భగ్నం చేసే అవకాశం ఇవ్వకుండా మనం ముందుగా పెళ్లి చేసుకుని ఆ తర్వాత ప్రేమించుకుంటే?"

"నో... అలా అయితే నాలోని ప్రేమార్తి చల్లారదు''

"అసలు ప్రేమార్తి అంటే ఏంటి?"

ఇది కూడా చాలా క్లిష్టమైన ప్రశ్నే అనిపించింది సూరిబాబుకి.

"అంటే పెళ్లికి ముందే కొంతకాలం ప్రేమించాలన్న ఉబలాటం" అన్నాడు తనలోని ప్రేమార్తికి రాంగ్ డెఫినిషనిస్తూ.

"ఇట్సోకే... అసలు ప్రేమించుకోవడం అంటే ఏంటి?" అంది సుజీవన చిలిపిగా.

"ఇదుగో ఇదుగో ఇచ్చిన మాట తప్పేస్తు

న్నావ్' అన్నాడు సూరిబాబు గాభరాగా.

దాంతో ఆమె మరోమారు ఫకాల్న నవ్వే సింది.

"ఇట్సోకే! ప్రేమకి డెఫినిషన్ అడగన్లే గాని ఏదైనా మాట్లాడండి'' అంది.

"మాట్లాడుతూనే ఉన్నాగా?" అన్నాడు సూరిబాబు ఆశ్చర్యంగా.

'అవును మాట్లాడుతూనే వున్నాడుగా?' అనుకుంది సుజీవన ఆశ్చర్యంగా.

ఇద్దరూ ఆ ఆశ్చర్యంలోంచి తేరుకునేసరి కి అప్పుడర్థమైపోయింది వాళ్లిద్దరికీ ప్రేమంటే ఏమిటో.

'ప్రేమంటే... అన్నమాట' అనుకున్నారా నందంగా.

మరి కాసేపలాగే అర్థంపర్థం లేని మాట లేవో మాట్లాడేసుకుని ఎన్ని అవాంతరాలె దురైనా ఈ ప్రేమనిలాగే కంటిన్యూ చెయ్యా లని నిర్ణయించుకుని ఆ మీదట విడిపోయా రు వాళ్లిద్దరూ.

అంటే సుజీవన వెళ్లిపోయిందన్నమాట.

ఆమె వెళ్లిన తర్వాత ఆమె ఇచ్చిన సల హాని గురించి చాలాసేపు ఆలోచిస్తూ కూర్చు న్నాడు సూరిబాబు.

నిజమే పెళ్లికి ముందే ప్రేమించుకోవాలనే ముంది? సుజీవన చెప్పినట్టు అర్జంటుగా పెళ్లి చేసేస్కుని ఆ తర్వాత తీరుబాటుగా ప్రేమించుకోవచ్చుగా?

వచ్చు అని అంతరాత్మ చెప్పినప్పటికీ అదేవంత బాగున్నట్టుగా అనిపించలేదు సూ రిబాబుకి.

సంసారంలో పడ్డాక ప్రేమించుకోవడంలో థ్రిల్లేముంటుంది? అసలు సంసారంలో పడ్డాక ప్రేమించుకోవడం సాధ్యమేనా అన్నది కూడా ఒక ప్రశ్నే! సో...

ఆ ఆలోచన్ని అవుట్ రైట్‌గా తిరస్కరించే శాడు సూరిబాబు.

ఆఫ్టరాల్ ఒక ఆడవిలన్‌కి భయపడిపో వడం ఏంటి? భీరువులు ప్రేమకు అనర్హులు. సో... ఎలాంటి ఆపదలెదురైనా సరే దృఢ చిత్తంతో వాటి నెదుర్కోవాలే తప్ప.

ఆ 'తప్ప' తర్వాత మరేమీ అనుకోలేకపో యాడు సూరిబాబు.

అందుక్కారణం... అతని ముందో పర్వ తాకారుడు ప్రత్యక్షం కావడం!



"ఏమైంది?" అప్పుడే వచ్చి తన ఎదురు గా చేతులుగట్టుకు నిలబడిన తోటమాలి తిమ్మయ్యని చూస్తూ ప్రశ్నించింది ప్రహేళిక.

"మీరు సెప్పినట్టే ఆ సూరిబాబుగారింటి కాడ కాపుగాశానమ్మాయి గోరూ!" అన్నాడు తోటమాలి చేతులు నలుపుకుంటూ.

"కాపుగాయటం సరే ఆ తర్వాతేమైందో చెప్పు.." అంది ప్రహేళిక ఆత్రంగా.

"మీరు చెప్పినట్టే ఆయమ్మ వచ్చిందమ్మాయ్ గోరూ..." అన్నాడు తోటమాలి, ఘనవిజయం సాధించిన వాడికిమల్లే ముఖం పెడుతూ. అప్పగించిన పనిని సక్సెస్‌ఫుల్‌గా పూర్తి చెయ్యగలిగానన్న ఆనందం అతగాడిది.

ప్రహేళిక ముఖం ఎర్రబారింది.

అయితే ఆ రాస్కెల్ తన బెదిరింపుని

లెక్కచెయ్యలేదన్నమాట. ఎంతకావరం దానికి?

లోలోన పళ్లు కొరుక్కుంటూ "వచ్చి ఎంత సేపుంది?" అని ప్రశ్నించింది తిమ్మయ్యని.

"శానా సేపుందమ్మాయి గోరూ''

"అంటే ఎంతసేపు?"

"తెలియదమ్మాయిగోరూ! నాకాడ వాచీ లేదుగా? మొత్తానికైతే గంటకన్నా ఎక్కువసేపే వున్నదాయమ్మ..." అన్నాడు తిమ్మయ్య.

అంటే చాలా సేపే ప్రేమించుకున్నారన్న మాట.

అంత ఇదిగా బెదిరించినా కూడా ఆ రాస్కెల్ భయపడలేదన్నమాట.

కడుపులో నాటుబాంబు పేలినట్టుగా అనిపించింది ప్రహేళికకి.

"సర్లే నువ్వెళ్లు'' అని తోటమాలిని పంపించేసి ఆలోచిస్తూ కూర్చుంది.

సుజీవనా, సూరిబాబులు ఒకర్నొకరు కౌగిలించుకుని ముద్దులు పెట్టేసుకుంటున్న దృశ్యం ఆమె కళ్లముందుకొచ్చింది.

'గంటసేపు ప్రేమించుకున్నారంటే అంతేగా మరి? కేవలం కబుర్లే చెప్పుకుంటూ కూర్చోరుగా? కౌగిలింతలు, ముద్దులు, మురిపాలు ఇదేగా ప్రేమంటే?'

తనని తిరస్కరించిన సూరిబాబు, కోటి రూపాయలిచ్చినా సరే అతని హృదయాన్ని వదులుకోనని చెప్పిన సుజీవన, తన ఊహా దృశ్యంలో అలా సుఖంగా ప్రేమించుకుంటూ ఉండటం... సహించలేకపోయింది ప్రహేళిక. వాళ్లు... వాళ్లు అలా సుఖంగా ఉండటానికి వీల్లేదు.

ఏం చేసైనా సరే వాళ్లిద్దర్నీ విడగొట్టి తీరాలంతే! దరిమిలా ఆ సూరిబాబుని తనవైపుకు తిప్పుకుని...

సూరిబాబు మెడలో ఓ కుక్కగొలుసువేసి దాన్తాలూకు ఓ కొసని చేతబట్టుకుని తను ఠీవిగా నడుస్తుంటే సూరిబాబు మోకాళ్లమీద పాకుతూ తన వెనుకే వస్తున్నాడు.

ఎంత చక్కటి దృశ్యం? ఆ దృశ్యం కళ్లముందు కనిపించగానే మనసారా నవ్వుకుంది ప్రహేళిక.

"ఏంటమ్మా నీలో నువ్వే నవ్వేసుకుంటున్నావ్?" తండ్రి ప్రశ్న.

దాంతో ఉలిక్కిపడి ఈ లోకంలో కొచ్చింది ప్రహేళిక.

"ఏం లేదు నాన్నా..." అనేసింది గాభరాగా.

"చెప్పమ్మా ఫర్లేదు'' అన్నాడు భానుప్రకాశ్ వచ్చి ఆమెకెదురుగా వున్న ఖాళీ కుర్చీలో కూర్చుంటూ.

"ఏం లేదు నాన్నా! తిక్కకుదిరాక ఆ సూరిబాబెలా వుంటాడో ఆలోచించుకుంటుంటే నవ్వొచ్చిందంతే'' అంది సుజీవన.

"అయితే నువ్వింకా అతని గురించి ఆలోచించటం మానలేదన్నమాట?" ముఖాన్ని అయిష్టంగా పెడుతూ అన్నాడు భానుప్రకాశ్.

"ఎలా మాన్తాను నాన్నా? అతను మనిద్దరికీ చేసిన అవమానం సామాన్యమైందా?" పళ్లు నూర్తూ అంది ప్రహేళిక. "నువ్ లక్ష చెప్పినా సరే నేను మాత్రం వాడి పొగరణిచే తీర్తాను''

"మురికి మీదకు రాయి విసిర్తే మన మీదకే చిందుతుందమ్మా! మన స్టేటస్‌తో పోలిస్తే వాడొక సూక్ష్మక్రిమితో సమానం. వాడితో మనకేంటి చెప్పు?..." కూతురిలో ఇంకా ఆ కసి అలాగే రగులుతూండటం ఆయనకేమాత్రం నచ్చలేదు. అందుకే అలా నచ్చజెప్పబోయాడామెకు.

కానీ ప్రహేళిక తండ్రి మాటల్ని కేర్ చెయ్యలేదు. "నో డాడీ! ఆ సూక్ష్మక్రిమికే అంత పొగరుంటే నాకెంతుండాలి? నేనతని అంతు చూసిగాని వొదల్ను'' అంది స్థిరంగా.

కూతురు రిస్క్‌లో పడబోతోందేమో అని

పించింది భానుప్రకాశ్‌కి.

"ఆవేశం వద్దమ్మా! కాస్త మనసుపెట్టి ఆలోచించు. నయాన్నో భయాన్నో నువ్ వాడి మనసు మార్చి నీ వైపుకు తిప్పుకున్నావ్ అనుకో. అంత మాత్రాన ఒరిగేదేముంటుంది? నేనైతే మీ పెళ్లికి అంగీకరించను గదా?" అన్నాడు, 'దీసీజ్ టూ బాడ్' అన్నట్టుగా పెదవి విరుస్తూ.

"ఆ విషయం అంతవరకూ వచ్చాక అప్పుడు చూస్కో వచ్చులే డాడీ! ముందైతే నేను వాడి పొగరణిచే తీరాలి'' కేర్‌లెస్‌గా తలెగరేస్తూ అంది ప్రహేళిక.

భానుప్రకాశ్‌కి ఇంక ఆ టాపిక్‌ని పొడిగించటం ఇష్టం లేకపోయింది.

రెచ్చగొట్టిన కొద్దీ రెచ్చిపోయే మనస్తత్వం కూతురిది.

'సరే వేచి చూద్దాం' అని మనసులో అనుకుని, "జాగ్రత్తమ్మా, ప్రమాదాన్ని మాత్రం కొనితెచ్చుకోకు'' అనేసి వెళ్లిపోయాడక్కడి నుంచి.

'గాడిద గుడ్డులే' అనుకుంది ప్రహేళిక తేలిగ్గా.

★ ★ ★

పర్వతాకారుడు వికటాట్టహాసం చేశాడు.

'అచ్చం సినిమాల్లో వుండే విలన్లా ఎంత ఘోరంగా నవ్వుతున్నాడో?' అనుకున్నాడు సూరిబాబు.

అప్పటికి పది నిముషాలకు పైగానే అయ్యింది పర్వతాకారుడు అక్కడికి వచ్చి.

ముందతన్ని చూసినప్పుడు ప్రహేళిక పంపిన గుండాయేమో ననుకుని భయపడ్డాడు సూరిబాబు.

కానీ ఆ తర్వాత తెలిసింది అతను గూండా కాదు వేరే పనిమీదొచ్చాడని.

ఇంతకీ సంగతేంటంటే,

ఆ పర్వతాకారుడి పేరు మస్తానయ్య. అతనికి ముగ్గురు కూతుర్లున్నారు. ముగ్గురూ అవివాహితలే. ముగ్గురికీ మెల్లకళ్లే! ఆ ముగ్గుర్లో ఎవరో ఒకర్ని సూరిబాబుకి అంటగట్టాలన్న సదుద్దేశంతో వచ్చాడతను. సూరిబాబు తాలూకు కరపత్రాల్లో ఒకటి అంతక్రితం రోజే అతని చేతిలోపడింది. దాన్ని చూసి సూరిబాబుని వెతుక్కుంటూ వచ్చాడతను.

"ఎందుకు సార్ అలా వికటాట్టహాసం చేస్తారు? చెప్పేగా నా హృదయం ఆల్‌రెడీ ఫిలప్పైపోయిందని?" అన్నాడు సూరిబాబు బేలగా.

అంతిదిగా చెప్పినా కూడా ఈ మనిషి అర్థం చేసుకోడేం? అనుకున్నాడు వేదనగా.

'అసలే ఆ ఆడవిలనొకతనుకుంటే ఇపుడీ మగ విలన్‌కూడానా?' అనుకున్నాడు బాధగా.

"ఫిలప్పైపోతే మరేం కొంపలంటుకుపోవులేవయ్యా. నేనూ చెప్పేనుగా నేనేం చేస్తుంటానో? నేన్నడిపే వ్యాయామశాలలో పాతికమందికి పైగా మెరికల్లాంటి కుర్రాళ్లున్నారు. నేను గనుక ఒక్క చిటికేశానంటే నువ్వింక ఈ ఆకారంలో వుండవ్. నువ్వు పంచిన కరపత్రాల్లో గడువు తేదీ అంటూ ఏం లేదుగనుక నువ్వలా నీ హృదయాన్ని నీ ఇష్టమొచ్చినట్టు ఫిలప్ చేస్కోవడానికి వీల్లేదంతే! మా అమ్మాయిల్ని కూడా చూసి మర్యాదగా ఒకర్ని సెలక్ట్ చేస్కో! లేదంటే తెలుసుగా?" అన్నాడు పర్వతాకారుడు జబ్బలు చరుస్తూ.

ఛీ! ఈ పర్వతంగాడికి దయాదాక్షిణ్యాలు వున్నట్టుగా లేవు! అనుకున్నాడు సూరిబాబు.

"మీరలా అంటే ఎలాగండీ? ఆల్రెడీ ఒకరికిచ్చేసిన హృదయాన్ని వెనక్కి ఎలా తీస్కోను?" అన్నాడు దీనంగా.

"ఏమోనయ్యా! అదంతా నాకు తెలీదు. నేను మళ్లీ రేపిదే సమయానికొస్తాను. అప్పటికల్లా నువ్ నీ మనసు మార్చుకున్నావా సరే లేదంటే..." అంటూ మీసం మెలేశాడు మస్తానయ్య.

'వీడి ఏనుగు శరీరానికి తోడు మీసం ఒకటి చండాలంగా' అనుకున్నాడు సూరిబా




బు.

"అది జరిగేపని కాదండీ'' అన్నాడు చివరికి ధైర్యంగా.

"అయితే ఇది కూడా జరిగే పనికాదు'' అన్నాడు మస్తానయ్య.

వీడికి తెలుక్కూడా సరిగ్గా వచ్చినట్టు లేదే అనుకుని "ఏది?" అనడిగాడు సూరిబాబు.

"నువ్వీ భూమ్మీద ఊపిరితో మిగలటం" అనేసి తన పర్వతాకారాన్ని సోఫాలోంచి అతికష్టంమీద లేవదీసి విసురుగా బయటకు వెళ్లిపోయాడు మస్తానయ్య.

"ప్రేమ అన్నాక ఇలాంటి ఆటుపోట్లు తప్పవ్!" అనుకున్నాడు సూరిబాబు పర్వతంగాడు వెళ్లినవైపే చూస్తూ.

ప్రేమకోసం భానుప్రకాశ్ లాంటి కోటీశ్వరుడి కూతుర్నే వదులుకున్నాడు తను.

అలాంటిది ఆఫ్టరాల్ ఈ వస్తాదుగాడొక లెక్కా?

వాడికి వ్యాయామశాల వుంటే వుండొచ్చు. అందులో పాతికమంది మెరికల్లాంటి కుర్రాళ్లు వుంటే వుండొచ్చు. వాటిఫ్?

ఇలాంటి బోడి బెదిరింపులకి భయపడి సుజీవనని వదులుకుంటే తనొక ప్రేమికుడే కానట్టులెక్క.

సిసలైన ప్రేమికులంటే సవాళ్లకు భయపడనివాళ్లే కదా? అలా అనుకున్నాక అతని గుండె నిండా సాహసం నిండిపోయింది.

★ ★ ★

"ఎందుకు మేడమ్ మీరలా వర్రీ అవుతారు. అన్ని పన్లూ మొదటి ప్రయత్నంలోనే నెరవేరిపోవాలని రూలేముంది? కొన్నికొన్ని పనులు నిదానంగా జరుగుతాయ్! సాధన మున పనులు సమకూరు ధరలోన అన్నారు పెద్దలు. మీరు ధైర్యంగా వుండండి. వాళ్ల ప్రేమని చెడగొట్టడానికి మీకు సహాయంగా నేనున్నాగా?" అన్నాడు కనకలింగం ఐస్క్రీమ్ని చప్పరిస్తూ.

అతనంతకు ముందే ప్రహేళిక వాళ్లింటికి వచ్చాడు.

ఆమె అతనికి ఐస్క్రీమిచ్చి ఆ మీదట తిమ్మయ్య గూఢచర్యం ద్వారా తాను తెలుసుకున్న విషయాన్ని గురించి చెప్పింది. అది వినే కనకలింగమలా అన్నాడు.

"ఏమో లింగంగారూ! అంత బెదిరించి నా ఆ రాస్కెల్ లొంగలేదంటే''

"ఆవిడేదో పెద్ద సాహసవంతురాలనుకుంటున్నారా? అదేంకాదులెండి. చురక సరిగ్గా తగల్లేదంతే'' అన్నాడు కనకలింగం ఐస్క్రీం చప్పరిస్తూ.

"అంటే!" అంది ప్రహేళిక.

"మీరు ఉత్తుత్తినే బెదిరించి వదిలేశారుకదా! ఆ డోసు ఆమెకు చాల్లేదన్నమాట"

"అంటే? నిజంగానే ఏదన్నా చేస్తేనే తప్ప ఆవిడగారు దార్లోకి రాదంటారా?"

"జరిగినదాన్ని బట్టి ఆ విషయం స్పష్టంగానే తెలుస్తూంది కదండీ!" అన్నాడు కనకలింగం 'మీరింత అమాయకులేంటండీ' అన్నట్టుగా చూస్తూ.

ఆ చూపు ప్రహేళికకు చాలా నచ్చింది.

'ఆ ఇద్దర్రాస్కెల్స్ పొగరణచడానికి తనకింతగా సహకరిస్తోన్న ఇతగాడి స్నేహాన్ని ఇలాగే నిలుపుకోవాలి' అనుకుంది మనసులో.

"మరైతే ఆమెని నిజంగానే రౌడీలచేత తన్నించమంటారా?" అనడిగింది.

"అఫ్ కోర్స్! చెయ్యాల్సిన పని అదే అనుకోండి. కానీ ఏం చేసినా మన చేతికి తడంటుకోకూడదు'' సాలోచనగా తల పంకిస్తూ అన్నాడు కనకలింగం. "మీరు ఆల్రెడీ ఆమెనోసారి బెదిరించారు కాబట్టి శారీరకంగా ఇపుడామె కేదైనా హాని తలపెడితే అది వెంటనే మీ మీదకే వస్తుంది. సో..."

"ఊ... చెప్పండి''

"కొన్నాళ్ళదాకా మీరలాంటి పన్లేం తలపెట్టొద్దు. ఈలోగా నేనట్నుండి నరుక్కురావడా




నికి ప్రయత్నిస్తాను...” అన్నాడు.

ఆ ఆత్మీయత ఆమెకు చాలా నచ్చింది.

“సరేనండీ! మీరెలా చెబితే అలాగే నడుచుకుంటాను ఇంకో ఐస్‌క్రీమ్ తీసుకుంటారా?” అనడిగింది తను కూడా ఎంతో ఆత్మీయంగా.

“ఆఁ మరొకటి చాల్లెండి'' అన్నాడు కనకలింగం.

“నేనన్నది కూడా ఒక్కటనే'' అంటూ నవ్వేసింది ప్రహేళిక.

‘అబ్బ! ఎంతందమైన నవ్వు?!’ అని అనుకోకుండా వుండలేకపోయాడు కనకలింగం.

‘ఆ బోడి పంతాన్నొదిలేసి ఈవిడగారా సూరిబాబుని కాకుండా తనని ప్రేమిస్తే ఎంత బావుణ్ణు?’ అని కూడా అనుకోకుండా వుండలేకపోయాడు.

కేవలం ఆశపడినంత మాత్రాన ప్రయోజనమేముంది? దేనికైనా ప్రాప్తముండాలి! అనుకున్నాడు నిరాశగా.

అంతలో ఆమె లేచి వెళ్ళి రెండో ఐస్‌క్రీమ్ తీసుకొచ్చి అతని కందించింది.

“మీకు ఐస్‌క్రీమ్ అంటే చాలా ఇష్టమా?” అనడిగాడు తినడం ప్రారంభిస్తూ.

“చాలా ఏం కాదు. కొంచెం...” అంది నవ్వేస్తూ.

“అలాగా! నాక్కూడా అంతేలెండి'' అంటూ తనూ నవ్వేశాడు కనకలింగం.

ఐస్‌క్రీం తింటూ ఆమె సమక్షంలో అలా కూర్చోగలగటం అతనికి చాలా సంతోషంగా అనిపించింది.

‘నిజంగా సూరిగాడెంత మూర్ఖుడు?!! ఇంతటి అందాల భామ నొదిలేసుకుని... ఛీ!...’ అనుకున్నాడు మనసులో బాధగా.

అంతలోనే ‘అదీ ఒకందుకు మంచిదేలే అనిపించింది మనసులో.

ఏనాడేం జరుగుతుందో ఎవరికి తెలుసు? క్రమంగా ఈమెకా సూరిగాడంటే అసహ్యం కలిగి... ఆ అసహ్యం తనమీద ప్రేమగా మారి... అదృష్టం తన పాలిట లాటరీలా తగిలి,

ఆ ఊహకే మనసు పులకించిపోగా ఆ గాభరాలో ఐస్‌క్రీమ్ అంతట్నీ ఒకేసారి నోట్లో పెట్టేసుకున్నాడు కనకలింగం.

తత్ఫలితంగా అతని ముక్కూ మొహం అంతా ఐస్‌క్రీమైపోగా “అచ్చం సర్కస్ బఫూన్‌లా ఉన్నారు...” అంటూ ఘొల్లున నవ్వింది ప్రహేళిక.

బంగారు పూసల వర్షం కురిసినట్టుగా అనిపించింది కనకలింగానికి.

“సారీ అండీ! మనసు పులకించిపోవడంవల్ల గాభరాలో అలా తినేశాను'' అన్నాడు గాభరాగా.

“మనసు పులకించిపోయిందా? దేనికీ?!!” కాస్త అయోమయంగా అడిగింది ప్రహేళిక.

అది ఎలా చెప్పగలడు?

“ఏం లేదండీ! మీ మనసుని గాయపరిచిన ఆ స్కౌండ్రల్‌గాడికి నేను చేయబోతున్న పరాభవాన్ని తల్చుకుంటుంటే మనసు పులకించింది'' అన్నాడు సీరియస్‌గా.

“మీరతనికి పరాభవం చెయ్యబోతున్నారా? ఎలా?!!” కుతూహలంగా అడిగింది ప్రహేళిక.

ఏదో అనేశాడే తప్ప, మనసులో ఓ ప్లానంటూ లేదాతడికి.

“అది చెపితే బావుండదండీ! చేశాక మీరే చూస్తారుగా?” అన్నాడు యమసీరియస్‌గా. ఆ అవమాన భారానికి ఆ వెధవ కృంగి కృశించి నశించి చావాలి'' అన్నాడు యమ భీకరంగా.

అప్పటికీ ప్రహేళికలోని అయోమయం తొలగిపోలేదు.

“మీ మాటల్నిబట్టి నా తరపున మీరతనికేదో శాస్తి చెయ్యబోతున్నారని తెలుస్తోంది. కానీ... దానికి మీ మనసు పులకరించడ

వేంటి?" అంది కుడిబుగ్గమీద ఎడమచేతి చూపుడువేలితో నొక్కుకుంటూ.

ఛీ! ఈ స్త్రీలెల్లరూ ఒట్టి ససగాళ్ళు! ఏ విషయాన్నీ ఒక పట్టాన వదిల్చావరు!! అని మనసులో బాధగా అనుకుని "మీలాంటి సహృదయురాలికి సహాయం చేసే అవకాశం వచ్చినందుకు మనసు పులకరించదా ఏంటండీ. మీరు మరీను. ఆ మాటకొస్తే మీకోసం వాళ్ళిద్దర్నీ చంపెయ్యడానిక్కూడా నేను సిద్ధమే'' అన్నాడు కనకలింగం.

జగదేక సుందరిలాంటి స్త్రీ ఎదురుగా ఉన్నప్పుడు ఏ మగాడికి మాత్రం మాటలు తిన్నగా వస్తాయి?

"నిజంగానా?" అంది ప్రహేళిక ఆశ్చర్యంగా.

"ముమ్మాటికీ నిజం ప్రహేళికగారూ! కావాలంటే వాళ్ళని చంపెయ్యడమే కాదు-వాళ్ళని బూడిదచేసి, దాన్తో మీ నుదుట తిలకం దిద్దమన్నా సరే..." అన్నాడు గంభీరంగా.

"మీకు హత్యలు చెయ్యడంలో బాగా ఎక్స్‌పీరియన్స్ ఉన్నట్టుందే?"

"ఛ ఛ... అలాంటిదేం లేదండీ'' అన్నాడు తడబడిపోతూ.

"మరి వాళ్లని బూడిద చేస్తానంటున్నారుగా?"

"ఏదో మాటవరసకన్నానంతే! అయినా కాకపోయినా మీలో మరీ అంత క్రౌర్యముంటుందని నేననుకోనులెండి'' అన్నాడు తెలివిగా.

అయినా అతన్ని వదల్లేదు ప్రహేళిక.

"ఒకవేళ నాలో క్రౌర్యముండి నిజంగానే వాళ్ళిద్దర్నీ చంపెయ్యమంటే?" అంది. 'వాట్ విల్ యు డు దెన్?' అన్నట్టుగా కళ్లెగరేస్తూ.

"దెన్ ఐవిల్ కిల్ దెమ్. వాటీజ్ దేర్?" అనేశాడు తేలిగ్గా.

"హత్యలు చెయ్యడంలో ఎక్స్‌పీరియన్స్ లేదంటున్నారుగా మరి?"

"ప్రతిదానికీ ఎక్స్‌పీరియన్స్ వుండాలా ఏంటండీ? నాలుగైదు హత్యలు చేస్తే ఎక్స్‌పీరియన్స్ దానంతటదే వస్తుంది'' అన్నాడు మరింత తేలిగ్గా.

"అయితే నాకోసం మీరు హత్యలు చెయ్యడానిక్కూడా వెనుకాడరన్నమాట?" ప్రహేళిక చాలా వింతగా చూసింది కనకలింగంవైపు.

"ఊహూ'' అన్నాడతను రెండు చేతుల్నీ సోఫామీద బార్లాగా చాస్తూ. "హత్యలే కాదు-మీరు చెయ్యమంటే ఖూనీలూ, మర్డర్లూ ఏమైనా చేస్తా''

కిసుక్కున నవ్వి... 'మొత్తానికి భలే వింత మానవుళ్ళా వున్నాడే?' అనుకుంది ప్రహేళిక.

"ఎందుకండీ నవ్వుతున్నారు?"

"హత్యలు, ఖూనీలు, మర్డర్లు అనేవి వేర్వేరని భావిస్తున్నందుకు'' పమిటచెంగు నోట్లో కుక్కుకుంటూ విరగబడి నవ్వేసరికి,

'అవున్సుమా! మూడూ ఒకటే గదా?' అనుకుని అప్పుడు సిగ్గుపడిపోయాడు కనకలింగం.

"సారీ అండీ! ఉత్తుత్తికే కన్‌ఫ్యూజైపోయా..."

"సర్లెండి ఎందుకో ఒకందుకు కన్‌ఫ్యూజయ్యార్లేగానీ- ముందెళ్ళి ఆ ముక్కూ మూతీ కడుక్కుని రండి'' అంది ప్రహేళిక.

దాంతో అదే గదిలో ఓ మూలగా ఉన్న వాష్‌బేసిన్ దగ్గరికెళ్ళిన కనకలింగం ట్యాప్ మీద చెయ్యేసి కెవ్వున అరిచాడు!

అలా హటాత్తుగా మలేరియా జ్వరమొచ్చినట్టు గజగజా వణికిపోతున్న అతనికేసి "ఏమైందండీ? ఏమైందీ?" అంటూ కంగారుగా పరిగెత్తింది ప్రహేళిక!

"బొ...బొ... బొద్దింకండీ! క...క...కాక్రోచ్..." వణుకుతూనే చెప్పాడు కనకలింగం.

అంతే!




ఆ గదిలో మరోసారి బంగారుపూసల్రా లేయ్!

"భలేవారండీ! బొద్దింకకే భయపడే మీరు...మనుషుల్ని చంపుతారా?" అంది ప్రహేళిక పూసలు రాల్చడం అయ్యాక.

"ఇహిహి..." అని ఓ వెర్రినవ్వు నవ్వటం తప్ప మరేమీ చెయ్యలేకపోయాడు కనకలింగం.

ఓ రెండు మూడు నిముషాల తర్వాత ప్రహేళిక మరో ఐస్‌క్రీం ఆఫర్ చెయ్యబోతే వద్దని తిరస్కరించి "నేను మళ్ళీ వచ్చి చెప్పేదాకా మీరు ఫర్‌దర్ స్టెప్పేం తీసుకోవద్దు'' అని ఆమెకు అడ్వయిజ్ ఇచ్చి- ఆమీదట అక్కణ్ణుంచి బైటికొచ్చేశాడు కనకలింగం.

★ ★ ★

"ఇపుడు మళ్ళీ ఒక కొత్త సమస్యొచ్చిపడిందిరా'' అన్నాడు సూరిబాబు.

"ఏంటది?" అడిగాడు కనకలింగం షూ లేసెస్ విప్పుకుంటూ.

అతను జస్ట్ అప్పుడే వచ్చాడు ప్రహేళిక వాళ్ళ ఇంటినుండి.

మిత్రుడు శత్రుపక్షంతో చేతులు కలిపాడని సూరిబాబుకేం తెలుసు?

"అసలే ఆ ఆడవిలన్‌తో వేగలేకపోతుంటే నా పాలిట ఇంకో మగ విలన్ కూడా తయారయ్యాడ్రా'' అన్నాడు కణతలు రుద్దుకుంటూ.

ప్రహేళికలాంటి అత్యద్భుత సౌందర్యరాశిని మిత్రుడు 'ఆడవిలన్' అన్నందుకు మాడు పగలగొట్టాలన్నంత కోపమొచ్చింది కనకలింగానికి. అయినా ఎలాగో తమాయించుకున్నాడు. హత్యలు చెయ్యడం అంతగా అలవాటులేదాయె!

"మగ విలనా? వాడెవడూ?"

"వాడొక మీసాలు కలిగినటువంటి తొండములేని ఏనుగు'' అని ప్రారంభించి మస్తానయ్య గురించి చెప్పుకుపోయాడు. సూరిబాబు.

"అయితే నువ్విపుడు రెండు విధాలుగా డేంజర్‌లో పడ్డావన్నమాట"

మిత్రుడు తలెగరేస్తూ అలా అడుగుతుంటే ఆ తలెగరెయ్యడం తనమీద జాలితోనేమో అనుకున్న సూరిబాబు "అవున్రా'' అన్నాడు బాధగా.

నిజానికి కనకలింగం తలెగరేసింది 'భలే భలే' అన్న ఉద్దేశంతో కాబట్టి "జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పటికైనా కళ్ళు తెరువ్. ఆ అమ్మాయితో ఇంకా ముదరని నీ ప్రేమకి ఉద్వాసన చెప్పి, శుభ్రంగా ఆ మస్తానయ్య కూతుర్నే ప్రేమించు'' అంటూ ఓ బోడి సలహా ఇచ్చాడు చటుక్కున.

"నెవ్వర్' స్థిరంగా అన్నాడు సూరిబాబు. మనసునిండా ప్రేమార్తి కలిగినవాడికి అలాంటి బోడి సలహాలెలా నచ్చుతాయ్.

"అయితే నీ ఖర్మ! రెండు వైపుల్నుంచీ వాయించేస్తారు నిన్ను. సరే, వాయింపించుకో' అని బెదిరించాడు. కనకలింగం.

మనసునిండా ప్రేమార్తి కలిగిన సూరిబాబు ఆ బెదిరింపునేమాత్రం కేర్ చెయ్యలేదు. "వాయించినప్పుడు చూద్దాంలే' అనేశాడు కేర్లెస్‌గా.

★ ★ ★

మర్నాడు కనకలింగం యథాప్రకారంగా ఆఫీసుకు బయల్దేరుతుంటే

"ఇవ్వాళ ఆ మస్తానయ్య మళ్ళీ వస్తానన్నాడ్రా! ప్లీజ్... నాకు సాయంగా వుండిపోరా'' అని బతిమిలాడాడు సూరిబాబు.

"నీ బొంద! నీ మూలంగా ఇప్పటికే చాలాసార్లు ఆఫీసు మానేశాను. ఇలాగైతే నన్నుద్యోగంలోంచి పీకేస్తాడు మా బాసు..." అన్నాడు కనకలింగం విసుక్కుంటూ.

"రేయ్ రేయ్ ప్లీజ్‌రా..." ముఖాన్ని దీనాతిదీనంగా పెట్టి మళ్ళీ బతిమాలాడు సూరిబాబు.

అయినా కనకలింగం కరగలేదు.

"నీకోసం ఎవడి చేతిలోనో చావుదెబ్బలు తినాల్సిన ఖర్మ నాకేం పట్టలేదు'' అంటూ అడ్డంగా తలాడించాడు.

"రేయ్ రేయ్ అంతేనా?, స్నేహమంటే ఇదేనా?" అన్నాడు సూరిబాబు జాలిగా.

కాదని కనకలింగానికీ తెలుసు.

అయినప్పటికీ మిత్రుడా మస్తానయ్య చేతిలో చావుదెబ్బలు తిని మనసు మార్చుకుంటే అది తనకే లాభం కాబట్టి, "నువ్వేమైనా అనుకోరా! నేను మాత్రం ఆఫీసుకి వెళ్ళి తీరాలి'' అనేశాడు నిర్దయగా.

సూరిబాబుకి స్నేహమంటేనే విరక్తి పుట్టేసింది.

"సరే ఫో అయితే' అనేశాడు ముఖాన్ని గంటు పెట్టుకుంటూ.

కనకలింగం వెళ్ళిపోయాక సోఫాలో కూర్చుని ఆలోచించటం ప్రారంభించాడు సూరిబాబు.

ఈ మస్తానయ్యగాడి పీడ వదిలించుకోవటం ఎలా? అన్నదే ఆ ఆలోచన!

ఎంత ఆలోచించినా అతన్ని తప్పించుకునే మార్గమేదీ తోచలేదు సూరిబాబుకి.

పోనీ అసలెవర్నీ ప్రేమించకుండా తనలోని ప్రేమార్తిని పూర్తిగా చంపేసుకుని స్వగ్రామం వెళ్ళిపోతేనో? అన్న ఆలోచన కూడా వచ్చింది గానీ... అది అతన్లో ఆట్టేసేపు నిలవలేదు.

పిరికివాడు బతికుండి చచ్చినవాడితో సమానం.

అలాంటి బతుకు బతక్కపోతే యేం?

అలా అనుకున్నాక అతన్లో పౌరుషం ఎగదన్నుకొచ్చింది.

'సరే రానియ్ ఆ వెధవని ఏం చేస్తాడో చూద్దాం' అనుకున్నాడు.

ఓ గంటా... గంటన్నర గడిచేసరికి సదరు పర్వతాకారుడు రానేవచ్చాడు.

"ఏం నిర్ణయించుకున్నావ్?" వస్తూనే అడిగాడు.

"నా నిర్ణయంలో మార్పుండబోదని రాత్రే చెప్పాగా?" అన్నాడు సూరిబాబు.

"నీ నిర్ణయం మార్చుకోకపోతే ఏం జరుగుతుందో రాత్రే చెప్పాగా?" వెటకారంగా అన్నాడు పర్వతాకారుడైన మస్తానయ్య.

"చూడండి మస్తానయ్యగారూ..."

"ఏంటి?" చూశాడు మస్తానయ్య.

"మీకొక నిజం చెప్పాలనుకుంటున్నాను''

"ఏంటి?" మళ్ళీ చూశాడు మస్తానయ్య.

ఇమ్మీడియట్‌గా మస్తానయ్య తనమీద ఎటాక్ చెయ్యకుండా వుండేందుకలా బ్రేక్ వేశాడే తప్ప- చెప్పడానికసలు సూరిబాబు దగ్గర విషయమంటూ ఏమైనా ఉంటేగా?

"అందుకే... తీరా చెప్పేక మీరఫెండవ్వకూడదు మరి?" అన్నాడు ఆలోచించడానికి మరికాస్త వ్యవధి తీసుకుంటూ.

"అవ్వన్లే చెప్పు" అన్నాడు మస్తానయ్య.

"ఏంలేస్సార్! ఆకారంలోనే కాకుండా వయసులో కూడా మీరు చాలా పెద్దవారు! సో... సహజంగానే మీకు పెద్దమనసుండాలి. సో... మీ సహజమైన పెద్ద మనసుతో నన్ను క్షమించి వదిలెయ్యండి సార్..." చప్పున మస్తానయ్య చేతుల్ని పుచ్చేసుకుంటూ అన్నాడు సూరిబాబు "ఇవి చేతులు కావు కాళ్ళు'' అని.

"కాళ్ళయితే చెప్పుల్లేవెందుకు మరి?" సూరిబాబు కేసి కొరకొర చూస్తూ అన్నాడు మస్తానయ్య. "ఇలాంటి బీదరుపులక్కరిగిపోవడానికి నేనేం దద్దమ్మని కాదు..."

'మరెలాంటరుపులక్కరిగిపోతారు?' అనడగాలనిపించినా తంతాడేమోనని మానేశాడు సూరిబాబు.

"ప్లీజ్ సార్... మీ అమ్మాయిల కోసం నా ప్రేమని బలిచెయ్యకండి సార్' అన్నాడు దీనంగా.

"అసలు వాళ్ళని చూడకుండానే నువ్విలా మొండికెత్తటం అసలిదేం పద్ధతయ్యా?"

అన్నాడు మస్తానయ్య కోపంగా.

"చూడ్డం దేనికి సార్? మీరు ముందే చెప్పారుగా ముగ్గురికీ మెల్లకళ్లని?" భయప డుతూనే అన్నాడు సూరిబాబు.

"మెల్లకళ్ళున్నంతమాత్రాన మనుషులు బాగుండరనేముంది? ముందైతే నువ్వోకసారి వచ్చి చూడు. మిగతా విషయాలు ఆ తర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు మస్తా నయ్య.,

ఇమ్మీడియేట్ దేహశుద్ధి కన్నా దాన్ని మరికాసేపు పొడిగించటం మంచిదే కదాని "సరే సార్ మీ మాట ప్రకారమే వచ్చి చూస్తాను. కానీ చూశాక నాకు నచ్చకపోతే అప్పుడు మాత్రం మీరు నన్ను బలవంతం చెయ్యటానికి వీల్లేదు'' అన్నాడు సూరిబాబు.

'నచ్చలేదు' అన్న ముక్క చెప్పేక నువ్వ సలు మా ఇంట్లోంచి బైటికి రాగలిగితే గదా? అనుకున్న మస్తానయ్య "సర్లేసర్లే... నడువై తే'' అనేశాడు.

తత్ఫలితంగా ఓ అయిదు నిముషాల తర్వాత వాళ్ళిద్దరూ ఆ ఇంట్లోంచి బయటప డ్డారు.

ముందు మస్తానయ్య నడుస్తుంటే ఆ వెనకే చేతులు గట్టుకు నడుస్తోన్న సూరిబా బు ఏనుగు పక్కన ఎలుకలా కనిపిస్తున్నా డు.

వాళ్ళిద్దర్నీ చూసి ఓ జతకళ్ళు విప్పారాయి!

ఆ కళ్ళు... తోటమాలి తిమ్మయ్యవి.

★ ★ ★

తిమ్మయ్య చెప్పింది విని "నిజమా?" అంది ప్రహేళిక.

"అవునమ్మాయిగోరూ! ఆణ్ణి సూత్తా వుంటేనే నా గుండెలదిరిపోయినై!" అన్నాడు తిమ్మయ్య ఇంకా అదుర్తూనే వున్న గుండెని కుడిచేత్తో అదిమిపట్టుకుంటూ.

"అయితే ప్రమాదాన్ని శంకించి బాడీగా ర్డుని పెట్టుకున్నాడన్నమాట!" మనసులో అనుకోబోయి పైకే అనేసింది ప్రహేళిక.

"ఎవరమ్మా బాడీగార్డ్ని పెట్టుకుంది?" అడిగాడు భానుప్రకాశ్ అప్పుడే అక్కడికొ స్తూ.

తండ్రి హఠాదాగమనానికి విస్తుపోతూ

"అబ్బే ఏం లేదు నాన్నా..." అనేసింది ప్రహేళిక.

"ఎందుకమ్మా అబద్ధాలాడ్తావ్? ను వ్వింకా వాణ్ణి గురించే ఆలోచిస్తున్నావ్ కదూ?" కూతురి మాటల్ని నమ్మకుండా అన్నాడు భానుప్రకాశ్. "నువ్ చెప్పు తిమ్మ య్యా! ఏం జరిగిందసలు?" తోటమాలి వైపు తిరిగి అడిగాడు.

ప్రహేళిక చెప్పొద్దన్నట్టు కళ్లతో సైగచే సింది గాని పెద్దయ్యగారితో అబద్ధమాడలేక విషయం చెప్పేశాడు తిమ్మయ్య.

"అయితే వాడింటి దగ్గర వీణ్ణి కాపలా పెట్టావన్నమాట! ఎందుకమ్మా ఇదంతా?" ఇట్స్ వెరీ బాడ్ అన్నట్టు తలాడిస్తూ అన్నా డు భానుప్రకాష్ "ఆఫ్టరాల్ వాడొక పురుగు లాంటివాడు దులిపేసుకుంటే పోయేదానికి ఎందుకిదంతా?"

ప్రహేళిక మాట్లాడలేదు.

మాట్లాడేందుకు ఏముంది గనక? జస్ట్ అదొక మూర్ఖమైన పట్టుదల అంతే.

"అయ్యిందేదో అయ్యింది. రేపట్నుంచి మాత్రం నువ్వా సూరిబాబింటికి వెళ్ళటానికి వీల్లేదు'' అన్నాడు భానుప్రకాశ్ తిమ్మయ్యను ద్దేశించి.

"అమ్మాయి గోరెల్లమన్నారని ఎల్లేన య్యా. లేకపోతే నాకేటి పని?" అన్నాడు తిమ్మయ్య చేతులు నలుపుకుంటూ.

"అమ్మాయిగారు చెప్పినా సరే... ఇక నుంచి నువ్ అటుకేసి పోవడానికి వీల్లే దంతే'

"చిత్తం" వినయంగా తలాడించి తిమ్మ య్య అక్కణ్ణుంచి వెళ్ళిపోగానే "నీక్కూడా ఇదే మాటమ్మా! ఫర్గెట్ అబౌట్ దట్ బ్లడీ రోగ్! అనవసరంగా వాణ్ణి గురించి నీటైమ్

వేస్ట్ చేస్కోవద్దు'' అన్నాడు భానుప్రకాశ్.

అంతమాత్రానికే నిర్ణయం మార్చేసుకునేంత చపల చిత్తురాలు కాదు ప్రహేళిక. అయినప్పటికీ తండ్రితో వాదన పెంచుకోవడం ఇష్టంలేక సరే అన్నట్టుగా తలాడించింది.

ముక్కుతూ మూలుగుతూ మంచంమీద పడున్న షేపులు మారిపోయిన సూరిబాబుని చూసి... "అరె... ఏమైందిరా?" అని గాభరాగా అడిగాడు కనకలింగం.

"నువ్వెళ్ళాక ఆ మస్తానయ్య వచ్చాడు'' అన్నాడు సూరిబాబు మూలుగుతూ.

"వచ్చి?"

"నా కూతుళ్ళని చూద్దువుగాని రమ్మని నన్ను తనతో తీసుకెళ్ళాడు..."

"తీస్కెళ్ళి?"

"కన్పించడంలా? తన్ని పంపించాడు. ఒకరు కాదు ఇద్దరు కాదు మొత్తం పదిమంది నామీదపడి నా ఒళ్ళు హూనంచేసేశారు..." ఉబ్బిపోయిన ముక్కుని నిమురుకుంటూ ఆవేదనగా అన్నాడు సూరిబాబు. "ఎంత బతిమాలినా వినకుండా నువ్వేమో ఆఫీసుకు వెళ్ళిపోతివాయె! నువ్వుండుంటే ఇలా జరిగేది కాదేమో!"



"నేనుండి మాత్రం ఏం చెయ్యగలిగేవా ణ్ణి? నీతో పాటు వాళ్ళతో తన్నులు తినుండేవా ణ్ణి. అంతేగా'' అన్నాడు కనకలింగం చాలా పెద్ద అపాయమే తప్పిందని లోలోన సంతో షిస్తూ.

"నువ్వుండుంటే వాడితో అలా వెళ్ళ కుండా నన్ను వారించుండేవాడివే' అన్నా డు సూరిబాబు బాధగా.

"సరేలే! అయిపోయిన పెళ్ళికి బాజా లెందుకు? ఇంతకీ ఫైనల్‌గా ఆ మస్తానయ్య ఏమన్నాడు?'' అన్నాడు కనకలింగం షర్టు విప్పి హేంగర్‌కి తగిలిస్తూ.

"ఏమీ అనలేదు. నన్ను తన్నిన ఆ పదిమందీ వాడి శిష్యులట! ఇంకెప్పుడూ ఇలాంటి చండాలపు పాంప్లెట్లు వెయ్యించొద్దని వార్నింగిచ్చి వదిలేశారు'' వాచిపోయిన కుడికన్నుమీద వేలితో రుద్దుకుంటూ రుద్ధ కంఠంతో అన్నాడు సూరిబాబు.

"అంత తేలిగ్గా వదిలేశారంటే అది నీ అదృష్టమే! కాదూ కూడదూ ఆ ముగ్గుర్లో ఒకర్ని చేస్కునే తీరాలని పట్టుబట్టుంటే నువ్ మరీ అవస్థపడేవాడివి'' కాస్త జాలిగా అన్నాడు కనకలింగం.

"వాళ్ళు పట్టుబడితే మాత్రం నేను చే స్కుంటానా ఏంటి? నా మనసిపుడు సుజీవ నదైపోయింది. దాన్నింక వెనక్కు తీసుకునే ప్రసక్తేలేదు'' అంత బాధలోనూ స్థిరంగా అన్నాడు సూరిబాబు.

ఆ స్థిరత్వం కనకలింగానికి బాగా నచ్చింది.

అతనలాగే ఆ నిర్ణయం మీదే వుండిపోతే అది తనకే మేలు కదా?

ముమ్ముందు ప్రహేళిక వాడిమీద అసహ్యా న్ని పెంచుకుని, తనమీద అనురక్తిని పెంచు కుంటే అది తనకే లాభం కదా?

అందుకే "వెరీగుడ్! కీపిటప్! ప్రేమంటే అదే! ఎప్పటికీ చెక్కు చెదరనిదే ప్రే మంటే..." అంటూ మిత్రుణ్ణి ఎగదోశాడు.

సూరిబాబు ఆ మాటలకి సంతృప్తిగా నవ్వి పూరుకున్నాడు.



తెల్లవారేసరికి సూరిబాబుకి బాగా జ్వర మొచ్చేసింది. మస్తానయ్య కొట్టించిన దెబ్బ లన్నీ బాగా మోపుచేశాయి!

మిత్రుడి పరిస్థితి చూస్తుంటే కనకలింగా నికి చాలా గాబరావేసింది.

"ఇవి సామాన్యమైన దెబ్బలల్లే లేవురా? హాస్పిటల్లో జాయిన్‌చేస్తా పద..." అన్నాడు మిత్రుడికి హార్లిక్స్ అందిస్తూ.

"ఎందుకులేరా- అదే తగ్గిపోతుందిలే' అన్నాడు సూరిబాబు.

"నీ బొంద! ఒళ్ళు పెనంలా మాడిపో తోంది! దానంతటదే తగ్గిపోవడానికి ఇదేవ న్నా కాస్తాకూస్తా జ్వరమనుకుంటున్నావా?" అంటూ అతన్ని కేకలేసి బలవంతాన్న హాస్పిటల్‌కు బయల్దేరదీశాడు కనకలింగం.

ఆవిధంగా సూరిబాబుని హాస్పిటల్లో అడ్మిట్ చేశాక అలా ఓసారి ప్రహేళిక వాళ్ళ ఇంటికి వెళ్ళాడు కనకలింగం.

అతను వెళ్లేసరికి భానుప్రకాశ్ ఆ సమ యంలో ఇంట్లోనే వున్నాడు.

"నువ్వా! ఏంటిలా వచ్చావ్?" అన్నాడు కనకలింగాన్ని గుర్తుపట్టి.

అంతలో "నా కోసంలే నాన్నా'' అంటూ అక్కడికి వచ్చింది ప్రహేళిక.

హమ్మయ్య అనుకున్నాడు కనకలింగం.

ఆమె అలా సమయానికి రాకపోయుంటే ఏం చెప్పాలో తోచక చచ్చూరుకునేవాడే!

"నీ కోసమా?! ఇతన్తో నీకేంటి పని? అసలితను నీకెలా పరిచయమయ్యాడు?" అన్నాడు భానుప్రకాశ్. తనకు తెలియకుండా ఏదో గూడుపురాణీ జరిగిపోతున్నట్టుగా అనిపించిందాయనకి.

"ఎలా పరిచయమైతేనేం... హి ఈజ్ మై వెల్ విషర్ నాన్నా!" అంది ప్రహేళిక.

"వెల్ విషరా? ఇన్ వాట్ వే?" అన్నాడు భానుప్రకాశ్.

"ఆ సూరిబాబు పొగరణచడానికి వీరు నాతో సహకరిస్తున్నారు నాన్నా'' అంది ప్రహేళిక.

"ఏమయ్యా నిజమేనా? ఈ విషయంలో నీకేంటీ అంత ఇంట్రస్టు?" భానుప్రకాశ్ కనకలింగంవైపు తిరిగి అడిగాడు.

"ఇంట్రస్ట్ కాదు సార్! అది నా బాధ్యత. మీ డాటర్ అంతటివార్ని కాదని నా ఫ్రెండ్ సూరిబాబుగాడు ఎవరో ఓ దరిద్రురాల్ని ప్రేమించటం చాలా హారిబుల్ సార్! అజ్ఞానంలో వున్న మిత్రుడి కళ్ళు తెరిపించటం నా కర్తవ్యం కదా. అందుకే..."

"ఊ అందుకే'?

"వెధవని తుక్కురేగదన్ని హాస్పిటల్లో జాయిన్ చేసొచ్చాను సార్!" ఏదో ఒకటి చెప్పాలి గనుక చటుక్కున నోటికొచ్చిన కోత కోసేశాడు కనకలింగం.

"నిజంగానా?" ఆశ్చర్యపోయాడు భానుప్రకాశ్.

ప్రహేళిక కూడా ఆశ్చర్యంగా చూసింది కనకలింగంవైపు.

"నిజం సార్! కావాలంటే నాతోపాటు హాస్పిటల్కి రండి'' అన్నాడు కనకలింగం.

"ఇదెక్కడి విడ్డూరమయ్యా! నీ స్నేహితుణ్ణి నువ్వే తుక్కు రేగతన్నటమా? దట్టూ హాస్పిటల్లో అడ్మిటవాల్సినంత ఘోరంగా? చాలా విచిత్రమైన మనిషిలా వున్నావే..." అన్నాడు భానుప్రకాశ్.

ప్రహేళికక్కూడా అలాగే అనిపించింది. "మీరు చెబుతున్నది నిజమో కాదో వెంటనే తెలుసుకోవాలి! పదండి హాస్పిటల్కి..." అంది సోఫాలోంచి లేస్తూ.

"నా మాటమీద నమ్మకంలేదా? సరే నడవండైతే'' అన్నాడు కనకలింగం తనుకూడా కుర్చీలోంచి లేస్తూ.

ఇదేదో తేల్చుకోవాల్సిన విషయమే అనిపించి, "నేనూ వస్తున్నానాగండి'' అన్నాడు భానుప్రకాశ్.

★ ★ ★

వీళ్ళు వెళ్లేసరికి సూరిబాబు స్పృహలోలేడు.

దెబ్బల తాలూకు నొప్పిని భరించలేక అతను కుయ్యో, మొర్రో అంటుంటే అంతకు ముందే సెడేషన్ ఇచ్చారు. అందుచేతే అతను మత్తుగా నిద్రపోతూ వున్నాడు.

బెడ్మీద అచేతనంగా వున్న సూరిబాబుని చూశాక అప్పుడు నమ్మగలిగారా తండ్రీ కూతుళ్ళు కనకలింగం మాటల్ని.

"నిజంగా మీరే కొట్టేరా ఇతన్ని?" అప్పటికీ కాస్త సందేహంగానే అడిగింది ప్రహేళిక.

"మీకాడౌటుంటే వాడు స్పృహలోకి రాగానే మీరే అడిగి తెలుసుకోండి'' అనేశాడు కనకలింగం ఏమాత్రం తడబడకుండా.

"నిజమే అయ్యుంటుంది లేమ్మా! మనిషి ఎదురుగా కనిపిస్తూనే ఉన్నాడుగా'' అనేసి "మొత్తానికి భలే మనిషివయ్యా నువ్వు'' అంటూ కనకలింగం భుజంమీద చరిచాడు భానుప్రకాశ్.

'ఆ మాట మీరంటే ఏం లాభం? మీ కూతురనాలిగాని?' అని మనసులో అనుకుని "ఇహిహి..." అని నవ్వేశాడు కనకలింగం.

"చూడ్డం అయ్యిందిగా! ఇంక వెళ్దాం



పదమ్మా'' అన్నాడు భానుప్రకాశ్.

"సరే నాన్నా'' అంది ప్రహేళిక.

"సరేసార్! మీరు వెళ్ళండైతే! నేనీ వెధవ కి సేవలు చేస్తూ కూర్చోవాలిగా'' అంటూ వాళ్ళని వార్డు బైటిదాకా సాగనంపాడు కనక లింగం.

"భలే మనిషివయ్యా మొత్తానికి! చావగొ ట్టిందీ నువ్వే, సేవలు చేస్తున్నదీ నువ్వే'' అన్నాడు భానుప్రకాశ్.

తండ్రి అలా ఒకటికి నాలుగుసార్లు కనక లింగాన్ని భలే మనిషి అనడంతో విచిత్రాలప ట్ల విచిత్రమైన వ్యామోహం వున్న ప్రహేళి కకు కనకలింగం మీద అదోలాంటి ఇంట్రస్ట్ ఏర్పడింది!

'నిజమే! ఎంత విచిత్రమైన మనిషి కాక పోతే మిత్రుణ్ణలా చావగొడ్తాడు' అనుకుంది మనసులో.

ఆ తండ్రీ కూతుళ్ళిద్దరూ వెళ్ళిపోయాక వార్డులోకి తిరిగొచ్చి మిత్రుడి మంచంపక్క నే స్టూల్‌మీద కూర్చున్నాడు కనకలింగం.

మంచికో చెడ్డకో ఓ అబద్ధం ఆడేశాడు తను. పర్యవసానం ఏమైనా కానీ దాన్నిపు డు నిజంచెయ్యాలి!

సూరిబాబు స్పృహలో కొచ్చేవరకూ అక్కడే కూర్చుని, అతను కళ్ళు తెరవగానే అతనికి విషయం చెప్పి "సో.... నిన్ను కొట్టింది నేనేనని నువ్వా ప్రహేళిక ముందు ఒప్పుకోవాలిరా!" అన్నాడు కనకలింగం.

"కుంటే?" బాధగా మూలుగుతూ అన్నా డు సూరిబాబు.

"నేనొక విచిత్రమైన మనిషినని ఆ ప్రహే ళిక నమ్ముతుంది'' సిగ్గుతో తల దించు కుంటూ అన్నాడు కనకలింగం.

"నమ్మితే?"

"ఆమెకు నామీద ఇంట్రస్టేర్పడుతుంది''

"ఏర్పడితే?" అనబోయి మానేశాడు సూ రిబాబు. అతనికి చూచాయగా విషయం అర్థమైపోయింది.

"వార్నీ! అయితే అదన్నమాట నీ ఎత్తు?" అన్నాడు విస్మయంగా.

"అవున్రా! నువ్వెలాగూ వద్దనుకుంటు న్నావ్‌గా! ఆ అవకాశాన్ని నేను వినియో గించుకుంటే తప్పేంటి?" అన్నాడు కనక లింగం.

"ఎంత మాత్రం కాదు..." మిత్రుడికి షేక్‌హేండివ్వబోయి భుజం కలుక్కుమన డంతో "అబ్బా!" అన్నాడు సూరిబాబు.

★ ★ ★

స్నానం చేసేందుకని హాస్పిటల్‌నుంచి రూంకొచ్చిన కనకలింగానికి అరుగుమీద కూర్చుని వున్న సుజీవన కనిపించింది.

"ఎవరండీ మీరు?" అన్నాడు కనక లింగం ఆమె సుజీవన అని పోల్చుకోలేక.

"నా పేరు సుజీవనండీ! సూరిబాబుగారి కోసం వచ్చాను'' అంది సుజీవన లేచి నిలబడి చీరకంటిన దుమ్ము దులుపుకుంటూ

"మీరా? రండి లోపలికి. నేను వాడి రూమ్మేట్ కనకలింగాన్ని'' అంటూ తా ళంతీసి తలుపులు బార్లా తెరిచాడు కనక లింగం.

"సూరిబాబుగారు లేరా?"

"లేడండీ! హాస్పిటల్లో వున్నాడు'' అంటూ లోపలికి దారితీశాడు.

సుజీవన సహజంగానే గాభరా పడింది.

"హాస్పిటల్లోనా? ఏమైంది వారికి?" కంగా రుగా అడిగింది అతన్ని అనుసరిస్తూ.

"దెబ్బలు తగిలాయ్. అలా కూర్చోండి మేడమ్! అన్నీ వివరంగా చెప్తాగా?" అన్నా డు కనకలింగం, తనూ ఓ కుర్చీలో కూర్చుంటూ.

"ఎలా తగిలాయ్!" ఆమె అతను చూ పిన కుర్చీలో కూర్చుంటూ మరింత ఆత్రంగా అడిగింది.

"మస్తానయ్య కొట్టించాడు''

"మస్తానయ్యెవరు?"

"మావాడి కరపత్రం చూసొచ్చిన ఒకానొక మహాకాయుడు'' అంటూ ప్రారంభించి విషయం యావత్తూ ఆమెకు వివరంగా చెప్పుకొచ్చాడు కనకలింగం. పనిలోపనిగా ప్రహేళికతో తానాడిన అబద్ధం గురించి కూడా చెప్పి- "ఈ విషయంలో మీరు కూడా కొంచెం సహకరిస్తే అటు నా కథ కూడా సుఖాంతమవుతుంది మేడమ్'' అన్నాడు కనకలింగం.

"అంతకన్నానా? చెప్పండి నేనేం చెయ్యాలో?" అంది సుజీవన.

అప్పుడు తోచింది కనకలింగానికి ఓ మెరుపులాంటి ఆలోచన.

దాన్నే ఆమెకు చెప్పటం ప్రారంభించాడు.

★ ★ ★

"మొత్తానికి ఊబిలో కూరుకుపోయానండీ'' బాధగా అన్నాడు కనకలింగం.

"ఏమైందండీ?" అతనివైపు ఆసక్తిగా చూస్తూ అడిగింది ప్రహేళిక.

"అదేదో సామెత చెప్పినట్టుగా అయ్యిందండీ! నేనేమో వాడికి బుద్ధి చెప్పాలన్న ఉద్దేశంతో దేహశుద్ధి చేస్తే- నన్నొక వీరుడిగా జమకట్టేసి వాడి ఫియాన్సీ కాస్తా నా వెంటపడిందండీ..." దాదాపుగా జుట్టు పీక్కుంటూ అన్నాడు కనకలింగం.

"ఏంటి లింగంగారూ? ఏంటి మీరంటోంది?" ప్రహేళిక ఆశ్చర్యపోయింది.

"అవునండీ! ఈ లెటర్ చూడండి. విషయం మీకే తెలుస్తుంది'' అంటూ షర్ట్ జేబులోంచి ఓ కాగితాన్ని బైటకు తీసి ఆమె కందించాడు కనకలింగం.

అందుకుని అందులోకి దృష్టి సారించింది ప్రహేళిక.

"శ్రీ కనకలింగంగార్కి,

నా పేరు సుజీవన. నేనెవర్నో మీకు తెలుసుకదా?

ఈరోజు సూరిబాబుగారి కోసమని మీ రూంకొస్తే అతను హాస్పిటల్లో వున్నాడని తెలిసింది. మీ పక్క పోర్షన్ వాళ్ళు చెప్పారు. సరేలెమ్మని హాస్పిటల్‌కి వెళ్తే అక్కడ సూరిబాబుగారు నాకు సంగతంతా చెప్పారు.

అతని భవిష్యత్తు బాగుండాలన్న సదుద్దేశంతో మీరతని మీద చెయ్యి చేసుకోవడం నాకు నచ్చింది. మీది తొందరపాటే అయినా దాని వెనుక మీకు మీ మిత్రుడి మీదున్న ఆపేక్షని నేనర్థం చేసుకోగలిగాను. కాగా సూరిబాబుగారు మీ చేతిలో అన్ని దెబ్బలు తినటం నాకు చాలా ఏవగింపును కలిగించింది. మగాడికి ఏమున్నా లేకపోయినా పౌరుషం మాత్రం వుండితీరాలి. భీరువులా మీ చేతిలో దెబ్బలు తిని హాస్పిటల్లో అడ్మిటైన ఆ మనిషిని చూస్తుంటే ఛీ! ఈ మనిషినా నేను ప్రేమించింది? అనిపించింది. తన రూమ్మేట్ చేతిలో చావుదెబ్బలు తిన్నవాడు రేపొద్దున్న కట్టుకున్న భార్యనేం కాపాడగలుగుతాడు?

ఏ స్త్రీ కూడా అలాంటి పిరికివాడ్ని భర్తగా కోరుకోదు.

అందుకే అతనిమీద మనసు చంపుకుని మీమీద ఇష్టాన్ని పెంచుకుంటున్నాను. మీకు అభ్యంతరం లేకపోతే మీ మనసులో నాకు చోటివ్వగలిగితే దాన్ని నా అదృష్టంగా భావిస్తాను.

ఏ విషయమూ వెంటనే తెలియజేస్తారుకదూ?

మీ (?)
సుజీవన"

చదవడం ముగించిన ప్రహేళిక ముఖంలో రంగులు మారేయ్.

"ఛీ! అదీ ఒక ఆడదేనా?!!" అంది ముఖాన్ని వికారంగా పెడుతూ.

"నాకూ అలాగే అనిపించిందండీ! ఆ ఉత్తరాన్ని నా చేతికందించి- ఇప్పటికిప్పుడే మీ అభిప్రాయం చెప్పి తీరాలంటూ ఎంత ఫోర్స్ చేసిందనుకున్నారు. తర్వాత చెప్తాలే

అని తప్పించుకునేసరికి నా తల ప్రాణం తోక్కొచ్చిందంటే నమ్మండీ'' అన్నాడు ప్యాంట్ జేబులోంచి కర్చీఫ్‌ని తీసి ముఖానికి లేని చెమటని తుడుచుకుంటూ.

"ఇంతకీ మీరేం డిసైడ్ చేసుకున్నారు?"

"ఆ మనిషికి ఎలా బుద్ధి చెప్పాలో తోచకనే మీ దగ్గరికి పరిగెత్తుకొచ్చానండీ'' అన్నాడు- 'నాకిప్పుడు మీరే దిక్కు సుమా' అన్నట్టుగా చూస్తూ.

"అయితే మీ కావిడమీద ఇష్టం కలగలేదా?" ప్రహేళిక అతనివైపు సూటిగా చూస్తూ అడిగింది.

"ఇష్టమా? ఆవిడ మీదా?! భలేవారండీ!! దెబ్బలు తగిలి హాస్పిటల్లో వున్న ప్రియుణ్ణి చూసి బాధపడాల్సిందిపోయి అతన్ని కాదని నా వెంటపడిన అలాంటి స్త్రీ మీద. చఛ... నాకే కాదు. ఏ మగాడికీ ఇష్టం కలగదు'' అన్నాడు కనకలింగం వీలైనంత ఏవగింపుగా.

అతనలా అంటుంటే 'ఇతను విచిత్రమైన మనిషి మాత్రమే కాదు, ఉత్తముడు కూడా' అనిపించింది ప్రహేళికకు.

కోటి రూపాయలిచ్చినా ఆ సూరిబాబు మనసునొదులుకోనని చెప్పి తనని అవమానించిన ఆ సుజీవన పొగరణచాలీ అంటే ఆమె ఇపుడు కోరుకుంటోన్న ఈ కనకలింగాన్ని ఆమెకు దక్కనియ్యకూడదు! ఆ సూరిబాబుగాడితోనే ఆమె సరిపెట్టుకోవాలి!

ఆ ఆలోచన వచ్చిందే తడవుగా ఆమె చటుక్కున కుర్చీలోంచి లేచి కనకలింగాన్ని సమీపించింది.

"మీరు పొరపాట్నకూడా దాని ప్రపోజల్‌కి ఒప్పుకోకండి'' అంది. అతను కూర్చున్న కుర్చీ హ్యాండిల్‌మీద ఓ చెయ్యివేస్తూ.

"చఛ! అలా ఒప్పేసుకునేవాణ్ణే అయితే మీ సలహాకోసం ఎందుకొస్తానండీ?" అన్నాడు కనకలింగం.





"దట్స్‌గుడ్! నాకోసం మీ ఫ్రెండుని చితకతన్నిందే కాకుండా వలచి వచ్చిన ఆడదాన్ని కాదంటోన్న మీ విజ్ఞత కూడా నాకెంతో నచ్చింది'' అంది ప్రహేళిక.

"అయినా ఏం లాభం లెండి? మీకు నచ్చింది నా విజ్ఞత తప్ప నేను కాదు కదా!" అన్నాడు కనకలింగం.

అలా అంటున్నప్పుడతని ముఖం సామ్రాజ్యాన్ని కోల్పోయిన చక్రవర్తిలా వుండటం చూసి ప్రహేళికలో తనకు తెలియకుండానే అతనిమీద జాలి కలిగింది.

"అదేం మాటండీ! మీ విజ్ఞత నచ్చిందీ అంటే మీరు కూడా నచ్చారనే కదా?" అనేసింది చటుక్కున.

తీరా అన్నాక ఆమెకు సిగ్గు ముంచుకొచ్చింది.

"నిజంగానా? అబ్బ!!! నేనెంత అదృష్టవంతుణ్ణండీ!" అన్నాడు కనకలింగం ఆనందంగా.

తన అదృష్టం ఇంత తేలిగ్గా పండుతుందనీ తన పన్నాగం ఇంత తేలిగ్గా సత్ఫలితాన్నిస్తుందనీ అతనూహించి వుండలేదేమో. అలా అన్నాక ఆశ్చర్యంతో నోరు తెరిచి అలాగే ఉండిపోయాడు చాలాసేపు.

★ ★ ★

"వాట్వాట్వాట్?" ఆశ్చర్యంగా అన్నాడు సూరిబాబు.

"అవున్రా! ఆ ప్రహేళిక ఇపుడు నా ఫియాన్సీ!" అన్నాడు కనకలింగం గర్వంగా భుజాలెగరేస్తూ.

"ఎలా సాధ్యపడింది ఇది?" దెబ్బల సంగతి మర్చిపోయి దిగ్గున లేచి కూర్చుంటూ అడిగాడు సూరిబాబు.

"నీ ఫియాన్సీ దయవల్ల'' అంటూ నవ్వి తన పన్నాగం ఎలా ఫలించిందీ మిత్రుడికి వివరించి చెప్పాడు కనకలింగం.

"అలాగా! చాలా సంతోషంరా! మొత్తానికి ఆ మస్తానయ్య దెబ్బలవల్ల అంతా మంచే జరిగిందన్నమాట!" అంటూ తన ఒంటిమీదున్న దెబ్బలకేసి ఆప్యాయంగా చూసుకుని

"సరే! ఇకమీదట ఏం చెయ్యాలీ?" అనడిగాడు సూరిబాబు.

"నీ బొంద! ఏమిట్రా ఆ పిచ్చి ప్రశ్న?" అంటూ మిత్రుడి నెత్తిన ఓ మొట్టికాయ వేసి,

"ఆ దైవం మనల్ని చల్లని చూపు చూశాడ్రా! కథ సుఖాంతమైపోయాక ఇంకా ఆలోచనేమిట్రా- అంతా ఆచరణే!" అన్నాడు కనకలింగం.

"అంటే?" అన్నాడు సూరిబాబు అమాయకంగా.

"అరటిపండు వలిచి నోట్లో పెట్టినట్టు చెబితే తప్ప అర్థంకాదా ఏమిట్రా నీకు?" అంటూ మిత్రుడి నెత్తిమీద మరో మొట్టికాయ వేసి,

"ఏముందీ, జై మస్తానయ్యా! అంటూ నువ్ నీలోని ప్రేమార్తి చల్లారేదాకా ఆ సుజీవనని ప్రేమించేస్తూవుండు. అదేవిధంగా నేను ప్రహేళికను ప్రేమిస్తూ వుంటాను'' అన్నాడు కనకలింగం హాయిగా నవ్వేస్తూ.

"తర్వాత?" అన్నాడు సూరిబాబు.

"ఏముంది? ప్రేమ తర్వాత పెళ్ళే కదా?"

జోకులా అనిపించిన ఆ జీవనసత్యానికి సూరిబాబు హాయిగా నవ్వేసి, ఆ మీదట "అబ్బా!" అన్నాడు ఎక్కడో కలుక్కుమనటంవల్ల.

"నీ బొంద! ఇంతలోనే నవ్వి అంతలోనే అబ్బా అంటావేంట్రా?! అబ్బా అమ్మలకూ, అస్సో ఉస్సోలకూ మన జీవితంలో ఇంక తావులేదు. మన ఇద్దరి జీవితాల్లోనూ వసంతం వచ్చేసింది'' మిత్రుణ్ణి కూకలేస్తూ తన్మయంగా అన్నాడు కనకలింగం.

తన్మయం కలగదా మరి? వెంట్రుకని ముడేసి కొండని లాగితే కొండే కదిలొచ్చేసిందాయె! సామాన్యమైన విషయమా అది? 'సార్ కొరియర్స్...', 'మేడమ్ కొరియర్స్' అంటూ ఆఫీస్‌లెంటా, కొంపలెంటా తిరిగితేనే తప్ప పొట్ట గడవని తను త్వరలోనే భానుప్రకాష్‌లాంటి బిజినెస్ మాగ్నెట్‌కి ఏకైక అల్లుడు కాబోతున్నాడూ అంటే... నిజంగా ఎంత గొప్ప విషయం అది? అసంభవంలాంటి అలాంటి గొప్పవిషయం సంభవిస్తున్నప్పుడు తన్మయం కలగకుండా ఎవరికుంటుంది?

ముఖ కవళికల్ని బట్టి మిత్రుడి తన్మయావస్థని గమనించి... తనుకూడా తన్మయానంద భరితుడవుతూ "మనిద్దరి జీవితాల్లో వసంతం ఉరుక్కుంటూ వచ్చేసిందని నాకూ తెలుసులేవో! కాకపోతే కుడికాలి పిక్కదగ్గర కలుక్కుమనటంవల్ల అబ్బా అన్నానంతే'' అంటూ మరోసారి హాయిగా నవ్వేసి, మళ్ళీ "అబ్బ'' అన్నాడు సూరిబాబు.

"నీ బొంద! ఎందుకురా అలా మాటిమాటికీ నవ్వుతావు? నవ్వితే కుడికాలి పిక్కదగ్గర కలుక్కుమంటుందని ఆపాటి తెలీదా?" అంటూ కనకలింగం మళ్ళీ కూకలేశాడు మిత్రుణ్ణి.

"కుడికాలి పిక్కకి కూసింత జండూ బాం అయినా పుయ్యరా..." అన్నాడు సూరిబాబు తనుకూడా ముచ్చటగా మిత్రుణ్ణి కూకలేస్తూ.

వాళ్ళిద్దరూ ఇక్కడ ఇలా తన్మయావస్థలో వుండగా...

అక్కడ...

ప్రహేళిక వాళ్ళింట్లో....

★ ★ ★

"నథింగ్ డూయింగ్'' అన్నాడు భానుప్రకాష్ యమ సీరియస్‌గా.

పుట్టి బుద్ధెరిగినప్పట్నుంచీ తండ్రిముఖంలో అలాంటి సీరియస్‌నెస్‌ని ఏనాడూ చూసెరుగని ప్రహేళిక సహజంగానే ఒకింత గాభరాపడింది.

"నాన్నా..." అంది ఆందోళనగా.

"అవునమ్మా... నా కంఠంలో ప్రాణముండగా దీనికొప్పుకోను'' సీరియస్‌నెస్‌ని ఇంకా అలాగే కంటిన్యూ చేస్తూ అన్నాడు భానుప్రకాష్. "తల్లిలేని పిల్లవుకదాని అల్లారు ముద్దుగా పెంచితే నీ ఆగడాలు రోజురోజుకీ మితిమీరుతున్నాయి. అసలు జీవితం అంటే ఏంటనుకున్నావు నువ్వు?!!! ఆషామాషీగా ఏ

నిర్ణయం పడితే ఆనిర్ణయం తీసేసుకోవడమే నా? మొన్నటిదాకా ఆ సూరిబాబన్నావు. ఇప్పుడేమో వీడెవడో బోడిలింగం అంటు న్నావు? అసలు మన స్టేటస్ ఏంటి? నువ్వు ఎంపిక చేసుకునే మనుషులు ఎలా ఉండాలి?"

ఉరిమినట్టుగా ఆయన అలా అంటుంటే ప్రహేళిక మొదట కాస్త భయపడినా అంతలో నే ధైర్యం తెచ్చుకుంది.

"ఆ సుజీవన పొగరణగాలీ అంటే నేనా కనకలింగాన్ని చేసుకునే తీరాలి నాన్నా'' అనేసింది పిడికిళ్ళు బిగిస్తూ.

"డోంట్ బి ఫూలిష్! మొన్నటిదాకా ఆ సూరిబాబు పొగరణచాలన్నావు. ఇప్పుడేమో సుజీవన పొగరంటున్నావు. అసలింతకీ నువ్ అణచాల్సింది వాడి పొగరా, ఆమె పొగరా?" ఏ మాత్రం పట్టు సడలినా కూతురు నెత్తికెక్కి కూర్చుంటుందని ఆగ్రహాన్నలాగే కొనసాగి స్తూ అన్నాడు భానుప్రకాష్.

"ఇద్దరిదీనూ. ఇద్దరూ కలిసే అవమా నించారు నన్ను'' ప్రహేళిక ధైర్యాన్ని పుంజు కుంటూ అంది. "కోట్లిచ్చినా సూరిబాబు నొదులుకోనన్న ఆ రాస్కెల్ ఇపుడు కనక లింగాన్ని ఆశిస్తోంది. దాని రోగం కరెక్ట్‌గా కట్టాలీ అంటే దానికతను దక్కకూడదు''

"అదే నీ కోరికైతే ఆ కనకలింగం మొహా న్న ఎంతో కొంత పారేసి అతన్నీ ఊరు విడిచి వెళ్ళిపోమందాం. అంతేగానీ అదెవత్తిమీదో కోపంకొద్దీ నీ జీవితాన్ని పాడుచేసుకుంటా నంటావేంటి? కోటీశ్వరురాలువైన నీకు కొరి యర్లిచ్చేవాడు మొగుడా? ఛ...! ఎంత ఎబ్బె ట్టుగా ఉందిది? కొరివితో తల గోక్కోవడం అని దీన్నే అంటారు."

భానుప్రకాష్ అప్పటికే ఆ మిత్రద్వయం గురించి వివరాలన్నీ సమగ్రంగా కూపీతీసి ఉన్నాడేమో, సూరిబాబుకన్నా కటిక దరిద్రు డైన కనకలింగం బారినుండి తన కూతుర్నె లాగైనా రక్షించుకోవాలన్న ఉద్దేశంతో అలా ఓ కొత్త ప్రతిపాదన చేశాడు.

"కనకలింగం అలాగేం డబ్బుకి లొంగ డు. అతను చాలా విచిత్రమైన వ్యక్తి'' కాన్ఫిడెంట్‌గా అంది ప్రహేళిక.

"ఈ విచిత్రాల పిచ్చితోనే వ్యవహారా న్నింతదాకా తెచ్చావు. నీకంతగా విచిత్రమైన వ్యక్తే కావాలంటే ఏ ఆఫ్రికావాణ్ణో చేసుకో. అంతేగానీ ఆ కటిక దరిద్రుడి ఊసింక ఎత్తకు'' పిడికిళ్ళు బిగించటం నాకూ వచ్చు అన్నట్టు తనుకూడా పిడికిళ్ళు బిగిస్తూ అన్నా డు భానుప్రకాష్.

"అతను కటిక దరిద్రుడైతేనేమి? సొంత మిత్రుణ్ణి చితకదన్ని, హాస్పిటల్లో చేర్పించిన విచిత్రమైన వ్యక్తి. వలచివచ్చిన ఆడదాన్ని తృణప్రాయంగా తిరస్కరించిన మగధీరు డు. అతనికి ఆస్తి లేకపోతేనేం మనకుందిగా? నేనతన్ని చేసుకునే తీర్తాను'' 'మొండివాడు రాజుకన్నా బలవంతుడ'న్న సామెత స్ఫుర ణకు రాగా పూర్తిగా మొండికెత్తేస్తూ అంది ప్రహేళిక.

కూతురి మొండితనానికి లోలోన బాధప డుతూ, "అదే గనక జరిగితే నీకింక ఈ తండ్రి ఉండడు'' అంటూ ఆఖరి అస్త్రాన్ని ప్రయోగించాడు భానుప్రకాష్.

దాంతో ఆయనూహించినట్టే ప్రహేళిక ఒకింత మెత్తబడింది.

"నాన్నా..." అంది ఆవేదనగా.

"అవునమ్మా. పట్టుదల విషయంలో నేను నీకన్నా మొండివాణ్ణి. ఆ బోడిలింగంగాడి విషయంలో నువ్ నీ మనసు మార్చుకోకపో తే నేను అన్నంతపనీ చేసి తీర్తాను'' కోటు బటన్స్ సరిచేసుకుంటూ కొనసాగించాడు భా నుప్రకాష్. "నువ్ నాకు ఒక్కగానొక్క కూతు రువి. నీకు అవమానం జరిగితే అది నాకూ అవమానమే. నీ పంతం నెరవేరాలని నేనూ కోరుకుంటాను. నీ పగ చల్లారాలని నేనూ ఆశిస్తాను. కానీ అందుకోసం నీ జీవితాన్ని పాడుచేసుకోవాల్సిన అవసరం ఏముంది? ఆ కనకలింగం సుజీవనని చేస్కోకూడదు. అదే గా నీక్కావల్సింది? ఆ మేరకు నా తంటా లేవో నేను పడతాను సరేనా?"




ప్రహేళిక కాసేపు ఏమీ మాట్లాడలేకపోయింది.

చివరికి "సరే నాన్నా! నీ ఇష్టం" అనేసింది అర్థమనస్కంగానే.

తండ్రి అంతగా బెదిరించాక కాదూ కూడదూ నేనాకనకలింగాన్నే చేసుకుంటానని ఏ విధంగా పట్టుబట్టగలదామె?

కనకలింగంమీద మరీ అంత విపరీతమైన ప్రేమైతే ఏర్పడిపోలేదు కదా ఇంకా?

అందుకే... తన తండ్రికోసం అలా రాజీపడిపోయిందామె?

★ ★ ★

"నో..."

గుండెలో ఆటంబాంబేదో బద్దలైనట్టనిపించి బిగ్గరగా అరిచాడు కనకలింగం.

"ఏంటి ప్రహేళికగారూ మీరంటోంది?" వణుకుతున్న కంఠంతో అడిగాడు అరవటం అయ్యాక.

"సారీ మిస్టర్ లింగంగారూ, నిన్న ఏదో అనాలోచితంగా అలా అనేశాను. కానీ తీరా మా నాన్నతో మన పెళ్ళి విషయం కదిపేసరికి ఆయనససేమిరా వీల్లేదంటున్నారు. చస్తానని బెదిరిస్తున్నారు. ఇలాంటి క్లిష్టపరిస్థితిలో నేనేం చేయగలను చెప్పండి'' కంఠంలో ఒకింత పశ్చాత్తాపాన్ని ధ్వనింపచేస్తూ అంది ప్రహేళిక.

'చస్తే చావనివ్వండి ముసలి వెధవని' అని గట్టిగా అరవాలన్నంత ఆవేశమొచ్చింది గానీ ఎలాగో అతికష్టమ్మీద నిగ్రహించుకున్నాడు కనకలింగం.

"ప్రహేళికగారూ'' అన్నాడు మరింత బాధగా.

"సారీ అన్నాగా..." ప్రహేళిక తల దించుకుంటూ అంది.

"ఏంటండీ సారీ? మీ బొంద సారీ! మీ మాటలు నిజమని నమ్మి రాత్రంతా ఎన్నెన్నో రంగురంగుల కలలు కన్నాను. తెల్లారేసరికల్లా ఆ కలలన్నింటినీ కల్లలుగా మార్చేసి నా గుండెని తూట్లు పొడిచేసి పైగా సారీ అంటున్నారా?" అంటూ ఆమెని కూడా ఛడామడా దులిపేయాలన్నంత కోపమొచ్చింది కనకలింగానికి.

అయినా ఈసారికూడా ఎలాగో అతికష్టమ్మీద నిగ్రహించుకున్నాడు.

"మరైతే నన్నిపుడేం చెయ్యమంటారు?"

"నే చెబుతాగా ఏం చెయ్యాలో?" అంటూ అప్పుడు కథలోకి ఎంటరయ్యాడు భానుప్రకాష్.

"నువ్వెప్పుడొచ్చావ్ నాన్నా బయటికెళ్ళావ్‌గా?" అంది ప్రహేళిక రవంత కంగారుపడుతూ.

"ఇప్పుడే వచ్చాను. ఈ దొరగార్లకోసమని రూంకెళ్తే తాళమేసుంది. సరేలెమ్మని వెనక్కొచ్చాను..." అని చెప్పి అక్కడే ఖాళీగా వున్న మరో సోఫాలో కూర్చున్నాడు భానుప్రకాష్. ఆ మీదట కనకలింగం వైపు తీక్షణంగా చూస్తూ అడిగాడు.

"ఏంటయ్యా నువ్వేదో ప్రపంచం మునిగిపోయినట్టు తెగ వర్రీ అయిపోతున్నావు?"

ఆయన ప్రశ్నకి సహజంగానే కాస్త కంగారుపడ్డాడు కనకలింగం.

"అబ్బే... అహఁ... ఏం లేదండీ'' అన్నాడు తడబడుతూ.

"ఏమీ లేకపోవడమేంటి? అమ్మాయి నా కంతా చెప్పిందిలే... సో ఆ సుజీవన ఇప్పుడు నీ వెంటపడుతూ ఉందన్నమాట?" తల పంకిస్తూ అడిగాడు భానుప్రకాష్.

అలా తల పంకించడంతో 'కథలుగాని వినిపిస్తున్నావా?' అనే ఓ క్రూరమైన ప్రశ్న లాంటిది ధ్వనించింది... ఈసారి మరింతగా తడబడిపోయాడు కనకలింగం. "అబ్బే... ఒట్టండీ... అహఁ... నిజమండీ...! ఆమె నా చుట్టూ దీపంపురుగులా తిరుగుతోందండీ'' అన్నాడు కంగారులో ఓ ఉపమానాన్ని కూడా జోడిస్తూ.

"మరైతే చేసుకోవడానికి అభ్యంతరం దే




నికి?"

"ఆమె క్రూరురాలండి. మొదట ప్రేమించిన వాడు హాస్పిటల్లో వున్నాడన్న కనికరమైనా లేకుండా అంత ఈజీగా మనసు మార్చేసుకుని ఇపుడు నావెంట పడుతోంది. అలాంటి చపలచిత్తురాల్ని ఎలా చేస్కోమంటారు చెప్పండి?" అధైర్యాన్ని తరిమికొడుతూ సాధ్యమైనంత హుందాగానూ, గంభీరంగానూ అన్నాడు కనకలింగం.

భేషైన మాట! అనుకుంది ప్రహేళిక మనసులో.

"ఆమెని క్రూరురాలంటున్నావ్! మిత్రుణ్ణి చావగొట్టిన నువ్ మాత్రం క్రూరుడివి కావా?" వెటకారంగా అన్నాడు భానుప్రకాష్.

"నేనలాచేసింది కేవలం వాడిశ్రేయస్సు కోసమండీ! కానీ ఆ అమ్మాయి..."

"ఊc... ఆ అమ్మాయి?" కళ్లెగరేశాడు భానుప్రకాష్.

'ఎలాపూర్తిచెయ్యాలో తెలీకేకదా మధ్యలో ఆపేస్తే' అని మనసులో సణుక్కుని-

పైకిమాత్రం "క్రూరురాలండీ'' అంటూ మళ్ళీ అదేమాటన్నాడు కనకలింగం.

"దాన్ని క్రూరత్వమనరు..."

"మరి?"

ఈసారి భానుప్రకాష్‌కి తోచలేదు ఏం చెప్పాలో. "ఏదో ఒకటిగానీ మనం అసలు విషయంలోకి వద్దామా?" అన్నాడాయన క్షణంతర్వాత.

"చెప్పండి..." అన్నాడు కనకలింగం.

"మా అమ్మాయి ఆవేశపు మాటల్ని పట్టించుకుని నువ్ ఆమెమీద ఆశలు పెట్టుకోకు. మా అమ్మాయికి కావాల్సింది నువ్వా సుజీవనని చేస్కోకుండా ఉండటం..."

మొదటివాక్యానికి మనసులో చాలా బాధపడి, రెండో వాక్యానికి ఎదురుప్రశ్నతో బదులిచ్చాడు కనకలింగం. "నేను కూడా ఆమెని చేస్కోననే అంటున్నాను కదండీ?"

"అంటున్నావు సరే! కానీ ఇప్పుడు మా అమ్మాయిమీద ఆశలు పెట్టుకోవద్దని స్పష్టంగా చెప్పాను కాబట్టి రేప్పొద్దున పోనీలే ఎవరో ఒకర్లెమ్మని మనసుమార్చుకుంటావేమోనని నా అనుమానం! అలా చేయ్యకుండా ఉండటానికి ఐ మీన్ ఎట్టి పరిస్థితులలోనూ ఆ అమ్మాయిని చేస్కోకుండా ఉండటానికి నీకెంత కావాలో చెప్పు" డైరెక్ట్‌గా 'బేరం'లోకి దిగిపోతూ అన్నాడు భానుప్రకాష్.

ఒక కోన్‌కిస్కాగాడితో మా అమ్మాయి మీద ఆశలు పెట్టుకోవద్దని చెప్పి, ఇలా బేరాలాడాల్సిరావటం మనసులో ఆయనకు చాలా బాధగా అనిపించింది. అవతలి వ్యక్తి మనముందు నిల్చోవటానికి కూడా అర్హత లేని వాడాయె.

ఆయన డైరెక్ట్‌గా అలా క్వశ్చన్ చేసేసరికి అది ఊహించని ఆఫర్ కావటాన్న కనకలింగం మొదట చాలా చాలా కన్ఫ్యూజైపోయాడు.

కథ ఇలా మారిపోయిందేమిటని!

చిక్కినట్టే చిక్కి ప్రహేళిక దక్కకుండా పోతోందేమిటి?

వాట్ టు డు నౌ!

ఈ ఆఫర్ కొప్పుకుని ఎంతోకొంత తీసేస్కోవడమా...లేక?...

ఎటూ తేల్చుకోలేక అతను ఎగశ్వాస ప్రారంభించాడు.

అదిచూసి... "ఏమైందయ్యా! నీగ్గాని ఉబ్బసంలాంటి వ్యాధుందా?" అనడిగాడు భానుప్రకాష్.

"లేదు''

"మరి అలా ఎగబీలుస్తున్నావేంటి?"

"అవును లింగంగారూ అలా శ్వాసిస్తున్నారేంటి?" ప్రహేళిక కూడా తలదూరుస్తూ అడిగింది.

"మరెలా శ్వాసించమంటారు ప్రహేళికగారూ? మీ నాన్నగారు నన్నూ, నా వ్యక్తిత్వాన్నీ డబ్బుతో కొనాలనుకుంటుంటే మరింకెలా



శ్వాసించమంటారు?" దానికీ, శ్వాసకీ సంబంధమేమిటో తెలియకపోయినా యమ సీరియస్‌గా అన్నాడు కనకలింగం. అంత కన్‌ఫ్యూజన్‌లోనూ అతనికో విషయం స్పష్టంగా అర్థమవుతూనే ఉంది. తానిపుడు పుసుక్కున ఎంతో కొంతకి ఒప్పేసుకుంటే వాళ్ళిద్దరి దృష్టిలోనూ చాలా చీప్పైపోతాడు. సో... ఏదేదో వాగి మొత్తానికైతే వ్యవహారాన్ని ఒకపట్టాన తెగనివ్వకూడదు...

అందుకే యమాతి యమసీరియస్‌గా అతనే అన్నాడు మళ్ళీ. "ఎలాగూ డబ్బుప్రస్థావన రానేవచ్చింది కాబట్టి చెబుతున్నా. మీరు నన్నిలా డబ్బుతోనే కొనాలనుకుంటే మాత్రం కోట్లు గుమ్మరించినా నేను దీనికొప్పుకోను..."

"ప్రతి అడ్డమైన వెధవకీ కోట్లంటే అంత చీప్పైపోయాయి..." మనసులో ఉక్రోషంగా అనుకుని,

"ఇంతకీ నువ్వనేదేంటి? ఆ అమ్మాయిని చేస్కునే తీర్తానంటావ్?" అన్నాడు భానుప్రకాష్.

"యా'' అన్నాడు కనకలింగం హుందాగా.

"లింగంగారూ'' అంది ప్రహేళిక ఆశ్చర్యంగా.

"సారీ ప్రహేళికగారూ! నిజానికి ఆ అమ్మాయిని చేస్కోవాలన్న ఉద్దేశం నాలో ఏ కోశానా లేదు. కానీ ఇప్పుడీ విషయాన్ని మీ నాన్నగారు డబ్బుతో ముడిపెట్టారు కాబట్టి నేను డబ్బు మనిషిని కానని నిరూపించుకోవటానికైనా సరే నేనిపుడు ఆమెని చేస్కునే తీర్తాను. అయామ్‌సారీ... అయామ్ హెల్ప్‌లెస్ నౌ' అన్నాడు కనకలింగం బిగిసిపోతూ.

ఇదెక్కడి అడ్డగోలువాదం? అనుకున్నాడు భానుప్రకాష్ మనసులో.

"నిన్నిపుడు డబ్బు మనిషివని ఎవరన్నారయ్యా! డబ్బివ్వకపోయినా ఆమెని చేస్కోననే అంటున్నావ్‌గా సరే అదేమాట మీద ఉండైతే'' అన్నాడాయన అసహనంగా.

"అది ఇందాకటిమాట! ఇంతదాకా వచ్చాక నేనింక వెనుకంజ వేసే ప్రశ్నేలేదు'' అన్నాడు కనకలింగం మరింత బిగిసిపోతూ.

"లింగంగారూ'' అది ప్రహేళిక.

"అవును ప్రహేళిక గారూ! మనసుతో ఆటలాడుకునే మనీ మనుషులంటే నాకు చాలాకోపం! సో...నేనిపుడు ఆ సుజీవననే చేస్కుంటాను'' అన్నాడు కనకలింగం. అబ్బో నాకు చాలాగొప్ప తెలుగొచ్చేసే అనుకుని మనసులో మురిసిపోతూ! అంతేతప్ప తన మాటలకి ఓ అర్థం పర్థంలేనట్టుగా అతనికా సమయంలో అనిపించలేదు.

వ్యవహారం సడన్‌గా చెడిపోయేసరికి భానుప్రకాష్‌కి కూడా ఎదుటివ్యక్తి మాటలు అర్థరహితంగా అనిపించలేదు. "సరే, నన్నేం చెయ్యమంటావయ్యా ఇంతకీ?" అన్నాడు రుసరుసలాడుతూ.

"అది నేనెలా చెప్పగలను? ఏ సమస్యనైనా సరే డబ్బుతో పరిష్కరించేయొచ్చనే మీ అహంకారాన్ని దెబ్బతియ్యటానికే నేనిపుడీ నిర్ణయానికొచ్చాను'' అన్నాడు కనకలింగం. అబ్బ ఎంత చిక్కుముడి వేశాను? అనుకుని ఆనందించేస్తూ.

"అయితే మీరా సుజీవనకి దక్కిపోతారా?" అంది ప్రహేళిక ముఖం నిండా దిగులు పులుముకుంటూ.

"దక్కక తప్పని పరిస్థితిని మీ నాన్నగారే క్రియేట్ చేశారండీ ఇపుడు'' అన్నాడు కనకలింగం ఇందులో తప్పేం లేదు సుమా! అన్నట్టుగా తలెగరేస్తూ.

"అదే జరిగితే ఆ సుజీవన ముందు నేనోడిపోయినట్టే లెక్కండీ! ఈ అవమానాన్ని నేను భరించలేను'' దాదాపుగా జుట్టు పీక్కుంటూ అంది ప్రహేళిక.

భానుప్రకాశ్‌కి ఇదంతా ఏదో తిక్కబాగుల వ్యవహారంలా అనిపించింది.

ఎవరికీ ఏమీ చెప్పేలా లేదు పరిస్థితి.

ఇప్పుడేం చేయటం?




లోలోన చాలా అనీజీగా ఫీలవుతూ, "ఇంతకీ మీరిద్దరూ అనేదేంటి?" అనరిచాడు అసహనంగా.

"నేనా సుజీవననే చేసుకుంటాను'' అన్నాడు కనకలింగం.

"అదే గనుక జరిగితే నేనవమాన భారంతో చచ్చిపోతాను'' అంది ప్రహేళిక.

"ఇద్దరూ కలిసి ఇలా ఇరకాటంలో పెట్టేస్తే ఎలాగయ్యా? ఏదో ఒకటి తేల్చిచెప్పండి'' అన్నాడు భానుప్రకాష్.

కనకలింగం ఓ క్షణం చురుగ్గా ఆలోచించాడు.

ఏదో ఒకటి చేసి తానిపుడు ఒక చిత్రవిచిత్రమైన వ్యక్తిగా తననితాను రుజువు చేస్కోవాలి. ఎలా?

మనసులో స్పష్టాస్పష్టంగా ఓ ఐడియా లాంటిది మెదిలింది.

దాంతో "సరే ప్రహేళికగారూ'' అన్నాడు గంభీరంగా తల పంకిస్తూ.

ఏంటీ? అన్నట్టుగా చూసింది ప్రహేళిక.

భానుప్రకాష్ కూడా అలాగే చూశాడు.

"మీ నాన్నగారి సంగతెలా ఉన్నా మీ మీద అభిమానంతో నేనిపుడు నా మనసు మార్చుకుంటున్నాను. మీక్కావాల్సింది సుజీవన మా సూరిబాబునే చేస్కోవటం అంతేగా? డబ్బు ప్రస్తావన లేకుండానే నేను దాన్ని సుసాధ్యం చేస్తాను''

"ఎలా?" అడిగింది ప్రహేళిక.

"సుజీవనకి నా మీద అసహ్యం కలిగి, మా సూరిబాబు మీద తిరిగి అనురక్తి కలిగేలా చేస్తాను'' అన్నాడు కనకలింగం.

"అదెలా?" అడిగింది ప్రహేళిక.

"చెప్పను. అదేదో చేసే చూపిస్తాను'' అనేసి మరొక్క మాటక్కూడా అవకాశం ఇవ్వకుండా చటుక్కున అక్కణ్ణుంచి లేచి మెరుపు వేగంతో అదృశ్యమైపోయాడు కనకలింగం.

"ఏదో చేస్తానంటున్నాడుగా చూద్దాం" అన్నాడు భానుప్రకాశ్, అతను వెళ్లిన దిక్కు ప్రస్తుతానికి శని విరగడైంది అంతే చాలన్నట్టుగా చూస్తూ. ప్రహేళిక ఏమీ మాట్లాడకుండా అలాగే ఉండిపోయింది.

★ ★ ★

"ఎవ్విర్ థింగ్ హేపీనే అనుకుంటూ ఉంటే మధ్యలో ఇదేం మలుపురా?" అన్నాడు సూరిబాబు ఒకింత బాధగానూ, మరెంతో చిరాగ్గానూ.

"నన్నేం చెయ్యమంటావ్? ఆ సంభాషణ అలా ముగిసింది'' అన్నాడు కనకలింగం కణతలు నొక్కుకుంటూ.

"ముగియటం ఏంటి? నువ్వే అలా ముగించావ్! ఇంతకీ ఇపుడేం చెయ్యాలనుకుంటున్నావ్?" గాయాలు కాస్త తగ్గుముఖం పట్టడంతో బెడ్‌మీద లేచి కూర్చుంటూ అన్నాడు సూరిబాబు.

చెప్పాడు కనకలింగం తానేం చెయ్యాలనుకుంటున్నదీ! "ఆఁ?!!" అన్నాడు సూరిబాబు ఆశ్చర్యంగా నోరు తెరుస్తూ.

"అదేం పిచ్చి పనిరా? దానివల్ల కలిగే ప్రయోజనం ఏమిటి?" అన్నాడు ఆశ్చర్యంలోంచి కాస్త తేరుకున్నాక తిరిగి నోరు మూస్తూ.

"అది పిచ్చిపని అని నువ్ ఒప్పుకున్నావ్‌గా అది చాలు నాకు. నీలాగే ప్రహేళిక కూడా దాన్ని పిచ్చి పనే అనుకుని నన్నొక చిత్రవిచిత్రమైన వ్యక్తిగా భావించి నా మీద ఇష్టాన్ని ఇంకా ఇంకా పెంచుకుంటే ఇప్పటికే ఆమెలో అలాంటి అభిప్రాయం ఏర్పడిందనుకో. ఆ తర్వాత కాగల కార్యాన్ని గంధర్వులే నెరవేరుస్తారు'' అన్నాడు కనకలింగం సగం మానవ ప్రయత్నం మీదా, సగం గంధర్వుల మీదా భారం వేస్తూ.

"ఏదేమైనా ఇది నాకేం నచ్చలేదురా'' సూరిబాబు అయిష్టంగా పెదవి విరిచాడు.

"నీకు నచ్చటం కాదు కావాల్సిందిక్కడ. ఎలాగోలా కథ సుఖాంతం కావటం"

"అలా చేసినంత మాత్రాన్న కథ సుఖాంతం అవ్వుద్దని గ్యారంటీ ఏముంది?"

"గ్యారంటీ లేకపోయినా అవ్వటానికైతే ఆస్కారం పెరుగుతుందికదా! సో ఇంక వాదోపవాదాలొద్దు. మన ప్రయత్నం మనం చేద్దాం పద! ఇప్పుడే డాక్టర్ నడిగాను. ఓ అరగంటలో నిన్ను డిశ్చార్జ్ చేసేస్తాం అన్నారు''

"నిజంగానా?" అన్నాడు సూరిబాబు సంతోషంగా.

అతనికిలా హాస్పిటల్లో ఉండటం చాలా బోరుగా ఉంది. అందుకే ఇంకో అరగంట తర్వాత ఇంటికెళ్లిపోవచ్చన్న విషయం అతనికంత సంతోషాన్ని కలిగించింది.

"అవున్రా! మనం ఇంటికెళ్లగానే నువ్ నేను చెప్పిన పని చెయ్యాలి'' అన్నాడు కనకలింగం.

అదెంత పని? అనుకున్న సూరిబాబు "అలాగే'' అనేశాడు ఎంతో తేలిగ్గా.

★ ★ ★

మిత్రుణ్ణి హాస్పిటల్ నుంచి డిశ్చార్జ్ చెయ్యించి ఇంటికి తీస్కొచ్చాక,

ఇంట్లో ఓ రూళ్లకర్రుంటే దాన్నతనికిచ్చి "ఊ కానియ్'' అన్నాడు కనకలింగం.

హాస్పిటల్లో వున్నప్పుడు అదెంత పనిలే అనుకున్న సూరిబాబుకి ఇపుడు మాత్రం అది చెయ్యదగ్గ పనిలా అనిపించలేదు.

"ఊహుఁ... నా వల్లకాదురా'' అన్నాడు అడ్డంగా తలాడిస్తూ.

"పోనీ బెల్టివ్వనా?"

"ఊహుఁ అయినా నా వల్లకాదు'' మళ్లీ అడ్డంగానే తలాడించాడు సూరిబాబు.

"నీ వల్ల కాకపోవడానికి ఇందులో అంత చేతకానిదేముందిరా?" రవంత విసుగ్గా అన్నాడు కనకలింగం.

"చేతకాదని కాదు చేతుల్రాక" అన్నాడు సూరిబాబు. అతని కంఠంలోనే కాదు ముఖ కవళికల్లో కూడా అయిష్టత.

"చేతులు రాకపోవటానికేముందీ? కాసేపు నీ చేతులు నీవి కావనుకో నా శరీరం నాది కాదనుకో'' అన్నాడు కనకలింగం మిత్రుణ్ణి కర్తవ్యోన్ముఖుణ్ణి చేస్తూ.

"అలా అనుకోడానికి మనసు కూడా రావట్లేదురా'' సూరిబాబు నిస్సహాయంగా చూస్తూ అన్నాడు. "నో... నేనంత క్రూరంగా ప్రవర్తించలేను. కావాలంటే ఇంకెవర్నయినా చూసుకో"

"నీ బొంద" చిరాకెక్కువైపోయి నెత్తి బాదుకున్నాడు కనకలింగం.

"నీకైతే విషయమంతా తెలుసుకాబట్టి ఇలా అడగ్గలుగుతున్నాను. ఇంకెవర్నయినా అయితే అలా అడగటం? నాకు పిచ్చెక్కిందనుకోరా?"

"అవుననుకుంటారు''

"మరందుకే నువ్వేకానియ్'' అన్నాడు కనకలింగం మిత్రుడి చేతిలోని రూళ్లకర్రకేసి ఆశగా చూస్తూ.

"నావల్ల కాదురా'' అనేశాడు సూరిబాబు ఖచ్చితంగా.

"నీ బొంద! మరైతే నన్నిపుడెలా చావమంటావ్?"

అప్పుడు చెప్పాడు సూరిబాబు మిత్రుడికో ఉపాయం.

ఇదేదో బానే ఉన్నట్టుందే అనిపించినా ఆ మరుక్షణమే భయంతో వణికిపోయాడు కనకలింగం.

"ఆ మస్తానయ్య చాలా డేంజరస్ మనిషి కదరా?" అన్నాడు వణకటం అయ్యాక.

"డేంజరస్ మనిషి కాబట్టే వాడైతేనే ఎఫెక్టివ్‌గా చెయ్యగలుగుతాడు. సో నువ్వింకేం ఆలోచించబాకు. అతని అడ్రస్ చెప్తా రాస్కో'' అన్నాడు సూరిబాబు.

'కార్యసాధకులు కాగోరువారు ఎలాంటి ఆపదలకూ వెరవరాదు' అని మనసులో అనుకొని "సరే చెప్పైతే' అంటూ జేబు




లోంచి ఓ పాకెట్ నోట్ బుక్‌నీ, పెన్నునీ బైటకు తీశాడు కనకలింగం.

"ఊc రాస్కో" అంటూ అతనికి మస్తాన య్య అడ్రస్ చెప్పాడు సూరిబాబు.

"సరే నేను వెళ్తున్నానైతే! నువ్ చెప్పినట్టే అక్కడ వాడికి పిచ్చికోపం వచ్చేలా ప్రవర్తి స్తాను... ఒకవేళ ఏ కారణం వల్లైనా నేను సాయంత్రం లోగా తిరిగి రాకపోతే..." ఏదో చెప్పబోయి మాట పూర్తి చెయ్యలేకపోయాడు కనకలింగం.

"డోంట్‌వర్రీ! అలా జరిగితే ఏం చె య్యాలో నాకు తెలుసులే. నువ్ ధైర్యంగా వెళ్లు" అన్నాడు సూరిబాబు. !

అలా అంటుంటే అతని మనసంతా జాలితో నిండిపోయింది.

అయినా చెయ్యగలిగిందేముంది?

అందుకే బలి పశువులా పాపం కనక లింగం బైటికెళ్లిపోతుంటే 'ప్చ్' అంటూ జాలిగా ఓ నిట్టూర్పు విడిచాడు.

మిత్రుడి మీద అతనికి అభిమానం లేకపో లేదు. అయినా ఆ పరిస్థితిలో అంతకన్నా చెయ్యగలిగిందేముంది?

ఫలితం సంగతి ఎలా ఉన్నా ముందు మానవ ప్రయత్నం ముఖ్యంకదా?

అలాగే అనుకుని సరిపెట్టుకుని ఊరుకు న్నాడు.

★ ★ ★

కట్‌డ్రాయర్‌తో ఓ స్టూల్ మీద కూర్చొని ఒంటికి కుసుమనూనె పట్టించుకుంటూ ఉన్నాడు మస్తానయ్య.

అతని తాలూకు ఓ ఇద్దరు శిష్యులు అతని ఒంటికి అలా నూనె పట్టిస్తూ వున్నా రు.

తెరచివున్న కిటికీ గుండా ఆ గదిలోకి ఎండ ప్రసరిస్తూ సరిగ్గా మస్తానయ్య ఒంటి మీదే పడి మిలమిలా మెరుస్తూ ఉంది.

అదే గదిలో అతని అయిదారుగురు శిష్యులు రకరకాల వ్యాయామ సాధనాలతో వ్యాయామం చేస్తూ వున్నారు.

అప్పుడే ఆ గదిలోకి ప్రవేశించిన కనక లింగానికి ఆ సీన్ అంతా చూస్తూనే ఒక్కసా రిగా ఒళ్లు గగుర్పొడిచింది. ఎట్ ది సేమ్ టైమ్ అతని అరికాళ్లలోంచి నడినెత్తిదాకా వణుకు పుట్టుకొచ్చింది.

అయినా ఎలాగో ధైర్యం తెచ్చుకున్నాడు.

రోటిలో తల దూర్చేక రోకటి పోటుకి వెరవటం అనవసరమని తనకి తానే నచ్చజె ప్పుకున్నాడు.

ఒంటికి కుసుమ నూనె పట్టించుకుంటు న్న పర్వతాకారుడే మస్తానయ్య అని స్ప ష్టంగా తెలుస్తూనే ఉన్నప్పటికీ "మీలో మస్తా నయ్య అంటే ఎవరు?" అనడిగాడు కంఠం వణక్కుండా వీలయినంత శ్రద్ధ వహిస్తూ.

"నేనే యేం?" జబ్బలు చరుచుకుంటూ అడిగాడు మస్తానయ్య.

అంటే కయ్యానికి కాలుదువ్వుతూ అని కాదు. వస్తాదు కాబట్టి వీలు చిక్కినప్పుడల్లా జబ్బలు చరుచుకోవటం అతనికి అలవా టంతే!

అసలే పర్వతాకారుడు.

అందునా జబ్బలు చరుస్తున్నాడు.

అంతే కాకుండా చుట్టూ మెరికల్లాంటి శిష్యగణం కూడా ఉన్నారు.

అందరూ మూకుమ్మడిగా తన మీద పడి ఒక్కొక్కరూ ఒక్కో దెబ్బవేస్తే చాలదా తను విగత జీవుడై పోవటానికి?

బతికుంటే బలుసాకు తినొచ్చు.

ఊపిరుంటే ఉప్పైనా అమ్ముకోవచ్చు. లేదా ఉల్లిపాయలేనా అమ్ముకోవచ్చు.

ప్రహేళిక కోసం, ఆమె ప్రేమకోసం ఆమె మనసులో విచిత్రమైన వ్యక్తిగా సుస్థిర స్థానం సంపాదించుకోవటంకోసం, తద్వారా ఆమె తనకెలాగైనా దక్కుతుందన్న ఆశతో తను కాస్తా కీ.శే.బి.కనకలింగం అయిపోవటం ఏం సబబు?

కీ.శే. అయిపోయాక ఒకవేళ ప్రహేళిక



తనని ప్రేమిస్తే మాత్రం తనకు ఒరిగేదేమిటి?

విజ్ఞత వెన్ను తట్టగా, "ఏం లేదు సార్' అనేసి అక్కణ్ణుంచి పారిపోదామా అనిపించింది కనకలింగానికి.

కానీ అంతలోనే అతనిలోని మొండిధైర్యం బోధించింది.

ఇంతదాకా వచ్చాక పారిపోవడం ఏంటి?

ఏదైతే అదే అవుతుంది. తనకింకా ఈ భూమ్మీద రైసూ ఎక్స్ట్రా మిగిలుంటే బతుకుతాడు. లేకుంటే లేదు.

ఆ సూరిగాడిలో వున్నట్టు తనలో ప్రేమార్తి లేకపోవచ్చు. కానీ ప్రహేళిక మీద లేనిపోని ఆశలు పెంచుకున్నాక తన మనసు కూడా ఇపుడు 'ప్రేమ-ప్రేమ' అనే కొట్టుకుంటోంది.

చరిత్రలో ప్రేమకోసం ప్రాణాల్ని పణంగా పెట్టిన మహానుభావులెందరో వున్నారు. ఒక వేళప్పుడు జరక్కూడనిదేదైనా జరిగితే తను కూడా ఆ లిస్ట్‌లో చేరిపోతాడు. అంతేకదా?

అలా తనకు తానే ధైర్యం చెప్పుకుని.

"నేను సూరిబాబు రూమ్మేట్‌ని. ఫ్రెండ్‌ని. నా పేరు కనకలింగం" అన్నాడు కనకలింగం గంభీరంగా.

"సూరిబాబెవడు?" నిజంగానే మర్చిపోయాడులా ఉంది మస్తానయ్య కాస్త అయోమయంగా అడిగాడు.

"సూరిబాబు ఎవరా? నిన్నగాక మొన్నేగా వాణ్ణి చావగొట్టించారు? కరపత్రాలు పంచిన పాపానికి?" అన్నాడు కనకలింగం గుర్తుచేస్తూ.

దాంతో "ఓ ఆ సూరిబాబా?" అన్నాడు మస్తానయ్య.

"అవునా సూరిబాబే! వాణ్ణెందుకలా చిదగ్గొట్టించారో తెలుసుకోవచ్చా?" అన్నాడు కనకలింగం వీలైనంత గంభీరంగా.

సింహం ముందు చిట్టెలుక నిలబడి గంభీరత నటిస్తే లేదా ప్రదర్శిస్తే ఎలా ఉంటుందో అలా ఉందది.

మస్తానయ్య కనకలింగంకేసి ఓ సూక్ష్మజీవికేసి చూసినట్టు చూశాడు.

"చితగ్గొట్టక ముద్దెట్టుకోవాలా? ఆడికి నా కూతుర్లలో ఒక్కర్తె కూడా నచ్చలేదు మరి'' అన్నాడు ఇంకా అలాగే చూస్తూ.

"అదే... అదే ఆ మాటే అడగటానికొచ్చాను. మీ కూతుళ్లు అతనికి నచ్చనంత మాత్రాన్న, వాళ్ల మెల్లకళ్లని మెచ్చుకోనంత మాత్రాన్న, మీకు కండలున్నాయనీ, మీకు శిష్యగణం ఉందనీ చిదగ్గొట్టించేయడమేనా? ఏమిటీ అన్యాయం? ఏమిటీ అక్రమం? ఏమిటీ దురహంకారం? ఈ ప్రశ్నవెయ్యటానికే వచ్చానిపుడు'' అన్నాడు కనకలింగం అదేదో సినిమాలో దారాసింగ్ నిలబడినట్టుగా నిలబడుతూ.

ఆ పోజూ ఆ మాటలూ చూస్తుంటే పర్వతాకారుడైనట్టి మస్తానయ్యకి సహజంగానే తిక్కరేగిపోయింది.

"ఏంట్రా తెగ నీలుగుతున్నావ్? ఏం నీకూ నాలుగు తగిలించమంటావా?" అన్నాడు స్టూలు మీంచి లేచి నిలబడుతూ.

అతనలా నిలబడగానే కనకలింగాన్ని అతగాడి కట్ డ్రాయర్ అమితంగా ఆకర్షించింది.

వార్నీ! ఇంత పెద్ద కట్‌డ్రాయర్లు కూడా అమ్ముతారన్నమాట? అనుకున్నాడు ఆశ్చర్యంగా.

అంతలోనే కర్తవ్యం గుర్తుకురాగా "ఆడర్భకుడు కాబట్టి ఆణ్ణలా చెయ్యగలిగారు. నాతో పెట్టుకోకండి నేనసలే మంచోణ్ణి కాదు'' అన్నాడు సీరియస్‌గా.

"ఏంట్రా వాగుతున్నావ్?" అన్నాడు మస్తానయ్య నిప్పులు కక్కుతూ.

"వాగటం కాదు. ఉన్న మాటే అంటున్నాను. దమ్ముంటే నన్నేమైనా చెయ్యండి చూద్దాం" గీరగా తలెగరేస్తూ అన్నాడు కనకలింగం.

మస్తానయ్య క్షణకాలంపాటు కనకలింగంకేసి ఆశ్చర్యంగా చూసి "రేయ్ ఆడేదో తెగ నీలుగుతున్నాడుగానీ ఆణ్ణో పట్టుప





ట్టండిరా'' అన్నాడు తన శిష్యగణాన్నుద్దేశించి.

అంతే...

మరుక్షణం "అమ్మోయ్, నాయ్నోయ్, చచ్చా(న్రాదేవుడోయ్'' లాంటి ఆర్తనాదాలతో ఆ గదంతా మారు(మోగిపోయింది కాసేపు.

దరిమిలా మరికాసేపటికి కనకలింగం ఓ గోనెబస్తాలా విసిరేయబడ్డాడు ఆ గదిలోంచి వీధిలోకి. అతనికి కావాల్సింది అదేగా?



నుజ్జునుజ్జైన శరీరంతో మరి కాసేపటికి చావబోతున్న వాడిలా అతినీరసంగా అడుగులేసుకుంటూ వచ్చిన మిత్రుణ్ణి చూసేసరికి బావురుమని ఏడ్వాలనిపించింది సూరిబాబుకి.

కానీ ఎలాగో నిగ్రహించుకున్నాడు.

తానేడిస్తే మిత్రుడు కూడా ఏడుస్తాడు. అపుడు ఒకర్నొకరు ఓదార్చుకోలేక చావాలి!

ఎందుకొచ్చిన తిప్పలవి?! కన్నీరు కార్చని వారే కార్యసాధకులవుతారెప్పుడూ... అలా సరిపెట్టుకుని, "బాగానే దంచారన్న మాట అయితే?" అన్నాడు సూరిబాబు, పిసికేసిన మైదాపిండి ముద్దలా ఎలానో వున్న కనకలింగం శరీరంకేసి చూసి.

"అవును. అంతా మనం ఆశించినట్టే జరిగింది'' అన్నాడు కనకలింగం మూలుగుతూనే సంతోషంగా.

'అలాగా?' అన్నట్టు తనూ సంతోషంగా తలాడించి "ఇట్స్ ఓకే... వాట్ నెక్ట్స్?!!" అన్నాడు సూరిబాబు.

చెప్పాడు కనకలింగం నెక్ట్స్ తనేం చేయబోతున్నాడో.

"ఓకే గో ఎ హెడ్'' అన్నాడు సూరిబాబు మిత్రుణ్ణి ప్రోత్సహిస్తూ.

అంతలోనే అతని దురవస్థకి జాలికలిగి "పోనీ ముందుగా ఫస్ట్ ఎయిడ్ ఏదైనా చెయ్యించుకుని వెళ్తావా?" అన్నాడు కంఠంలోంచి కనికరాన్ని కురిపిస్తూ.

"నో... ఫస్టెయిడ్ ఈజ్ నాటెమస్ట్ నౌ! ఫస్ట ఫాల్ ఐ హేవ్ టు గోటు ప్రహేళిక..." అన్నాడు కనకలింగం పచ్చిపుండులా వున్న శరీరంకేసి పరవశంగా చూసుకుంటూ.

మనసులో చాలా బాధగా అనిపించినా, "ఓకే! డూ యాజ్ యూప్లీజ్'' అని తను కూడా ఇంగ్లీష్‌లోనే అనేశాడు సూరిబాబు.

★ ★ ★

"ఏంటి లింగంగారూ? ఏంటిది? ఏంటీ అన్యాయం?? ఎవరు చేశారీ ఘోరం?!"

కనకలింగం ఊహించినట్టే అతన్ని చూస్తూనే తెగ ఆందోళన పడిపోయింది ప్రహేళిక.

"హహ్హహ్హ... ఎవరో చెయ్యటమా?" అంటూ గంభీరంగా నవ్వాడు కనకలింగం.

అతనన్న ఆ మాటలు మతిలేని వాగుడులా అనిపించి అతనికేసి మతిపోయిన దానికి మల్లే చూసింది ప్రహేళిక! "ఏంటి లింగంగారూ? ఏంటి మీరంటోంది?" అంది మతిపోయిన దానికిమల్లే చూడ్డం అయ్యాక.

"అవును ప్రహేళికగారూ! నన్నెవ్వరూ కొట్టలా'' అన్నాడు కనకలింగం ఠీవిగా బోర విరవబోయి బాధగా "అబ్బా'' అని.

"ఎవ్వరూ కొట్టలేదా?... మరీ దెబ్బలన్నీ ఏంటి?!" అయోమయంగా అడిగింది ప్రహేళిక.

"చెప్తాగానీ మీ నాన్నగారున్నారా ఇంట్లో?" అనడిగాడు కనకలింగం.

"ఉన్నారు'' అని ప్రహేళిక ఇంకా అంటూ ఉండగానే.

"ఉన్నానన్నాయనా! ఏం?" అంటూ పక్కగ దిలోంచి ఆ గదిలో కొచ్చాడు భానుప్రకాశ్.

వచ్చి...

క్షతగాత్రుడైనట్టి కనకలింగాన్ని చూసి...

మానవ సహజమైన కుతూహలంతో "ఏమైందయ్యా నీకు?" అనడిగాడు గాభరాగా.

"ఏమైతేనేంలెండి? మొత్తానికి అనుకున్నది సాధించగలిగాను. నా కర్తవ్యాన్ని నేను నెరవేర్చాను'' అన్నాడు ప్యాంటు జేబులోంచి ఓ కాగితాన్ని బైటకు తీస్తూ.

"ఏమిటది?" ప్రహేళిక అడిగింది.

"ఏమిటది?" అని భానుప్రకాశ్ అడగలేదు గాని అడిగినట్టుగానే చూశాడు.

"చదవండి మీకే తెలుస్తుంది'' అంటూ దాన్ని ప్రహేళికకు అందజేశాడు కనకలింగం.

ఆమె కళ్ళు ఆత్రంగా ఆ కాగితం మీది అక్షరాలలోకి పరుగుతీశాయి.

"శ్రీ కనకలింగం గార్కి!

నమస్కారం.

హాస్పిటల్నుండి డిశ్చార్జ్ అయిన వెంటనే నేను మొదట ప్రేమించిన శ్రీ సూరిబాబు గారు, మిమ్మల్ని చిత్తుచిత్తుగా తన్ని మీమీద ప్రతీకారం తీర్చుకున్నారన్న సంగతి నాకిప్పుడే తెలిసింది! ఆ శుభవార్త విని నేను పులకించిపోయాను.

ఎందుకంటే నేను మొదట ప్రేమించింది సూరిబాబుగార్నే కదా! కానైతే ఆయన మీ చేతిలో దెబ్బలు తిన్నాడన్న బాధకొద్దీ, మొన్న అలా మనసు మార్చుకుని మిమ్మల్ని ప్రేమిస్తున్నట్టుగా చెప్పాను.

కానీ ఇప్పుడాయన మిమ్మల్ని చితకతన్ని ప్రతీకారం తీర్చుకుని తనకీ పౌరుషముందని నిరూపించుకున్నారు కదా! బలంలో తాను కూడా మీకేమీ తీసిపోనని ప్రూవ్ చేసుకున్నారు కదా!

అందుకే నేనిప్పుడు మళ్ళీ నా మనసు మార్చుకున్నాను. ఎంతైనా నేను మొదట ప్రేమించింది సూరిబాబుగార్నే కాబట్టి ఇక మీదట కూడా వారినే ప్రేమించాలనుకుంటున్నాను. తొందరపడి నేను మీలో ఏవన్నా ఆశలు రేకెత్తించి ఉంటే నన్ను క్షమించగలరు.

ఇట్లు....

మీ స్నేహితుని ప్రియురాలు,

సుజీవన"

ప్రహేళిక ముఖం కందగడ్డలా అయింది. ఆ ఉత్తరాన్ని చదవటం పూర్తిచెయ్యగానే.

"ఛీ! అసలదొక ఆడదేనా! రాజకీయ నాయకులు కూడా ఇంత సులభంగా రంగులు మార్చలేరేమో? క్షణానికోలా మనసు మార్చుకునే ఆ ఊసరవెల్లిని ఏం చేసినా పాపం లేదు..." అంది ఏవగింపుగా.

"ఏమైందమ్మా?" అడిగాడు భానుప్రకాశ్.

"ఆ నంగనాచి మళ్ళీ ప్లేటు ఫిరాయించింది. ఈ లెటర్ చూడు నీకే తెలుస్తుంది'' అంటూ ఉత్తరాన్ని తండ్రికందించింది ప్రహేళిక.

చదివి...

"అయితే ఈసారి ఆ సూరిబాబు నిన్ను చితకతన్నేడన్నమాట!" అన్నాడు భానుప్రకాష్ ఒకింత సంతోషంగా.

తన పాలిట ఓ న్యూసెన్స్గా మారిన ఆ మిత్రులిద్దరూ అలా ఒకర్నొకరు తన్నుకోడం ఆయనకు లోలోన నిజంగానే భలే సంతోషాన్ని కలుగజేసింది.

కానీ కనకలింగం ఆయనలోని ఆ సంతోషాన్ని ఎంతోసేపు నిలువనీయలేదు.

"వాడి బొంద! ఏదో డిశ్చార్జ్ అయ్యాడన్నమాటే గానీ, నేను కొట్టిన దెబ్బలునుంచి వాడింకా పూర్తిగా కోలుకోలేదు. వాడు నన్ను




తన్నడమేంటి?" అన్నాడు నాలుక చప్పరి స్తూ.

"మరి?" అన్నాడు భానుప్రకాశ్.

"నన్ను నేను తన్నుకున్నా" అన్నాడు కనకలింగం ఆ తండ్రికూతుళ్ళ నిర్ఘాంతికి గురిచేస్తూ.

"వ్వాట్?" అన్నాడు భానుప్రకాశ్.

"ఏంటి?" అంది ప్రహేళిక.

"అవును ప్రహేళికగారూ! మీ పంతం నెరవేరాలీ అంటే ఆ సుజీవన వాణ్ణే చేసుకో వాలీ అంటే- ఆమెకి నామీద అసహ్యం కలిగి వాడిమీద తిరిగి ఇష్టం ఏర్పడాలి! దానికి ఇదొక్కటే సరైన మార్గంగా తోచింది నాకు. అందుకే నన్ను నేను ఇలా చిదగ్గొట్టు కుని వాడే నన్ను కొట్టేడని ఆమెను నమ్మించి అనుకున్నది సాధించా! ఆర్ యూ శాటిస్‌ఫైడ్ నౌ?" అన్నాడు అతికష్టమ్మీద ముఖాన్న చిరునవ్వు పులుముకుంటూ.

ఒళ్ళంతా పచ్చిపుండులా వుంటే ము ఖంమీదకు చిరునవ్వు అంత తేలిగ్గా వస్తుందా?! అందుకే అతనలా కష్టపడాల్సి వచ్చింది!

తననితానే చితక తన్నేసుకుని పైగా అలా నవ్వుతున్న అతన్ని చూస్తుంటే ప్రహేళిక ఆశ్చర్యానికి అవధులే లేకుండా పోయాయి!!

ఎంత చిత్ర విచిత్రాతి విచిత్రమైన మనిషి!! అనుకోకుండా వుండలేకపోయిందా మె.

తన పంతం నెరవేరటం కోసం ఆ సుజీ వన సూరిబాబుతోనే సరిపెట్టుకోడం కోసం తననితానే గాయపరచుకుని, ఓహ్... నిజంగా ఎంత అద్భుతమైన మనిషి?

అసలు నరజన్మ ఎత్తినవాళ్లెవరైనా ఇలా తమని తాము గాయపరుచుకోగలరా?

ప్రహేళిక రెప్పలార్పడం కూడా మర్చి పోయి అతనికేసి విస్మయంగా చూస్తుండగా.

"ఏంటయ్యా నువ్ అనేది!! నిన్ను నువ్వు ఇంత ఘోరంగా తన్నుకున్నావా? అన్‌బిలీవ బుల్!! ఎంత విచిత్రమైన మనిషివయ్యా నువ్వు?" అన్నాడు భానుప్రకాశ్ నోరు వెళ్ళబె డుతూ.

"మీకేమైనా అనుమానమా? అలాగైతే చెప్పండి మళ్ళీ నన్ను నేను తన్నుకుంటా" అన్నాడు కనకలింగం అటూ ఇటూ చూసి, సోఫాకి ఆనించున్న ఓ వాకింగ్‌స్టిక్‌ని చేతిలో కి తీసుకుంటూ.

ఆ స్టిక్ భానుప్రకాశ్‌దే!

"అలాగా! ఏదీ తన్నుకో చూద్దాం" అని అనాలనిపించింది భానుప్రకాశ్‌కి.

కానీ అనలేకపోయాడు.

ఇప్పటికే సగం చచ్చిపోయి ఉన్నాడు. ఇప్పుడు మళ్ళీ గనక తన్నుకుంటే పూర్తిగా చచ్చిపోతాడేమోనన్న జాలి కలిగిందాయ నకు.

అంతలో కనకలింగం అన్నంతపనీ చేశా డు.

తన చేతిలోని వాకింగ్‌స్టిక్‌తో తానే తన నడినెత్తిన ఒక్కటిచ్చుకుని "అబ్బా" అంటూ బాధతో గింగిరాలు తిరిగాడు.

ఆ అసమాన విచిత్ర చర్యకు ప్రహేళిక స్టన్నయిపోయింది.

అంతలో కనకలింగం తన చేతిలోని వాకింగ్‌స్టిక్‌తో ఇంకొక్కటిచ్చుకున్నాడు తన వీపుమీద.

ఆ దెబ్బకు అబ్బా అని బాధతో మెలికలు తిరిగిపోతుంటే ఇంక చూస్తూ సహించలేకపో యింది ప్రహేళిక.

"లింగంగారూ" అంటూ ఒక్కుదుటున అతని ముందుకు దూకి అతని చేతిలోంచి ఆ స్టిక్‌ని లాక్కుని మధ్యకు విరిచేసి దూరంగా విసిరేసింది.

"అది చాలా ఖరీదైన వాకింగ్‌స్టిక్కమ్మా, ఎందుకు దాన్నలా విరిచేశావ్?" అన్నాడు భానుప్రకాశ్.

"లింగంగారి శరీరం కూడా చాలా విలు వైందే నాన్నా!" అంటూ విచిత్రంగా చేతులు తిప్పి...

"లింగంగారూ! ఎలా వుంది?" అని ఆవేదనగా అడిగింది ప్రహేళిక.

"చాలా తృప్తిగా వుందండీ'' తృప్తిగా అన్నాడు కనకలింగం.

"వాట్?!! అన్ని దెబ్బలు తగిలించుకుని తృప్తిగా వుందంటున్నారా? ఎంత విచిత్రమైన మనిషండీ మీరూ?" బుగ్గలు నొక్కుకుంటూ అంది ప్రహేళిక.

"ఎన్ని దెబ్బలు తగిలాయీ అన్నది కాదండీ ఇక్కడ పాయింటు!! మీ మనోభీష్టాన్ని ఎంత చాకచక్యంగా నెరవేర్చానూ అన్నదే నాక్కావలసింది! దెబ్బలదేముందీ? కొన్నాళ్ళు పోతే అవేపోతాయ్! మనిషన్నవాడికి మాట ముఖ్యం!! మాట కోసం ప్రాణాలైనా తీసుకోగలిగిన వాడేనండీ మనిషంటే'' అంటూ మనిషికో నిర్వచనం చెప్పి... "వస్తాను భానుప్రకాశ్‌గారూ! వస్తాను ప్రహేళికగారూ!! నా కర్తవ్యం నేను నెరవేర్చాను. ఇంక నాకిక్కడ ఏం పని? గుడ్‌బై గుడ్‌బై ఫరెవర్' అంటూ ఓ దగ్గుదగ్గి ముందుకు సాగిపోబోయి దభేల్న నేలమీద పడ్డాడు కనకలింగం.

నటించటం కాదు. నిజంగానే పడిపోయాడతను. తగిలిన దెబ్బలు సామాన్యమైనవా?

"లింగంగారూ'' అంటూ ప్రహేళిక అతనికేసి పరుగుతీసింది.

కొంపదీసి వీడు బకెట్ తన్నేయలేదు గదా? అనుకుంటూ భానుప్రకాశ్ కూడా అతనికేసి ఆందోళనగా చూశాడు.

ప్రహేళిక కనకలింగం పక్కనే నేలమీద కూర్చొని "లింగంగారూ... లింగంగారూ'' అంటూ అతని భుజాలు పట్టుకుని కుదిపింది.

"నాకు స్పృహ తప్పుతోంది ప్రహేళికగారూ! సారీ! నేనింకేం మాట్లాడలేను'' అంటూ తలని ఓ పక్కకు వాల్చేశాడు కనకలింగం.

ఇది కూడా నటనేం కాదు. నిజంగానే స్పృహ తప్పిపోయిందతనికి.

స్పృహరహితుడైన అతనికేసి ప్రేమగా చూస్తూ "ఈ విచిత్రమైన మనిషిని ఆరునూరైనాసరే నేనింక వదులుకునేది లేదు అని మనసులో ఓ దృఢనిశ్చయానికొచ్చేసి..." చూస్తావేం నాన్నా! డాక్టర్‌కి ఫోన్‌చేయ్'' అంది ప్రహేళిక.

భానుప్రకాష్ మారుమాట్లాడకుండా ఫోన్ వున్నవైపు పరుగుతీశాడు.

★ ★ ★

మూడురోజుల తర్వాత...

సూరిబాబు తన రూమ్‌లో మంచంమీద పడుకుని తన చేతిలో వున్న తన కరపత్రంకేసి పరవశంగా చూసుకుంటూ వుండగా.

పిల్లతెమ్మెరలా ఆ గదిలోకి ప్రవేశించిన సుజీవన సూరిబాబునా పోజులో చూసి కిలకిలా నవ్వింది.

"నువ్వా?! రా సుజీవనా, రా!" అన్నాడు సూరిబాబు లేచి కూర్చుంటూ.

ఆమె ఒక స్టూల్‌ని ఆ మంచానికి దగ్గరగా జరిపి కూర్చుని "ఏంటి దానికేసి అంత పరవశంగా చూస్తున్నారు?" అనడిగింది ఆసక్తిగా.

సూరిబాబు కరపత్రాన్ని ముద్దాడి "దీనివల్ల మా మిత్రులిద్దరికీ మంచే జరిగింది కదా అందుకనే' అన్నాడు పరవశంగా.

"అంటే కనకలింగంగారిక్కూడా లైన్ క్లియరైపోయిందా?" అడిగింది సుజీవన.

"ఆల్‌మోస్ట్ అయిపోయినట్టే'' అన్నాడు సూరిబాబు.

"ఆయనెక్కడున్నాడిపుడు?"

"ఇంకెక్కడుంటాడు? కాబోయే మామగారింట్లో ఓ పేషెంట్‌గా తిష్టేసి, వాళ్ళ ఫామిలీ డాక్టర్‌తో ట్రీట్‌మెంట్ చెయ్యించుకుంటూ తన భావిసతీమణితో సేవలు చెయ్యించుకుంటూ చావుబ్రతుకులమధ్య దర్జాగా హ్యాపీగా ఉన్నాడు'' అన్నాడు సూరిబాబు.

"అంటే అతని పరిస్థితి ఇంకా ప్రమాదభరితంగానే ఉందా?" సుజీవన ఆందోళనగా అడిగింది.




"లేదు ఇందాకే వెళ్ళిచూసొచ్చా! కులాసాగానే ఉన్నాడు'' చెప్పాడు సూరిబాబు.

"మరి చావుబ్రతుకులమధ్య అంటున్నారు?"

"అవును వాడిపుడు చావుబ్రతుకుల మధ్యే ఉన్నాడు. కానీ నిజమైన చావు బ్రతకులమధ్య కాదు''

"అంటే?" సూరిబాబుకేసి ఆశ్చర్యంగా చూసింది సుజీవన.

"ఏంలేదు. వాడి ఎత్తుగడ ఇప్పుడు టోటల్గా ఫలించింది! ఆ ప్రహేళిక వాణ్ణిపుడు ఊపిరాడనంత ప్రేమతో ఉక్కిరిబిక్కిరి చేసి చంపేస్తూ వుంది'' అంటూ హాయిగా నవ్వేశాడు సూరిబాబు.

"అదా సంగతి?" అంటూ తను కూడా నవ్వేసి, "ఇంతకూ ఆమె తండ్రేమంటున్నాడు?" అనడిగింది సుజీవన.

"ఏవంటాడు? ప్రహేళిక ఆయనకు ఒక్కగానొక్క కూతురు. నుయ్యి- గొయ్యి- విషం అని బెదిరించిందట! దాంతో ఆయన చచ్చినట్టు దార్లో కొచ్చేశాడట. ప్రస్తుతం వాళ్లింట్లో మా లింగంగాడికి సకలరాజభోగాలూ జరిగిపోతూ వున్నాయ్! అచ్చం ఇంటల్లుణ్ణి చూస్కున్నట్టే చూస్కుంటున్నారు''

"అయితే కథ ఇప్పుడు పూర్తిగా సుఖాంతం అయిపోయిందన్నమాట?" అంది సుజీవన సంతోషంగా.

"ఇంకా కాలేదు'' అన్నాడు సూరిబాబు పెదవివిగుస్తూ.

సుజీవన అతని దిక్కు ఆశ్చర్యంగా చూసింది.

"అదేంటీ?" అంది బుగ్గన వేలానించుకుంటూ.

"కనకలింగంగాడికి దెబ్బలు నయమైపోగానే వాళ్ళిద్దరకీ పెళ్ళంట!" అన్నాడు సూరిబాబు అదేదో బ్యాడ్‌న్యూస్ అయినట్టు.

"అయితే మంచిదే కదా?"

"ఎలా మంచిదవుతుందీ? మా ఇద్దరి పెళ్ళిళ్ళూ ఈ కరపత్రంవల్లే కుదిరాయ్ కాబట్టి- రెండు పెళ్ళిళ్ళూ ఒకే ముహూర్తంలో, ఒకే పందిట్లో జరిగితే బావుంటుందన్నది మా ఉద్దేశం"

"మీ ఉభయులదీ అదే ఉద్దేశం అయినట్లైతే అలాగే కానిద్దాం! మీ విషయం మా ఇంట్లో చెబితే కాదనేదేం వుండదు. పైగా సంతోషంగా ఒప్పుకుంటారు?" అంది సుజీవన

'ఇందులో పెద్ద సమస్యేముంది?' అన్నట్టుగా కళ్లెగరేస్తూ.

"అదెలా కుదుర్తుందీ?" అన్నాడు సూరిబాబు నుదురు గీరుకుంటూ.

'అంటే?' అన్నట్టుగా కళ్లెగరేసింది సుజీవన.

అప్పుడు చెప్పాడు సూరిబాబు తన అసలు బాధేమిటో...

"పొద్దున్న వాళ్ళమాటల్ని బట్టి నెక్ట్స్ మంతే వాళ్ళ పెళ్ళని నా కర్థమైపోయింది. మనమూ వాళ్ళతోపాటే పెళ్ళిచేసుకుంటే నా ప్రేమార్తి తీరేదెలా? అసలు మనమింకా ప్రేమించుకోడం ప్రారంభించనే లేదుగా?" అన్నాడు ఆవేదనగా.

"అదేంటీ? మనమిప్పుడు ప్రేమించుకుంటూనే ఉన్నాంగా'' అంది సుజీవన ఆశ్చర్యంగా.

"ప్రేమంటే ఇదా?"

"మరి?"

"ప్రేమంటే...ప్రేమంటే''

"ఊ... ప్రేమంటే...?"

జుట్టు పీక్కోవాలనిపించింది సూరిబాబుకి.

ఇంత జరిగాక కూడా ఇంకా ప్రేమంటే ఏమిటో అర్థంకాకపోవటం అతనికి తనమీద తనకే చిరాకు పుట్టేలా చేసింది.

"ప్రేమంటే...ప్రేమంటే... గాడిదగుడ్డు'' అనేశాడు చిరాగ్గా.



ఆ విజ్ఞానపూరితమైన జవాబుకి సుజీవన ఫక్కున నవ్వి.

"ఊహు..." అంటూ అడ్డంగా తలా డించింది.

"మరి ప్రేమంటే ఏంటి? ప్రేమించుకోడం అంటే ఏంటి?"

బుర్రగీరుకుంటూ అడిగాడు సూరిబాబు.

"ప్రేమంటే... ప్రేమంటే'' అని సాగదీసి.

"ఇదీ..." అంటూ గాల్లోకి ఓ ముద్దు విసిరింది సుజీవన.

ఆ గాలి ముద్దుకే శరీరం పులకించిపోగా "మరైతే అర్జంటుగా ప్రేమించేసుకుందాం పట్టు'' అన్నాడు సూరిబాబు ఆత్రంగా.

"ఆశ! ఇప్పుడు కాదు పెళ్లయ్యేదాకా ఆగాలి తమరు'' అంది సుజీవన నాలుక బైటపెట్టి వెక్కిరిస్తూ.

"పెళ్లయ్యాక ప్రేమేంటి నా బొంద! అస లు పెళ్లయ్యాక అష్టకష్టాలూ పడుతూ బతికే యటమే తప్ప ఇంకేమీ ఉండదటగా!" అన్నాడు సూరిబాబు అప్పుడెప్పుడో హాస్పిట ల్లో కనకలింగం చెప్పిన మాటల్ని గుర్తుకు తెచ్చుకుంటూ.

"ఎవడా కూసిందీ?" అంది సుజీవన.

"ఇంకెవడూ, మా లింగంగాడు'' అన్నా డు సూరిబాబు.

"అతనా?" అంటూ నవ్వేసి "అది అవగా హన లేని మాట" అంది సుజీవన.

"అయితే పెళ్లయ్యాక కూడా ప్రేమించుకో వచ్చంటావా?" అన్నాడు సూరిబాబు ఒకింత అయోమయంగా చూస్తూ.

"భార్యాభర్తలకు ప్రేమించుకునే హృద యముండాలేగాని నిండు నూరేళ్లూ ఎంచ క్కా ప్రేమించుకుంటూనే ఉండొచ్చు'' అంది సుజీవన జీవితాన్ని కాచివడపోసిన దానికి మల్లే నవ్వుతూ.

"అలాగా?" అన్నాడు సూరిబాబు అంతక న్నా ఇంకేమనాలో తోచక.

"అవును'' అంటూ నవ్వి... మరో గాలి ముద్దు విసిరి "మరైతే నేనింక మా ఇంటికెళ్లి మా అమ్మానాన్నలకి మన విషయం చెప్పిరా నా?" అంది సుజీవన.

"ఓకే' అన్నాడు సూరిబాబు సంతో షంగా.

★ ★ ★

వేడివేడి ఉప్మాని స్పూన్‌తో తీసి నోట్లో పెట్టుకుంటూ "ఇది మీకు అన్నివిధాలా తగిన సంబంధం" అన్నాడు పరమేశ్వర శాస్త్రి.

"అది సరే! అసలింతకీ వాళ్లెంతలో వున్నా రు?" అంటూ అసలు ప్రశ్న అడిగాడు పెంచ లయ్య.

"యాభై వేలు ప్లస్ స్కూటరు'' అన్నాడు పరమేశ్వరశాస్త్రి స్పూన్‌తో కరివేపాకుని తీసి పక్కనేస్తూ.

"అబ్బాయి టైలరంటున్నారు. టైలర్ సంబంధానికి అంత కట్నమా?" అంది భా రతి గుండెలమీద చెయ్యానించుకుంటూ.

"మీరింకా ఏకాలంలో వున్నారమ్మా! యా భై వేలకే అంత కట్నమా అంటున్నారు? అన్ని ధరల్లాగే కట్నాల ధరలు కూడా మండి పోతూ ఉన్నాయాయె ముష్టి వెధవ కూడా ముప్పైవేలకి తగ్గటం లేదీ మధ్య'' మరి కాస్త ఉప్మాని నోట్లో కుక్కుకుంటూ అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"నిజమేననుకోండి. కానీ మేం తూగ్గలగా లిగా'' అంటూ నీళ్లు నమిలాడు పెంచలయ్య.

'ఇదేవన్నా కొత్తా?' అని మనసులో అను కుని "మరెంతకైతే తూగుతారు?" అన్నాడు పరమేశ్వరశాస్త్రి రవంత విసుగ్గా.

'ఫలానా అంత' అని ఎలా చెప్పగలడు పెంచలయ్య? ఇల్లమ్మితే కదా పెద్దమ్మాయికి ఎంతివ్వగలుగుతాడో తేల్చుకోగలిగేది?

అందుకే ఎటూ తేల్చకుండా "నా సంగతి మీకు తెలుసుగా సాధ్యమైనంత తక్కువలో చూడండి అయినా ఇల్లమ్మితే తప్ప నేనే సంగతీ చెప్పలేను'' అన్నాడు పెంచలయ్య.

'పాతపాటే' అని మనసులో అనుకుని "మీరిల్లమ్మేదెప్పుడూ పిల్లకి పెళ్లి చేసేదెప్పుడూ? ఏదో ఒక మాట వివరంగా చెప్పండి! ఎందుకు నన్నిలా తిప్పితిప్పి చంపుతారూ? మీ పిల్లకి ఇప్పట్లో పెళ్లి చేసే ఉద్దేశం నిజంగా మీకుందాలేదా? నన్ను సంబంధాలు నిజంగా చూడమంటారా వద్దా?" అన్నాడు పరమేశ్వరశాస్త్రి మరింత విసుగ్గా. ఒక నెయ్యీలేదు, పాడు లేదు ఏం ఉప్మా ఇది? అనుకున్నాడు లోలోన కసిగా. నిజంగానే ఆ రోజెందుకో ఉప్మాసరిగ్గా కుదరలేదు. అది అతని విసుగుదలకి కారణం.

"వొద్దు''

ఆ మాటలకి పరమేశ్వరశాస్త్రి నిర్ఘాంతపోయాడు.

"ఏంటమ్మా నువ్వనేది?" అన్నాడు భారతివైపు ఆశ్చర్యంగా చూస్తూ.

"ఆ మాటలన్నది మా అమ్మ కాదు నేను'' అంది సుజీవన అప్పుడే బయట్నుంచి లోనికి ప్రవేశిస్తూ.

పరమేశ్వరశాస్త్రితో పాటు ఆ దంపతులిద్దరూ కూడా ఆశ్చర్యంగా చూశారామె వైపు.

"నీకేవన్నా మతిపోయిందా ఏమిటీ?" అంది భారతి గాభరాగా.

"ఏం మాటలమ్మా అవి?" అన్నాడు పెంచలయ్య బాధగా. "నేనసలు నీకు పెళ్లే చెయ్యలేననుకుంటున్నావా ఏమిటి?"

తండ్రి మాటల్లోని ఆవేదనను అర్థం చేసుకున్న సుజీవన "అహం.. అది కాదు నాన్నా'' అంది నొచ్చుకోలుగా.

"మరైతే నీ మాటలకర్థమేంటీ?" భారతి కళ్లెరజేస్తూ అంది.

"మీరు నా పెళ్లి చేయలేరని నేనేం అనట్లేదు. ఆ శాస్త్రిగార్ని నా కోసం సంబంధాలు చూడనవసరం లేదంటున్నానంతే'' అంది సుజీవన పూర్తిగా లోపలికొచ్చి ఖాళీగా వున్న ఓ కుర్చీలో కూర్చుంటూ.

"ఎదురుమతం మాటలు మాట్లాడబాకు. ఎవరో ఒకరు సంబంధాలు చూడందే ఎలా జరుగుతుందే నీకు పెళ్లి'' అంది భారతి కటువుగా.

"పెళ్లిళ్లు స్వర్గంలో ఆల్రెడీ జరిగిపోయుంటాయ్. కాబట్టి ఎవరూ సంబంధాలు చూడకపోయినా ఆ టైమొచ్చినప్పుడు భూలోకంలో కూడా అవి ఆటోమాటిగ్గా జరిగిపోతూనే వుంటాయి'' అంది సుజీవన ఏదో కొత్తనిజాన్ని చెబుతున్నదానికి మల్లే.

"అలాగా? మరైతే మేమంతా ఎందుకూ?" అన్నాడు పరమేశ్వరశాస్త్రి గాల్లో చేతులు తిప్పుతూ.

"అప్పుడప్పుడూ వచ్చి టిఫిన్లు మెక్కిపోవటానికి'' అనేసింది సుజీవన ఠక్కున. ఆయన్ను హర్ట్ చెయ్యాలని కాదు నోరు స్లిప్పైపోయిందామెకి.

సహజంగానే ఆమె మాటలకి పరమేశ్వరశాస్త్రి ముఖం కందగడ్డలా అయ్యింది. "చూశారా చూశారా! ఎంత మాటనేసిందో చూశారా?" అన్నాడు ఉక్రోషంగా.

"ఏం మాటలే అవి? నోటికి హద్దూ పద్దూ ఉండక్కర్లా?" భారతి కూతుర్ని మందలిస్తూ అంది.

"సారీ శాస్త్రిగారూ! పొరపాట్న నోరు జారి..." అని సుజీవన ఇంకా చెప్పబోతూనే ఉంది, కానీ ఆ సరికే పరమేశ్వరశాస్త్రి విసురుగా లేచి నిలబడ్డాడు. "నేనేం అంత కక్కుర్తిగాణ్ణి కాదమ్మా టిఫిన్లకోసం మీ ఇంటికి రావటానికి. మళ్ళీ ఈ ఇంటిగడప తొక్కితే ఒట్టు'' అనేసి ఆగ్రహంగా వెళ్ళిపోయాడు అక్కణ్ణుంచి.

"శాస్త్రిగారు... శాస్త్రిగారూ'' అని పెంచలయ్యా, భారతీ వెనుక నుంచి పిలుస్తున్నా

వినిపించుకోకుండా ముంగిసచే తరమబడుతున్న జెర్రిగొడ్డులా విసవిసా ముందుకు సాగిపోయాడు.

"ఎంత పని చేశావ్?" అంది భారతి నెత్తి బాదుకుంటూ.

"ఇదేం బాలేదమ్మా'' అన్నాడు పెంచలయ్య తల పట్టుకుంటూ.

"మరేం పర్లేదులే నాన్నా! ఆయనతో మనకింక పనేం లేదు'' అంది సుజీవన చిన్నగా నవ్వేస్తూ.

"అంటే?" అన్నారా దంపతులిద్దరూ సంయుక్తంగా.

"నేను చెప్పింది విని మీరు కోప్పడకూడదు'' అంటూ ముందుగానే ఓ కండిషన్ విధించి, ఆ మీదట నిదానంగా చెప్పుకొచ్చింది సుజీవన... చిత్రవిచిత్రమైన ఆ కరపత్రోదంతం యావత్తూ.

అదంతా విని సహజంగానే నిర్ఘాంతపోయారా దంపతులిద్దరూ

"నిజమేనా అదంతా? నిజంగానే అతను నిన్ను పెళ్ళిచేసుకుంటానన్నాడా? మరైతే అతను రాలేదేం?" అన్నాడు పెంచలయ్య ఆశ్చర్యంలోంచి తేరుకున్నాక.

"రేపు లేదు ఎల్లుండి మంచిరోజుట... వాళ్ళ పెద్దవాళ్లని వెంటబెట్టుకొస్తానన్నాడు'' చెప్పి బిడియంగా తల దించుకుంది సుజీవన.

"మరి కట్నం?"

"నేనే అతనికి కట్నం! పెళ్ళి ఖర్చులు కూడా మనం పెట్టుకోవాల్సిన పనిలేదు'' అంది సుజీవన మరింత బిడియపడిపోతూ.

ఒక ఆడపిల్ల తండ్రికి అంతకన్నా శుభవార్త ఇంకేమైనా ఉంటుందా?

"ప్రేమార్తికీ జై!!" అనరవాలనిపించింది పెంచలయ్యకి.

అయినా పెద్దరికం అడ్డురావటంవల్ల, ఎలాగో నిగ్రహించుకున్నాడు.





అప్పటికే విషయమంతా అర్థమైపోయిన సుజీవన చెల్లెళ్ళందరూ "మా అక్కయ్య పెళ్ళికూతురాయెనే' అని కోరస్‌గా పాటందుకోగా.

"ఎప్పుడూ?" అన్నాడు వాళ్ళ ఒక్కగానొక్క తమ్ముడు.

సుజీవన వాడికేసి మురిపెంగా చూస్తూ 'అసలు నీ వల్లేరా ఇదంతా జరిగింది. ఆరోజు నువ్వా కరపత్రంతో కాగితం పడవ చేసుండకపోతే నాకింత మంచి మొగుడొచ్చేవాడా?' అనుకుంది మనసులో.

సూరిబాబులాంటి ప్రేమార్తి కలిగిన మనిషి నిస్సందేహంగా మంచి మొగుడే అవుతాడన్నది ఆమె విశ్వాసం.



కక్కులైనా ఆగుతాయేమోగానీ, కళ్యాణాలు ఆగవుగదా!

అనతికాలంలోనే అన్నీ సక్రమంగా జరిగి- ఒకానొక శుభదినాన్న... సూరిబాబు-సుజీవన, కనకలింగం- ప్రహేళికలు దంపతులైపోయారు ఒకే పందిట్లో.

దరిమిలా ఆ మిత్రులిద్దరూ వారివారి భార్యలకు అణిగిమణిగి వుంటూనూ భార్యల ప్రేమ పొందుతూనూ ఎంతో సుఖంగా జీవించటం ప్రారంభించారు.



# 'నీడ' పై సమీక్షలు

ఫిబ్రవరి 'చతుర'లో ప్రచురితమైన జె.వి. బాబు రచన 'నీడ'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## తల్లిదండ్రులూ ఆలోచించండి!

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

స్త్రీల సమస్యల గురించి ఎన్నో నవలలు వస్తున్నాయి. అయితే పరిష్కారాలు మాత్రం పాతగానే ఉంటున్నాయి. అలాంటి సమస్యాత్మక నవల జె.వి. బాబుగారి "నీడ". పుట్టినింటినుంచి మెట్టినింటికి భర్తే సర్వస్వం అని నమ్మివచ్చిన అబలకు ఆ భర్తే మృత్యువు నీడ అయితే ఆమెకు ఒక చల్లని నీడ అవసరం అవుతుంది. ఆ నీడలో ఆమె సేదతీరి తన జీవితాన్ని తీర్చిదిద్దుకుంటుంది.

ఈ మధ్యతరగతి సమాజంలో తల్లితండ్రులకు ఆడపిల్ల ఒక గుదిబండ. గుండె మీద మోయలేని బరువు ఏదో ఒక సంబంధంచూసి ఆమెను వదిలించుకోవాలి. ఏ తండ్రి తన కూతురు భవిష్యత్ గురించి ఆలోచించడంలేదు. వీలైనంత త్వరగా ఆమె ఇంటినుంచి వెళ్ళిపోవాలి. మళ్ళీ రాకూడదు భర్తను వదిలేసే కారణాలు ఏవైనా భర్తతోటిదే ఆమెకు లోకం. భర్త ఎటువంటివాడైనా ప్రత్యక్షదైవమే! అలా విచక్షణారహితంగానే ఊహిస్తే గౌతమిలాంటి అమ్మాయిలకు సత్యమూర్తిలాంటి భర్తలు దాపురిస్తారు.

చావైనా బతుకైనా ఆ భర్తతోటే అంటారు. పుట్టింటినుండి దూరికరువయ్యాక ఆమెకు రెండే రెండు దారులు. ఒకటి ఆత్మహత్య, రెండోది ఏదైనా చల్లని నీడ. ఇలా సంఘానికి భయపడక చేయూత యిచ్చే వారెందరు? వంశీకృష్ణలాంటి వాళ్ళెందరు? వంశీకృష్ణ చేయూత యివ్వడంతో పార్వతమ్మ అండతో, రేణుక సలహాలతో తన జీవితానికి సోపానం వేసుకుంటుంది.

కథ చాలా సామాన్యమే అయినా ఈనాటి మధ్యతరగతి అమ్మాయిలకు ప్రతీక గౌతమి. దొరికిన చేయూతతో ధైర్యంగా ముందడుగు వేయగలుగుతుంది. తల్లితండ్రులు ఇవ్వలేని అండ పక్కింట్లో దొరకడం అక్కడ అందరూ ఆమె గురించి ఆలోచించడం, చివరికి పని మనిషి వరాలు కూడా ఆమె తరఫున సత్యమూర్తితో మాట్లాడడం గౌతమి అదృష్టమే మరి!

సాటిమనిషి గురించి ఈ సమాజంలో ఆలోచించేవాళ్ళు తక్కువ. ఎవరో ఒకపక్కింటి మహిళ గురించి వంశీకృష్ణ రిస్క్ తీసుకోవడం కొంచెం అసహజం అన్పించినా అతనికి స్త్రీలమీద సానుభూతి, గౌరవం కారణం అని అనుకోవచ్చు.

చివర సన్నివేశం కొంచెం సినిమాటిక్‌గా ఉంది. ముందునుండి ఎంతో దుర్మార్గుడైన సత్యమూర్తిని అతడిచేతిలో నరకాన్ని చూసిన గౌతమి సేవచేయడానికి వెళ్ళడం, చివరికి అతడు మారాడని రూఢి చేసుకుని అతనితో కలసి బతకాలనుకోవడం, సత్యమూర్తి తన బిడ్డను 'వంశీ' అని పిల్చుకోవడం చివరివరకూ భార్యను అనుమానించే సత్యమూర్తి అన్న హితబోధతో మారని సత్యమూర్తి స్నేహితుల అలక్ష్యంతో మారని సత్య

మూర్తి కేవలం డాక్టర్ సమన్విత, వంశీకృష్ణ కాబోయే భార్య అని తెలుసుకున్న తర్వాత మారడాన్ని బట్టి అప్పటికి భార్యమీద అనుమానం నివృత్తి అయింది కాబట్టి మారాడని తెలుస్తుంది. ఒకవేళ వంశీకృష్ణ పెళ్ళి చేసుకోకపోయి ఉంటే మారినట్లు నటించి ఉండేవాడేమో! అనుమానం మాత్రం మనసులో ఉండేదేనేమో?

లారీకింద పడిన సత్యమూర్తికి కేవలం కుడిచేతికి మాత్రమే దెబ్బలు తగలడం, కాలు, చెయ్యి, నోరు పడిపోయిన ప్రభాకరరావు లేచి తిరుగుతూ మాట్లాడగలగడం, కంప్యూటర్ కోర్స్ చేసిన గౌతమి విదేశాలకు వెళ్ళి స్థిరపడాలనుకోవడంలాంటి కొన్ని అసహజాలు ఉన్నాయి. గౌతమికి దొరికిన వంశీకృష్ణలాంటి నీడ ఎందరు గౌతమిలకు దొరుకుతుంది అన్న ప్రశ్నను రేకెత్తిస్తుంది. స్త్రీ సేవాసంఘాలు, తల్లిదండ్రులు ఆడపిల్లలకు కాస్త చేయూత ఇస్తే వాళ్ళు తమ కాళ్ళమీద తాము నిలబడగలిగే మనోధైర్యాన్ని తెచ్చుకుంటారు. ముఖ్యంగా రేణుక, పార్వతమ్మ పాత్రలు ఈ నవలకు జీవాన్ని పోశారని చెప్పవచ్చు. ముఖ్యంగా ప్రతి తండ్రి చదవదగ్గ నవల ఇది అని చెప్పవచ్చు. అందుకే తండ్రులూ ఆలోచించండి అని చెప్పాల్సి వస్తుంది. ముగింపు పాతతరహాగా గాక కాస్త కొత్తరకంగా ఉంటే గౌతమిలాంటి ఆడవాళ్ళకు కొత్తదారి చూపించినట్లు ఉండేది.

-యం. సుదర్శనబాయి
మదనపల్లి - 517 327

## 'రాజీపడ్డ రచయిత'!

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

'నీడ చదువుతున్నంతసేపు 'రాజశ్రీ పిక్చర్స్ వారి 'చిత్ చోర్', 'ఛోటీ సీ బాత్' లాంటి చిత్రాలు గుర్తొచ్చాయి. వారి చిత్రాలలో పరిస్థితులే ప్రతినాయకులు. పాత్రలన్నీ సాధుస్వభావం కలిగి, నిష్కల్మషమై, దయార్ద్రహృదయాలై ఉంటాయి.

నవలలో ఆద్యంతం వంశీకృష్ణని మహోన్నత వ్యక్తిగా చిత్రీకరించడాన్కి ప్రాధాన్యతనిచ్చారు. 'బిజినెస్ మన్'గా క్షణకాలంలో గౌతమిని తమ ఇంటికి తీసుకురావడాన్కి నిర్ణయం తీసుకొన్న వంశీకృష్ణకు, ఆ తర్వాత గౌతమి విషయం ఏంచెయ్యాలో, సత్యమూర్తి ఆట ఎలా కట్టించాలో తెలియక అచేతనుడై, రేణుకపాటి విజ్ఞతని కూడా ప్రదర్శించకపోవడం విస్మయాన్ని కల్గిస్తుంది. తమ కుటుంబానికి చెడ్డపేరు రాకుండా గౌతమిని రేణుక ఇంట్లోనే ఉంచితే సరిపోతుందనేది స్ఫురణకు రాకపోవడం శోచనీయం.

వార్ధక్యం, అనారోగ్యం అతి సహజం. తల్లిదండ్రులను చక్కగా చూచుకోడాన్కి పెళ్లి ఒక ప్రతిబంధకం అనుకోడం అవివేకం. 'బిజినెస్ ఎక్సలెన్సీ' లాంటి అవార్డులతో వ్యాపారంలో ఉన్నత శిఖరాలను ఎక్కిన వంశీకృష్ణకు తల్లిదండ్రులను చక్కగా చూసుకునే ఏర్పాట్లు చేసుకోలేక, చిన్నచిన్న సమస్యలని అధిగమించడం చేతకాక జీవితాన్ని చీకటిమయం చేసుకోవాలనుకోవడం వింతగా ఉంది.

గౌతమిపట్ల ఒకరకమైన అభిప్రాయం ఉన్నవాడిలా కనిపిస్తూ కూడా చివరికి గౌతమిని 'ఒక అందమైన పుష్పాన్ని ప్రకృతి ప్రేమికుడిలా మాత్రమే చూశాడని' రేణుక మాటల ముసుగు కప్పారు. ఇక్కడ రచయిత రాజీపడ్డారే తప్ప, అభ్యుదయంవైపు అడుగువెయ్యడానికి సాహసించలేదు. అందుకేనేమో అందం, ఐశ్వర్యం, చదువు, సంస్కారంలో వంశీకృష్ణ స్థాయికి ఏమాత్రం తీసిపోని సమన్విత పాత్రని సృష్టించారేగానీ గౌతమిని, వంశీకృష్ణని కలిపే సాహసం చెయ్యలేదు. సత్యమూర్తిలో పరివర్తనని తీసుకొచ్చి హైందవస్త్రీకి (భర్త రాక్షసుడైనా) భర్త నీడే శరణ్యం అని శలవిచ్చారు.




భావ వ్యక్తీకరణ చక్కగా ఉండి మొత్తంమీద ఫరవాలేదనిపించింది.

-పి. చంద్రశేఖర్,
బరోడా - 390 007.

## మహిళా రిజర్వేషన్

(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

"నీడ" నవలలోని ఇతివృత్తం ఒక సమస్యగా దేశమంతటా వ్యాపించి వుంది. ఆడపిల్లలను, కట్నం ఇచ్చి, పరపురుషునికి, వివాహం పేరుతో అతని ఇష్టానిష్టాలకి వదిలివేయటం జరుగుతుంది. ఈ లోకువైన స్థితిలో ఏమిచేసినా ఫర్వాలేదని, మరల ఇంకొంత కట్నం తెమ్మని, ఏమైనా ఆమె పేర ఆస్థి వుంటే, అతని పేర వ్రాయమని, వేధించే సంఘటనలు ఎన్నో. ఇటువంటి సమస్యను రచయిత ఎన్నుకోవటం బావుంది.

అయితే నవలలోని ముఖ్యపాత్ర గౌతమికి అన్ని ప్రత్యేకతలు (రిజర్వేషన్లు) వుండబట్టి, ఈ సమస్య పరిష్కారానికి వీలైంది. ఆమె అందంగా, ఆకర్షణీయంగా, అమాయకంగా వుండటం, ఒక ధనిక, యువకుడు, అవివాహితుడు, పరిధిలోనికి రావటం వల్ల, అతని తల్లిదండ్రులు వికలాంగులగుటవల్ల, తన ఇంటిలోనికి తీసుకురావటం వీలైనది.

ఒక పేదరాలు సామాన్య అందంగల స్త్రీకి ఇటువంటి పరిష్కారం సాధ్యమా! ఇక్కడ నవల వాస్తవానికి దూరంగా వుంది. అయినప్పటికీ మన సామాజిక కట్టుబాట్లను పక్కన బెట్టి పరాయిస్త్రీని రక్షించడం సాహసమే అనిపించుకుంటుంది.

గౌతమి భర్తకు అంగవైకల్యం కలగటం అనే మలుపు సహజంగా బావుంది. దీనికితోడు అతని అన్న పాత్ర కూడా!

మొత్తంమీద ఇటువంటి నవల సామాజిక స్పృహకు అవసరం.

-మాండ్రేటి శ్రీనివాసరావు,
రాజమండ్రి - 1.

## ఉత్కంఠ భరితం

(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

నవసుమసౌరభాల 'నీడ' మళ్ళీమళ్ళీ చదివించి కొత్తదనాన్ని ఆస్వాదింపచేస్తుంది! మాటల పొందిక, ధారావాహిక భావపరంపర పాఠకుడిని ఏకాగ్రతతో చదివింపచేస్తుంది..

ఇతివృత్తం పాతదే అయినా ఆదినుంచి అంతంవరకూ కొత్త పోకడలతో కొత్త తీర్పులతో నైతికభావాలు చెడకుండా పాఠకుల ఉత్కంఠతను పెంచుతూ సమర్ధవంతంగా కథాగమనాన్ని సాగించారు రచయిత. పాఠకుడు కథలో లీనమైపోయాడు అంటే అది రచయిత నైపుణ్యమేననాలి.

'నీడ'లోని ఆదర్శ, ఉదాత్త కథానాయకుడు వంశీకృష్ణపై పాఠకులకు గౌరవభావం ఏర్పడి కథవరకూ నిలుస్తుంది. శ్రీమంతులైనా వారి కుటుంబం విధివంచితులవటం సహజంగా మలచబడింది.

"కొద్ది క్షణాలు మాత్రమే ఆమె సంశయించింది... అడుగువేసేలా చేశాయి''లాంటి మాటలు మన మనసులోంచి వెలువడి రచయిత కలం ద్వారా ఉరవడిగా దొర్లి మనకు ఊరటనిస్తుంది. ఇలా మారిస్తే బాగుంటుందేమో అనే ఆలోచనకు తావులేకుండా ప్రతిపాత్రనూ ప్రతిమాటనూ తూకంవేసినట్లు మలచారు రచయిత. ఆ పాత్రలలోని ప్రతిమాట పాఠకుల హృదయాంతరాళాలలోనుంచి వచ్చినట్లే అనుభూతి కలుగుతుంది. ప్రతిపాత్ర నిర్ణయాలు, సలహాలు, ఇంక చెప్పడానికేమీ లేదన్నట్లు మాటల కొలబద్ధతో విశదంగా పలికించి, ఆరంభంనుంచీ అంతంవరకూ పాఠకులను

దయార్ద్రహృదయులను చేసి సంతృప్తిపరుస్తుంది 'నీడ' నవల.

ఏదేమయినా 'నీడ' నవలను వదలకుండా చదివింపచేసి, మనంకూడా ఏ కొందరికైనా ఇలాంటి 'నీడ నెందుకివ్వకూడదన్న ఉత్తేజభావం కలిగించేవిధంగా రాయగల్గిన జె.వి.బాబుగార్కి సమాజం ఎంతయినా ఋణపడిఉంది.

-భాగవతుల సరోజినీదేవి,
పానగల్ - 517 640

# అక్షర దీపం

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**నే**టి నాగరిక సమాజంలో పొడచూపుతున్న అనాగరిక పోకడలను పారద్రోలడానికి 'నీడ' నవలలాంటి అక్షరదీపాల ఆవశ్యకత ఎంతైనా ఉంది. దానిని గుర్తించి నెలనెలా వైవిధ్య భరితంగా చక్కని ఇతివృత్తాలతో రసరమ్యమైన నవలలను అందిస్తూ 'చతుర' నవలా రంగంలో మేటిగా నిలుస్తుందనడంలో అతిశయోక్తి లేదు.

నీడ నవలలోని సమస్య చాలా సున్నితమైనదిగా, చిన్నదిగా అనిపించవచ్చు. కాని కాస్త లోతుగా ఆలోచిస్తే నేటి సంఘంలో అది ఎంతటి జటిలమైన సమస్యో అర్థమవుతుంది. మనం ఆధునికంగా ఎంతగా పురోగమిస్తున్నామో మనతోపాటు అనైతికంగా పురుషాధిక్యాన్ని కూడా అదేస్థాయిలో పెంచుకుంటూ పోతున్నామనడానికి సత్యమూర్తి పాత్రే తిరుగులేని సాక్ష్యం! అలాగే భర్త నిరంకుశత్వానికి బలై అనుక్షణం అల్లాడిపోయే అబలగా గౌతమి పాత్ర కూడా సాక్షాత్కరిస్తుంది. అయితే ఈ సమస్య కొత్తదికాదు. కాని రచయిత కథను నడిపిన తీరు నవ్యతను సంతరించుకొని చూపించిన పరిష్కారం ఆమోదయోగ్యంగా అనిపిస్తుంది.

నాలుగుగోడల మధ్య సంస్కారవంతంగా సాగాల్సిన భార్యాభర్తల సంసారం భర్త దురహంకారంతో వీధినపడ్డప్పుడు దానిని కుటుంబ సమస్యగా కాకుండా ఒక సామాజిక సమస్యగా గుర్తించాలన్న రచయిత అంతర్లీనమైన తపన హర్షణీయం!

నవలలో ఒక్క సత్యమూర్తి పాత్ర తప్ప వంశీకృష్ణ మొదలు ఆ ఇంటిపనిమనిషి వరకూ అన్ని పాత్రలు పాజిటివ్‌గా ఉండి గొప్ప మానవతా విలువల్ని సంతరించుకొని తమతమ స్థాయిలలో తగిన ఔన్నత్యాన్ని చాటుకున్నాయి. వంశీకృష్ణ పాత్ర నేటి యువతరానికి ఒక చక్కని టానిక్ అని చెప్పుకతప్పదు.

గౌతమి తండ్రిని ఒక మధ్యతరగతి మూసపాత్రగానే మిగల్చడం సమంజసం కాదేమో! పన్నీటితో కాళ్ళు కడిగి కన్యాదానం చేసిన ప్రతితండ్రీ తన కూతురి కోసం జీవితాంతం అల్లుడికాళ్ళు కన్నీటితో కడుగుతూనే ఉండాల్సిన అవసరంలేదు. అన్యాయం అనుకున్నప్పుడు కాళ్ళు కడిగిన ఆ చేతులతోనే కాలర్‌పట్టుకొని నిలదీయగలిగితే నేటి అబలలకు ఈ దౌర్భాగ్యపు స్థితి ఎదురయ్యేది కాదేమో!

ఏది ఏమైనా ఇటువంటి సున్నితమైన సామాజిక సమస్యలను కూకటివేళ్ళతో పెకిలించడానికి 'నీడ' లాంటి స్ఫూర్తినిచ్చే నవలా వేదికలు ఎంతైనా అవసరం. రచయిత జె.వి.బాబుగారికి హృదయపూర్వక అభినందనలు! 'చతుర' సామాజిక స్ఫూర్తికి అక్షరసుమాంజలులు!!

-ఎన్.ఎం.కె. చౌదరి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331250.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78


# కొందరికి కారం అంటే మమకారం!

ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.










priya

Pickles
ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంగి

**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,**(ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 4